# స్వయంసాహాయ్యము

(మొదటిభాగము)

(A free rendering of Smiles' Self-Help in Telugu)

ఇయ్యది

చిలుకూరు - వీరభద్రరావు గారిచే

రచియింపఁబడినది

రెండవకూర్పు 500 ప్రతులు

చెన్నపట్టణము

జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె

1912

---

వెల 0-8-0



# పీఠిక

'స్వయం సాహాయ్యము' వలన నెంతటి కార్యమునైనను సాధింపవచ్చు నని సోదాహరణముగ గ్రంథరూపమున లోకమునకు మొట్టమొదటఁ జాటినవాఁడు 'స్మైల్సు' అను ఆంగ్లేయవిద్యావిశారదుఁడు. ఈతని గ్రంథములయందు నాకత్యంతప్రీతి కలదు. సదావానినే పఠించుచుందును. ఇట్లుండ నాప్రియమిత్రు లగు శ్రీయుత చిలకమర్తి - లక్ష్మీనరసింహముగారు, 'మనోరమ' అను నొకమాసపత్రికను స్థాపించి అందుఁ బ్రచురించుటకై 'స్మైల్సు' విద్వాంసునిచే రచింపఁబడిన 'సెల్ఫుహెల్పు (Self-Help) అను నింగ్లీషు గ్రంథమును భాషాంతరీకరింపఁ గోరిరి. ఆ పండితవర్యునియందు నాకుగల భక్తిచేతను మిత్రుని మాటను త్రోసివేయఁజాలకయు ఈ గ్రంథమును నాశక్తికొలఁది స్వేచ్ఛగాఁ దెనిఁగించి యేడెనిమిది సంవత్సరముల క్రిందటనే మనోరమ పత్రికలోఁ బ్రకటించితిని.

'మనోరమ'లో అచ్చుపడిన గ్రంథము లచిరకాలముననే యమ్ముడు వోయినవి. తరువాత నీ గ్రంథము కొఱకై పలువురు నన్నడుగుచు వచ్చిరి. ఇంతలో చెన్నపట్టణములోని 'విజ్ఞానచంద్రికాపరిషత్తు' వారు 1913 సంవత్సరపుంబఠనీయగ్రంథ

ములలో నొకటిగా దీని నియమించిరి. కావున దీని నిప్పుడు పునర్ముద్రణము గావించి యున్నాఁడను.

'స్మైల్సు' గ్రంథకారుని యందుగల యాదరాతిశయముచే నైనను ఆంధ్రజను లీగ్రంథములోని దోషములను మన్నించి గుణములనే గ్రహింతురుగాక.

15—12—1912
మద్రాసు

గ్రంథకర్త

# స్వయంసాహాయ్యము.

## ప్రథమభాగము



## మొదటిప్రకరణము.

### స్వయంసాహాయ్యము—దేశీయము—స్వకీయము.

తనకుఁదాను సాహాయ్యపడుట స్వయంసాహాయ్య మనఁబడును. అనఁగాఁ దనజీవయాత్ర నడుపునపు డీప్రపంచమున నేకార్యము నిర్వహింపవలసి వచ్చినను పరులసాహాయ్యమును నమ్ముకొనక ముందుగాఁ దనకుఁదాను దోడ్పడి తనకృషి జయప్రదమయినదిగాఁ జేసికొనవలయును.

మనుజునియొక్క బాహుళ్యమయిన ప్రపంచానుభవమంతయు నొక చోటునకుఁ జేర్చి వడఁబోసి శోధించి చూచినయెడల నెవఁడైతే తనకుఁదానే తోడ్పడఁగలఁడో వానికే దైవమును దోడ్పడుననుట పరమసిద్ధాంతముగాఁ గన్పట్టఁగలదు. స్వయంసాహాయ్యమును గాంక్షించిన యుత్సాహమే నిజమైన యాత్మాభివృద్ధికి మూలశక్తిగా నున్నయది. ఇట్టి యుత్సాహమే యనేకుల కుదయించినయెడల నదియే దేశాభివృద్ధికి సత్యముగ నుత్పత్తి స్థానముగా నుండును. వెలుపలనుండి రాఁగలసాహాయ్య మొకానొకప్పుడు బలక్షయముగ ఫలము నీయక పోవచ్చునుగాని లోపలనుండివచ్చెడుసాహాయ్యమే దృఢమైనశక్తిని ప్రజ్వలింపఁ జేయును. జనసామాన్యముకొఱకుఁగాని లేక యాయాతరగతులకొఱకుఁగాని యేమిచేయఁబడినను, స్వయంసాహాయ్యముయొక్క యావశ్యకమును మానవాభివృద్ధికిఁ గావలసిన యుత్తేజకశక్తిని తొలఁగించుటయేకాని వేఱొకటిగాదు. ఎచట ప్రజలు మిక్కిలి కట్టుదిట్టములగు చట్టములచే బంధింపఁబడి పరిపాలింపఁ

బదుమరో యంతట వారిని గోడ్పాటులేనివారినిగాఁ జేయుటయేగాని వేఱొం డుగాదు. ఎట్టిమంచి యేర్పాటులయినను మనుజునకుఁ జులుకయిన సాహాయ్యము సేయఁజాలవు. ఒకవేళ వానిలో ననేకములు తనంతటతాను వర్ధిల్లుటకును స్వకీయస్థితిఁ బెంపొందించుటకును మనుజుని స్వేచ్ఛగా విడిచిపెట్టవచ్చునుగాని యెల్లప్పుడును ప్రజలు తమయొక్క సుఖాభివృద్ధులు తమసత్ప్రవర్తనమువలనఁ గాక సంఘమువారియొక్క యేర్పాటులమూలముననే బడయవలెనని నమ్ముచున్నారు. మానవాభివృద్ధికొఱకొక కారణముగా నుండుధర్మశాస్త్రనిబంధములయొక్క విలువ హెచ్చుగా మదింపు వేయఁబడుచున్నది. మూఁడుసంవత్సరములకుఁగాని అయిదుసంవత్సరములకుఁగాని యొకరిద్దఱిని నేర్పాటు చేయుట మాత్రముగా ధర్మశాస్త్రనిబంధనములోనికోట్యంశము నిరూపించుట యెంత హృదయపూర్వకముగా నెఱవేర్చినను నయ్యది మనుజునియొక్క జీవితమునందుఁగాని ప్రవర్తనమునందుఁగాని తనయొక్క యధికారమును బూర్ణముగాఁ జూపఁజాలదు. ఇంతియగాక ప్రజల మానప్రాణవస్తువాహనాదులను రక్షించుటయందు పోలీసువారివృత్తి వాస్తవమయినదిగాను చులుకయినదిగాను యుండక లేదనునట్టిదిగాను నిర్బంధకరమయినదిగాను నున్నయది. చట్టములు చక్కఁగాఁ బ్రవర్తింపఁ జేయఁబడినప్పుడు స్వల్పస్వార్థత్యాగముతో మానసికమయినట్టిగాని దేహసంబంధమైనట్టిగాని తమపాటుయొక్క ఫలమును ప్రజలనుభవింపఁగలరు. అయినను శాసనములెంతకఠినములుగా నున్నను సోమరులను పాటుపడువారినిగాను, అమితవ్యయము చేయువారిని దీర్ఘదృష్టిగలవారినిగాను, త్రాగుఁబోతులను శాంతమూర్తులనుగాను జేయఁజాలవు. అట్టిసంస్కరణములు స్వాచరణమువలనను, ఆయమునుమించని వ్యయము చేయుటవలనను, వైరాగ్యమువలనను, సదభ్యాసమువలనను సానుకూల్యములు కాఁగలవు.

ఒకదేశముయొక్కఁగాని తెగయొక్కఁగాని ప్రభుత్వ మనునది యట్టిదేశములోఁగాని తెగలోఁగాని యున్నట్టిప్రజలయొక్క ప్రతిబింబమేగాని వేఱొండుగాదు. సృష్టిస్వభావమును బట్టి ప్రభుత్వమెంతచక్కనిదైనను క్రమక్రమముగాఁ బ్రజ లేస్థితియం దుందురో యట్టిస్థితితోడ సమానముగ స్థితికి రాఁగలదు.

సంచివారు మంచిగఁ బరిపాలింపఁబడుచుందురు. మూర్ఖులును భ్రష్టులును నీ
చముగాఁ బరిపాలింపఁబడుచుందురు. ఒకరాష్ట్రముయొక్క బలమును విలువ
యును తద్రాష్ట్రప్రజల ప్రవర్తనముఁబట్టి యుండును గాని శాసనముల ననుసరించి
నిరూపింపఁ గారాదు. ఎందువల్లనన దేశస్థితిననుసరించియుండును. దేశాభి
వృద్ధి యనఁగాఁ బ్రజయొక్క కృషి, శక్తి, న్యాయప్రవర్తనము, మొదలగువాని
యొక్క యభివృద్ధియే. దేశముయొక్క హైన్యస్థితి యనఁ బ్రజలయొక్క సోమ
రితనము, స్వార్థపరత్వము, దుర్మార్గము మొదలగు దుర్గుణములపుంజమే. ఏవి
మనము సంఘదురాచారములని భావించుచున్నారమో యవియెల్లను మనుజుల
నికృష్టజీవనముంబట్టి యేర్పడినవేగాని వేఱొండుగావు. వానినెల్లను మనము
శాసనములు గల్పించి నిర్మూలముఁ జేయఁ బ్రయత్నింపవచ్చును గాని మనుజుల
యొక్క ప్రవర్తనము చక్కఁబడి స్థితిగతులు శీఘ్రకాలములో మాఱి యభి
వృద్ధి గాంచిననే గాని యాదురాచారములెల్లను రూపాంతరమును వహించి
మఱలమరలఁ దలసూపుచుండును. ఈయభిప్రాయమే క్రమమయినదయిన
యెడల దేశాభిమానమును, పరోపకారమును, స్వకీయస్వేచ్ఛాప్రవర్తనమును
బట్టి వానియంత యవియే యభివృద్ధిఁ గాంచుటకు మనుజులకుఁ దోడ్పడి ప్రోత్సా
హము పెట్టుటయందుఁ గానిపించును గాని చట్టములయొక్కయు సంఘనిబంధన
ములయొక్కయు మార్పులలోఁ గానుపింపవు. అది యెంత గొప్పచెడుగుగా
నున్నను, ఒక నిరంకుశాధికారివలనఁ బరిపాలింపఁబడువాఁడుమాత్ర మొక
గొప్పబానిసవాఁడు గాఁ జాలఁడు గాని యజ్ఞానాంధకారమున మునిఁగి స్వార్థ
పరుఁడయి దుష్టుఁ డగువాఁడే బానిసవాఁడని తలఁపవలయును. హృదయ
పీఠమున దుర్గుణపుంజముల కెల్ల దాస్యముచేయు తెగలవారు పరిపాలకుల
మార్పులవలనఁగాని ప్రాంతకట్టుబాట్లమార్పులవలనఁగాని దాస్యమునుండి విము
క్తిని గాంచఁజాలరు ప్రతిమానవుఁడును దనయభివృద్ధికయి పాటుపడ నేర్చుకొని
యెప్పుడు కృతకృత్యుం డగునో యప్పుడే దేశమున కంతకు నభివృద్ధి కలుగు
చుండును.

అభివృద్ధియందు జనసామాన్యము నతిక్రమించి ప్రసిద్ధిఁగాంచిన పురుషవరు లనేకులు గానుపించుచున్నను వినికిడిలేని బీదకుటుంబములలోని వారలుగూడ మనయభివృద్ధికిఁ గారకు లగుచున్నారని మనము విశ్వసింపవలసి యుండును. యుద్ధములయందు జయముపొందినపుడు సేనాధ్యక్షులుగా నుండు వారలనామములుమాత్రమె బయలుపడి స్మరింపఁబడుచున్నను సత్యమును విచారించి చూచినపక్షమునఁ బ్రతియుద్ధభటునియొక్క కృషివలననే జయము లభించినదని తెలిసికొనఁగలరు. మనజీవయాత్రకూడ వీరభటుని యుద్ధయాత్ర వంటిది. సమస్తకాలములయందును ఘనకార్యములను నిర్వహించిన మహాత్ములు సామాన్యులలోనే పెక్కండ్రు గలరు. అదృష్టవంతులయి చారిత్రములు వ్రాయఁబడిన గొప్పవారివలెనే చారిత్రములు వ్రాయఁబడనివార లనేకులుగూడ నాగరికతకును నభివృద్ధికిని మూలకారకులుగా నుండిరి. సకాయకష్టకర్మచే జీవించుచు వినయవిధేయతలతో నొప్పిన మర్యాదవంతుఁడయిన బీదవాఁడుసయితము తన దేశముయొక్క యిప్పటియభివృద్ధికిని భవిష్యదభివృద్ధికిఁగూడఁ గారణభూతుఁ డగుచున్నాఁడు. తనసత్ప్రవర్తన మితరులకు మార్గప్రదర్శకముగాఁ జేసి భావికాలమున కంతకును చక్కనిదృష్టాంత ముత్పాదించుచున్నాఁడు. ప్రాణగలమూర్తిమత్త్వమే యితరులయందును వారు చేయుపనులయందును సత్ప్రయోజనత్వమును గల్పించి మంచి యనుభవ విద్యగా నేర్పుచున్నదని మనప్రతిదినానుభవమే వేనోళ్ళఁ జాటుచున్నది. సామాన్యపాఠశాలలలోను, విద్వత్సభలలోను, శాస్త్రపాఠశాలలలోను గఱపఁబడువిద్యకంటె మనగృహములలోను, వీథులలోను, కర్మవిద్యాశాలలలోను, టంకశాలలలోను, యంత్రశాలలలోను, నేతమగ్గములకడను, భూమిదున్నుకడను బ్రదుకుతెఱవులకయి గఱపఁబడువిద్యయే బహువిధముల ప్రాబల్యము గలదిగా నున్నది. గ్రంథములలోనుండి నేర్చుకొనిన యొకవిధమయినవిద్యకంటె స్వాచరణమునకును, ప్రవర్తనమునకును, స్వయంకృషికిని, ఆత్మవశీకరణమునకును దోడ్పడి తనజీవితము

యొక్క విధాయకకృత్యమును నెఱవేర్చుటయందు మనుజుని క్రమపద్ధతికి లోఁబఱచి సంఘమునకుఁ బ్రయోజనకారిగా నొనర్చు ననుభవవిద్యయే పూర్ణమైనవిద్యగాఁ బరిగణింపఁబడునని షిల్లరను నాంగ్లేయ గ్రంథకర్త వ్రాసియున్నాఁడు. యోగ్యవర్తనముగల ఘనుల జీవచారిత్రములు సుబోధములును ప్రయోజనకరములునై యితరులకు మార్గదర్శకములయి తోడ్పడి దారి చూపునట్టివిగా నున్నవి.

ప్రసిద్ధములయిన జీవచారిత్రములలోఁ గొన్ని యుత్కృష్టజీవనమును, సచ్చింతలను, స్వప్రయోజనముకొఱకును ప్రపంచోపయోగము నిమిత్తమును సత్కార్యనిర్వాహకశక్తిని, బోధించునట్టి మతగ్రంథములతో నించుమించుగాఁ దులతూఁగునవి యయియున్నవి. శాస్త్రజ్ఞానము, భాషాపాండిత్యము, శిల్పనైపుణ్యముఁగల ఘనులును, దీర్ఘాలోచనముఁ గలయుపదేశకర్తలును, దయార్ద్రహృదయు లగుప్రభువులును, ప్రత్యేకవర్గమునకుఁ జేరినవారుగాని యౌన్నత్యముఁ జెందినవారుగాని కారు. అట్టివారు శాస్త్రపాఠశాలలలోనుండియు, కర్మవిద్యాశాలలలోనుండియు, వ్యవసాయగృహములలోనుండియు, బీదలకుటీరములనుండియు, ధనికులభవనములలోనుండియును వచ్చినవారుగా నున్నారు. బీదవార లనేకు లున్నతపదవులకు వచ్చియున్నారు. చూపులకు దుర్ఘటములుగాఁ గానిపించెడు గష్టములు వారిమార్గముల కాటంకములుగాఁ జెప్పఁబడలేదు. అనేకవిషయములయం దట్టికష్టములునయితము కార్యనిర్వాహకత్వమునకు సహాయకారులుగా నుండి యాదివఱకుఁ గదలమెదలలేక పడియున్న జీవశక్తులకుఁ బ్రోత్సాహమును గలిగించి కార్యసాధకములుగా నుండును.

దృఢమయినమనస్సు గలిగియుండినయెడల నేపనియయిన మనుజుఁడు సమర్థింపఁగలఁడు. ఇందులకు దృష్టాంతములను బెక్కులు చూపవచ్చును.

గద్యకవులలోఁ గవితా భాసమానుఁ డగు జెఱిమి టెయిల రనునాతఁడును, నూలువడుకు యంత్రమును గనిపెట్టిన రిచార్డు ఆర్కురైటనునాతఁడును, పేరెన్నిక కెక్కిన ముఖ్యన్యాయాధికారియగు టెంటర్డను ప్రభువును, అసమాన చిత్రకారుఁడయిన టర్న రనునాతఁడును మంగలిదుకాణములలో నుండి ప్రబలినవారలే.

నిశ్చయముగా షేక్స్పియ రెవ్వఁడో యెవ్వరు నెఱుంగరు కాని సామాన్యకుటుంబములోనుండి తలయెత్తినాఁ డనుట నిర్వివాదాంశము. షేక్స్పియరుని తండ్రి కసాయివాఁడుగాను పశువులను పెంచి విక్రయించువాఁడుగాను నుండెను. వాని గ్రంథములను జదివినవార లనేకు లనేక విధములుగా వానిని గుఱించి చెప్పియుండిరి. ఎవ్వరేమిగా భావించిన నాతఁడు మాత్రము నాటకములయందు నటుఁడుగా నుండి యనేక పాత్రములఁ బ్రదర్శించుచుండెను. అందుమూలమున సంపాదించిన లోకానుభవమునంతను గ్రహించి తన నాటకములలోఁ జొప్పించి యద్భుతమయిన తనప్రజ్ఞావిశేషమును లోకమునకుఁ బ్రకటించి యున్నాఁడు. ఆతని గ్రంథములు నేఁటివఱకును బఠనీయములయి యోగ్యప్రవర్తనమునకు దారి చూపునవిగా నున్నవి.

కూలికయి యనుదినము పాటుపడి పనిచేయు బీదల తరగతిలోనుండి వాస్తుశాస్త్రజ్ఞుఁ డగు బ్రిండ్లేయును, నౌకాయాత్రికుఁ డగు కూక్కను నాతఁడును, ప్రసిద్ధకవియగు బర్న్సను నాతఁడును, ప్రఖ్యాతికి వచ్చినవార లయి యున్నారు. జెన్నాన్స నను నతఁడు తాపిపనివారిలోఁ బ్రసిద్ధి కెక్కినవాఁడు. ఇతఁడు జేబులో నొక పాత్రము నుంచుకొని చేతఁ దాపిపనిచేయు సాధనముతోడఁ గానిపించుచుండెను. మఱియు నాతరగతిలోనే వాస్తుశాస్త్రజ్ఞులగు నెడ్వర్డు, టెల్ఫోర్డులును, భూగర్భశాస్త్రజ్ఞుఁ డగు హ్యూమిల్ల రనునాతఁడును, చిత్రకారుఁడును లేకరియు నగు కన్నింగుహా మనునాతఁడును,

ప్రసిద్ధికెక్కిరి. శిల్పనైపుణ్యమునం ఖ్యాతిఁజెందిన వడ్రంగులలో ఇనిగో జోన్సను నాతఁడు శిల్పమునందును, హారిసా ననునాతఁడు సున్నితమయిన గడియారములను చేయుటయందును, జాను హంటరనునాతఁడు శరీర శాస్త్రమునందును, రామ్నే, ఓపి యనువారలు చిత్తరువులు వ్రాయుటయందును లీ యను మహోపాధ్యాయుఁడు ప్రాచ్యదేశభాషా పాండిత్యమునందును ప్రవీణు లయి యుండిరి.

నేతపనివారిలోనుండి గణితశాస్త్రజ్ఞుఁడగు సిమ్సను, చిత్రకారుఁడగు జేకబు, పక్షిశాస్త్రము నెఱింగినవాఁడగు విల్సను, మతబోధకుఁడగు లివింగుస్టను, కవీశ్వరుఁడగు టన్నాహిల్లును, జన్మించినవారలు. చెప్పులు కుట్టు తరగతివారిలో నుండి నౌకాసైన్యాధ్యక్షుఁడగు సర్ క్లవుడేస్లి షావెల్లనునాతఁడును, విద్యుచ్ఛక్తిశాస్త్రజ్ఞుఁడగు స్టర్జియా ననునాతఁడును, విన్యాసకుఁడగు శేమ్యుయల్ డ్రూ యనునాతఁడును, పత్త్రికాధిపతియగు గిఫ్ఫర్డనునాతఁడును కవీశ్వరుఁడగు బ్లూమ్ఫీల్డను నాతఁడును, మతబోధకుఁడగు విల్లియం క్యారే యనునాతఁడును, ప్రఖ్యాతిని గాంచియున్నారు. ప్రసిద్ధమతబోధకుఁడగు మారిసా ననువాఁడు చెప్పులను కుట్టుటకొఱకు దిమ్మలు చేయు పనివాఁడు. ప్రసిద్ధపదార్థశాస్త్రజ్ఞుఁడయిన థామస్ ఎడ్వర్డ్సనునాతఁడు చెప్పులు కుట్టుకొని జీవించుచుండెను.

దేశచరిత్రమును వ్రాసిన జాన్ స్టో యనువాఁడు కుట్టుపని చేయుచు జీవించుచుండెను. చిత్తరువులు వ్రాయుటయందు నేర్పరి యగు జాక్సననునాతఁడు యౌవనవంతుఁడగువఱకు బట్టలు నేసికొని బ్రదుకుచుండెను. మొదట లండను నగరములో నొకకుట్టుపనివానివద్ద పని నేర్చుకొనిన సర్ జాన్ హాక్సు వూడ్డనునాతఁడు యుద్ధములం బ్రసిద్ధశూరుఁడయి మూఁడవ యెడ్వర్డు ప్రభువుగారిచేత బహుబిరుదములఁ బడసినవాఁడుగా నుండెను.

ప్రసిద్ధనౌకాధ్యక్షుఁడగు హాబ్‌సాను నయితము హాక్సుఫర్డువద్దనె మొదట కుట్టుపని నేర్చుకొనియుండి తరువాత నావికాసైన్యమునం జేరి ప్రాముఖ్యమునకు వచ్చియున్నాఁడు. అసమానమేధాసంపన్నుఁడును, సాటిలేని స్వప్రజ్ఞ గలవాఁడును సంయుక్తరాష్ట్రము (United States) నకధ్యక్షుఁడును నగు ఆంద్రూ జాన్సను గొప్పకుట్టుపనివాఁడుగా నుండి పైయున్న పదవికి వచ్చియుండెను. అతఁ డొకనాఁ డుపన్యసించునపుడు "కొందఱు పెద్దమనుష్యులు నన్ను కుట్టుపనివాఁడందురు; అయ్యది నన్నెంతమాత్రమును సంక్షోభపఱుపఁజాలదు. ఎందువల్లననగా నాకుట్టుపని చేయుకాలమున మంచివాఁడనని పేరుపొందియుంటిని; నాకు పని నొప్పగించువారిమనస్సునకు నొప్పి గలిగింపక వారికి చేసినవాగ్దత్తముప్రకారము సకాలమున వారియంగీలను వారలకిచ్చియుంటిని; ఎప్పుడును మంచిపని చేసియుంటిని". అని చెప్పియున్నాఁడు.

ప్రసిద్ధులగు కార్డినల్ వూల్సే, డిఫో, ఏకెన్‌సైడ్, కర్కువైట్, మొదలగువారు కసాయీలబిడ్డలే. బన్యను లోహపాత్రములను జేయువాఁడు. జోసఫ్ లంకాస్టరు తట్టలల్లువాఁడు. ఆవిరియంత్రమును గనిపెట్టినవారిలో న్యూకోమ ననువాఁడు కమ్మరివాఁడుగాను, వాట్టనువాఁడు గణితశాస్త్రసంబంధమయినసాధనములను చేయువాఁడుగాను, స్టిఫెన్స ననువాఁడు కొలిమిలో నిప్పువేయువాఁడుగాను నుండిరి. హంటింగ్డ నుమతబోధకుఁడు నేలబొగ్గు గనిలో బొగ్గులెత్తువాఁడుగా నుండెను. కట్టబూదను చిత్రపుఁబని చేయు బీవిక్కునువాఁడు నయితము బొగ్గు త్రవ్వువాఁడుగా నుండెను. సర్ థామస్ లారెన్సు సారాయియంగడివాని కొడుకు. కమ్మరివానిపుత్రుఁడయిన మైకేయల్ ఫారడేయనువాఁడు బాల్యంబునఁ బొత్తముల కట్టలు గట్టువానినొద్దఁ బని నేర్చుకొనుచు నిరువదిరెండుసంవత్సరములవయస్సు వచ్చువఱకు నావ్యాపారమునే చేయుచుఁ దరువాతఁ బ్రకృతిశాస్త్రమునందలి బహుకఠినము లయిన

సంధిగ్ధవిషయములను తేటపఱచుచు ప్రజ్ఞావిశేషమునందు తనకుసాటి యయిన సర్ హంఫ్రె డేవీని సయితము మించినవాఁడయి తత్త్వశాస్త్రజ్ఞులలో మొదటి తరగతి నాక్రమించియుండెను.

జ్యోతిశ్శాస్త్రము నభివృద్ధికిఁ దీసికొనివచ్చినవారిలో కోపర్నికస్సను వాఁడు మెఱుఁగుగొట్టులను జేయువాని కొడుకు; కెప్లర్ సారాయియంగడి వానిపుత్రుఁ డయియుండి గాజుపనివానిభార్యచేఁ బోషింపఁబడియెను; న్యూటను అనువాఁడు గ్రంథాముపురసమీపమున నొకయీనాముదారుని కుమారుఁడు; లాప్లేసు బీదరైతువానికొడుకు; బాల్యమున గర్భదరిద్రులుగా నుండి యెట్టికష్టములపాల్పడినను తరువాత విలువకట్టసాధ్యముకాని నిరుపమాన మేధాశక్తిచేఁ బ్రసిద్ధి గాంచియుండిరి. జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడును గణితశాస్త్ర వేత్తయునగు లాగ్రేంజి యనువానితండ్రి ట్యూరిను యుద్ధములోఁ గోశాధిపతి యుద్యోగమున నుండియును అతిలాభాపేక్షచేత సాహసముతోఁ జేయు వ్యాపారములం దగిలి చెడిపోయి మిగుల దరిద్రస్థితికివచ్చి యుండెను. ఇట్టి దుస్స్థితియె తనకీర్తికిని సౌఖ్యమునకును గారణ మయ్యెనని చెప్పుకొనుచు వచ్చెను. "నేను ధనికుఁడనయి యుంటినేని గణితశాస్త్రజ్ఞుఁడ నయి యుండకపోవుదు" నని యాతఁడు చెప్పియుండెను.

మతబోధకులయొక్కయును, మతగురువులయొక్కయును పుత్త్రులు దేశచరిత్రములయందుఁ బ్రఖ్యాతిఁ గాంచియుండిరి. నెల్సన్, డ్రేక్, నావికాసంబంధ మయిన శూరత్వమునఁ బ్రసిద్ధి కెక్కియుండిరి. వల్లాస్టన్, ఎంగ్, ప్లేఫేర్, బెల్ మొదలగు వారు ప్రకృతిశాస్త్రమునందును, రెన్, రెయినోల్డ్సు, విల్సన్, విల్కీ మొదలగువారలు కళలయందును, థర్లో, క్యాంబెల్ మొదలగువారు న్యాయశాస్త్రములయందును, ఎడ్డిసన్, థామ్సన్, గోల్డుస్మిత్తు, కాలరిడ్జి, టెన్నిసన్, మొదలగువారు భాషాపాండిత్యమునందును ప్రసిద్ధిని గాంచియుండిరి. హిందూదేశపుయుద్ధములయందుఁ బేరెన్నికగాంచిన "లా-

ర్డు హార్డింజి, కర్నల్ ఎడ్వర్డ్సు, మేజర్ హాడ్జసాన్ మొదలగువారు మతా
చార్యుల పుత్త్రులుగా నుండిరి. హిందూదేశమున బ్రిటీషుప్రభుత్వమును స్థాపిం
చినవారలగు క్లైవు, వారన్ హేస్టింగ్సు, మొదలగువారు సామాన్యకుటుంబము
లలో జన్మించిన వారలే. వారలతరువాత వచ్చి రాజ్యమును బలపఱచినవారలు
సయితము సెక్కండ్రు యంత్రశాలలలోఁ బెంపఁబడి కార్యనిర్వాహకత్వమున
నాఱితేఱినవా రయియున్నారు.

ఎడ్మండ్ బర్కు, యంత్రశాస్త్రజ్ఞుఁడగు స్మీటను, స్కాటు, వర్డ్సు
వర్తు, సోమర్సు, హార్డ్విక్కు, డన్నింగుప్రభువులును న్యాయవాదులబిడ్డలుగా
నుండిరి. ఉల్లియమ్ బ్లాక్స్టనను నాతఁడు పట్టుబట్టల వర్తకుఁడు మృతిఁజెందిన
తరువాత నతనికి జన్మించిన వాఁడుగా నుండెను. గిప్ఫర్డుప్రభువుతండ్రి డోవరు
పట్టణమువద్ద కాఫీ, తేయాకు మొదలగుసరకుల విక్రయించు వాఁడుగా నుం
డెను. డేన్మానుప్రభువుతండ్రి వైద్యుఁడుగా నుండెను. న్యాయాధిపతి యగు
టాల్ఫర్డుప్రభువుతండ్రి పల్లెటూరిలో సారాయిపండెడు వాఁడుగా నుండెను.
న్యాయాధిపతులలో ముఖ్యుఁడగు పోలక్ ప్రభువుతండ్రి చారింగ్క్రాసను స్థల
మునొద్ద గుఱ్ఱపుజీనులపని చేయువాఁడుగా నుండెను. మహాకవి యగుమిల్టను
లండనునగరలేఖకులలో నొకనికుమారుఁడు.

పోపు, సౌదే యనుకవులు నారబట్టల వర్తకులబిడ్డలుగా నుండిరి. పిల్స
నను మహోపాధ్యాయుఁడు సకాయకష్టకర్మవలన జీవించువానిపుత్రుఁడుగా
నుండెను. మెకాలేప్రభు వాఫ్రికాఖండపు వర్తకుని కుమారుఁడుగానుండెను.
కీట్సు రంగులు వేయువాఁడు. సర్ హంఫ్రిడేవీ యనునాతఁడు స్వదేశవైద్యుని
కడఁ బని నేర్చుకొని యుండెను. ఆతఁడొకసారి ప్రసంగించునపుడు తనకుఁ
దానె స్వయంకృషివలన నున్నతపదవికి వచ్చితినని నిర్మలహృదయముతో
డంబమును విడిచి పలుకుచున్నానని చెప్పెను. జీవకోటివర్ణనమునకు (Natu-
ral History) న్యూటనువంటివాఁ డయిన రిచార్డు వోవె ననునతఁడు తొలు

దొల్ల నోడలో నొక యుద్యోగస్థుఁడుగా నుండి జీవనము చేసినవాఁడే ; అప్పటినుండియు నీతఁడు శాస్త్రవిమర్శనపద్ధతులయందు మిక్కిలి ప్రావీణ్యుఁడయి యుండినను మిక్కిలి వార్ధికుఁడగు నంతవఱకు నంతఁ జొఱఁబడి యుండలేదు. అడ్రియా ననునాతఁడు బాలుఁడుగా నుండినప్పుడు దీపము పెట్టుకొనుటకయిన గతిలేనివాఁడయి వీధులలోను ప్రార్థనమందిరములయొద్ద నుండు దీపములకడఁ గూరుచుండి పాఠములను జదువుకొనుచు విద్యాభివృద్ధిఁ గాంచి యుండెను.



# రెండవ ప్రకరణము.

---

తమనిరంతరకృషివలన సామాన్యస్థితినుండి యున్నతస్థితికి వచ్చిన వార లనేకు లొక్కయింగ్లాండు దేశమునందుమాత్రమే గాక ఫ్రాన్సు మొదలగు దేశములందుసయితము గలరు. గ్రంథవిస్తరభీతివలనను వట్టిపేరులుమాత్ర ముదాహరించినందువలనను లాభములే దని యెంచి ముఖ్యములగు దృష్టాంతములను మాత్రమే వ్రాయుచున్నాను. అందు మిక్కిలి ప్రసిద్ధులగు వారిచారిత్రములఁ బరిశీలించితి మేని కృషిసాఫల్యతకు మొదట కష్టములును దరిద్రస్థితియు నే యత్యంతావశ్యకములుగా నుండునని తెలిసికొందుము. మొదట సామాన్యస్థితి గలిగి తమనిరంతరకృషివలన క్రమక్రమముగాఁ బ్రఖ్యాతికివచ్చి యున్నత పదవులఁ బొందినవారిసంఖ్య బ్రిటీషుజనప్రతినిధి సంఘమునందు(The British House of Commons)విశేషముగాఁ గలదు. అట్టివారెల్లరును శాసననిర్మాణసభలయందు మిక్కిలి గౌరవింపఁబడి యున్నారు. ! సాల్ఫర్డను తాలూకాకు ప్రతినిధిగా నెన్నికొనఁబడిన జోసెఫ్ బ్రదర్టను "పదిగంటలశాసనమును" గురించి తీవ్రముగాఁ జర్చించునపుడు తా నొకదూదియంత్రశాలలో పని చేయుబాలుఁడుగానుండి పొందిన యిడుమలనుగురించియు దుఃఖములను గురించియును వివరముగాఁ దెలుపుచు నాకాలములో నిర్భాగ్యు లయిన పనివాండ్రకష్టములను దొలఁగించుటకయి తనజీవితకాలములోఁ బ్రయత్నింప శపథముపట్టితి నని చెప్పియున్నాఁడు. అతనివెనక వెంటనే లేచి సర్ హ్యామ్సుగ్రహా మనునాతఁడు బ్రదర్టనుయొక్క సామాన్యస్థితిని దానావఱకు వినియుండలే దనియును, అట్టిహైన్యస్థితినుండి జనప్రతినిధిసంఘములోఁ గొప్పవారిసరసను జేరి కూర్చుండునట్టి యున్నతస్థితికి వచ్చినందులకు తాను మిక్కిలి గర్వపడుచున్నానని తత్సంఘమునఁ గరతాళధ్వనులు సెలంగుచుండ గొంతెత్తి గంభీరస్వరముతో ముచ్చటించెను.

ఓల్డుహామునకు ప్రతినిధిగానున్న ఫాక్సను నాతఁడెన్నఁడు ప్రసంగింప వలసివచ్చినను "నార్విచ్చిపట్టణమున బాల్యమున నేతపనివాఁడనుగా నుండి పని చేయుచుండినపు" డని మొదలు పెట్టుచుండెను. ఓడల కధికారియై ప్రసిద్ధి వహించిన లిండ్సేయను నాతఁడు సండరులాండునకు ప్రతినిధిగా వచ్చి ప్రతి కక్షివారు తన్నెగతాళిచేసినప్పుడు తన్ను కోరుకొనిన జనసంఘమునకు తన దైన్యస్థితినిగూర్చి యీక్రిందివిధముగా జెప్పుకొనెను. "పదునాలుగుసంవత్సర ములప్రాయమున దిక్కులేనివాఁడనుగానుండి జీవనార్థము గ్లాస్గోనగరమునుండి బొగ్గును త్రవ్వి సిద్ధము చేయుపద్ధతిఁబోవు నోడ నడపునధికారితో మాట్లాడు కొని లివర్పూలునగరముఁజేరి పని దొరకుటకు పూర్వ మేఁడువారములవఱకు తృప్తికరముగాఁ గుడువఁ గూడును కట్ట బట్టయును లేక వివిధకష్టములఁ బడి యోడలోనొకపనిసంపాదించుకొని పందొమ్మిదిసంవత్సరములప్రాయము వచ్చునప్పటికి నోడనడపునట్టియధికారి నైతిని. ఈయుద్యోగము నాసత్ప్ర వర్తనమువలనను స్వయంకృషివలనను సంపాదింపఁ గలిగితిని. ఇరువదిమూఁడు సంవత్సరములవయస్సు వచ్చిన తరువాత నాపని మానుకొని యొడ్డునకు వచ్చి కాపురము కుదుర్చుకొని యితరులకు మేలుచేయవలెనను తలంపుతోఁ బాటు పడి నాబుద్ధివిశేషమువలనను నిరంతరకృషి వలనను నీయున్నత పదవికి వచ్చియున్నాను."

బర్కెన్ హెడ్డునగరనివాసియు, ఉత్తర డెర్బిషీరునకు ప్రతినిధియునగు ఉల్లియమ్ జాక్సను చరిత్రముగూడ లిండ్సేచరిత్రమునే పోలియుండెను. ఇతని తండ్రి లంకాస్టరు పట్టణమున శస్త్రచికిత్సకుఁడుగా నుండి పదునొకండుగురు బిడ్డలను గాంచి చనిపోయెను. వారిలో నీజాక్సను ఏడవవాఁడుగా నుం డెను. ఇతనికంటె పెద్దవారు తండ్రి చనిపోవునప్పటికి విద్యావంతులయి యున్నారు గాని చిన్నవారు తమంతటతాము చదువుకొని బ్రదుకవలసివచ్చెను. ఈ చిన్నవాఁడు పండ్రెండుసంవత్సరములవయస్సు కలిగియున్నప్పుడు బడి

మాన్పింపఁబడి యుదయ మూఁడుగంటలు మొదలుకొని రాత్రి తొమ్మిదిగంటల
వఱకు కష్టపడవలసిన యోడపనిమీఁద నొప్పగింపఁబడెను. తనయజమాని
జబ్బుపడినపుడు మఱియొక తీఱికగల పనియందు ప్రవేశపెట్టఁబడెను. ఆకాల
ములో నీబాలుఁడు చదువుకొనుట కవకాశము చిక్కనందువలన 'ఎన్సైక్లోపె
డియా బ్రిటానికా' యను మహాగ్రంథముయొక్క యిరువదియాఱుభాగములను
రాత్రింబగళ్ళు చదివి ముగించెను. తరువాత వర్తకమును బ్రారంభించి వృద్ధి
నొంది ధనికుఁడై యోడల కధికారియయి ప్రతిమహాసముద్రమునందును నోడ
లను నడపించుచు ప్రపంచములోని ప్రతిదేశముతోను వర్తకసంబంధము కలిగి
యుండెను.

ఆతరగతిలోనే చేరినయట్టి మనుష్యులలో రిచార్డు కాబ్డెను నొకఁడని
పరిగణింపఁబడవచ్చును. అతఁడును మిక్కిలి సామాన్యస్థితినుండి వృద్ధిపొందిన
వాఁడే. ససెక్సు మండలమున మిడ్‌హర్స్టుగ్రామమున నొకబీదరైతునకు
జన్మించి మిక్కిలి బాల్యములోనే లండనునగరమున నొకగిడ్డంగిలో నౌకరు
గాఁ బ్రవేశపెట్టఁబడెను. అతఁడు జాగరూకత కలవాఁడును, విశేషసంగతు
లను దెలిసికొనుట కభిలాష కలవాఁడుగాను నుండెను. వానియజమాని పూ
ర్వపద్ధతి ననుసరించి నడుచువాఁడుగావున నతివిస్తారముగా చదువవలదని
మందలించుచుండెను. అయినను తనమార్గమును విడిచిపెట్టక యీబాలుఁడు
గ్రంథములలోఁ గానఁబడు ధనముతో తనమనస్సును నింపుచుండెను. క్రమ
క్రమముగా నీతఁడు జవాబుదారిగల పనులలోఁ బ్రవేశపెట్టఁబడి తుదకు స్వా
తంత్ర్యవృత్తి నవలంబింపఁ దలంచి పథికుఁడై దేశములు తిరిగి మాంచెస్టరు నగ
రమున కాలికోప్రింటరుగాఁ (కాలికోగుడ్డమీఁద నచ్చు వేయువాఁడు) పని
ప్రారంభించెను. ప్రజోపకార్యములయందు ముఖ్యముగ సామాన్యజనవిద్యాభి
వృద్ధియం దభిమానము గలిగియుండి "కారన్‌లాస్ (Corn Laws) విషయ
మున జోక్యము కలిగించుకొని రద్దుపఱచుటకయి విశేషముగా తనజీవితమును

ఐశ్వర్యమును వినియోగించెను. ఈతఁడు మొదట తలయెత్తి నలుగురిలోనికి వచ్చి మాటాడఁ బ్రయత్నించియు తనయుద్యమము కొనసాగక నాలుగుమాటల యిన జనరంజకముగాఁ బ్రసంగింపలేక పరిహాసపాత్రుఁ డయ్యెను. కాని యంతటితో విముఖుఁడుగాక యోపికయు, నిరంతర కృషియు, శక్తియును గలిగి యున్న వాఁ డగుటవలన జనరంజకముగా నుపన్యసించుటను నేర్చుకొని తరువాత జనుల నాకర్షింప శక్తిగల వక్తలలో ముఖ్యుఁ డాయెను. గుణము, పట్టుదల, పాటు మొదలగునవి మనుష్యుని నెంతవఱకు నభివృద్ధికిఁ దీసికొని రాఁగలవో కార్లైను చరిత్రమే మనకు దృష్టాంతముగా నుండునని గ్రహించి రాయబారి యొకసారి ప్రసంగవశమున ముచ్చటించెను.

ఈ పైనుదాహరించిన దృష్టాంతములలో నెల్లను మనుష్యుని మనఃపూర్వకమయిన నిరంతరకృషియే గౌరవపదవి నందుటకు చెల్లించు వెలగా నుండినది. పరిశ్రమ చేయు చేయియును తలయునుమాత్రమే స్వయంకృషి యందును, జ్ఞానాభివృద్ధియందును, వ్యాపారమునందును, మనుష్యుని భాగ్యవంతునిగఁ జేయుచున్నవి.

భాగ్యమును సౌఖ్యమును మనుష్యునియొక్క యుక్తాయుక్తపరిజ్ఞానమున కావశ్యకములు కావని స్పష్టముగాఁ దెలియుచున్నది. లేనియెడల సర్వకాలములయందును ప్రపంచము సామాన్యస్థితినుండి తలయెత్తికొని పైకివచ్చినవారికిమాత్రమే ఋణపడియుండదు. సుఖభోగములతోడే పుట్టుక కష్టములతోఁ బెనఁగులాడి పాటుపడుటకై మనుష్యులను తరిబీతు చేయఁజాలదు. దారిద్ర్యము దురదృష్ట మనిపించుకొన్నను మనఃపూర్వకమైనస్వయంకృషిచే దానినే యదృష్టముగా మార్పవచ్చును. "మనుష్యులు తమభాగ్యమునుగాని బలమునుగాని తెలిసికొన్నవారుగాఁ గన్పట్టకున్నారు. భాగ్యమువలన తాము చేయుదానికంటె నెక్కువగాఁ చేయవచ్చుననియును, రెండవదానివలన తక్కువమాత్రమే చేయవచ్చుననియు నమ్ముచున్నారు; స్వశక్తియందలి విశ్వాసమును

వైరాగ్యమును మనుష్యుని న్యాయమగుపాటునకుఁ బురికొలిపి తనపాటుఁ దాను పోషించుకొనునట్లు చేసి సత్కార్యములయందు తనజీవితమును జాగ్రత్తగా వినియోగించునట్లు చేయును" అని జేకను చెప్పియున్నాఁడు.

సుఖమును స్వేచ్ఛయు నభిలషించి విచ్చలవిడి తిరుగువారికి ధనము హీనమోహమును పుట్టించును. మిక్కిలి భాగ్యవంతులయి జన్మించినవారలు వేడుకల నిరసించి కష్టదినములను గడుపుచు జీవించుచున్నవారితోడఁ గలసిమెలసి పనిచేయుట యధికమైన కీర్తిని వ్యాపింపఁజేయును. మనదేశమునందువలెఁగాక యింగ్లాండుదేశమునందు భాగ్యవంతులు సోమరులయి యుండక దేశాభివృద్ధికై తాము చేయవలసినపనిని తాము చేయుచు నొకప్పుడు కష్టములకైనఁ దలయొగ్గుచుందురు. ప్రకృతిశాస్త్రమునందును తర్కశాస్త్రమునందును గూడ భాగ్యవంతులగువారు పేరుగాంచి యున్నారు. ఈసందర్భమున జేకను, వర్సెస్టరు, బాయిలీ, క్యావెండిష్, రోబ్బెట్, రోస్సీ మొదలగు గొప్పవారి పేరులు చెప్పవచ్చును. కడపటివాఁడైన రోస్సీ జమీందారులలో గొప్ప శిల్పియని చెప్పవచ్చును. ఈతఁడు నిజముగా జమీందారుఁడై పుట్టకుండిన నింకను నద్భుతవిషయములను గని పెట్టి యుండును. శిల్పనైపుణ్యాయందు సంపూర్ణ ప్రజ్ఞావిశేషము గలవాఁ డగుటవలన నొకప్పు డొకయంత్రశాలయందు మేస్త్రీగా నుండి పనిచేయుటకు బలవంతపెట్టఁబడి పనిచేయవచ్చినప్పుడు తాను జమీందారుఁడ నని తెలియఁబడకుండఁ బని చేసి మెప్పించెను. "రోస్సీ టెలిస్కోప్" అను ఘనమైన దూరదర్శకయంత్రమును గనిపెట్టి యద్భుతమైన తనమేధాశక్తిని లోకమునకుఁ బ్రకటించియున్నాఁడు.

ఇంతియగాక రాజ్యాంగవిషయములయందును భాషావిషయములయందును విశేషముగాఁ గృషిచేసి ప్రఖ్యాతిని బడసినవారిలో నెక్కువతరగతులలోనివార లనేకులున్నారని మనము తెలిసికొనుచున్నాము. ఈవిధములయిన కార్యములయందు విజయమును పొందుట తదితరవిషయములందువలెనె పాటు

వలనను అభ్యాసమువలనను, గ్రంథపఠనమువలనను గలుగును. మహాజనప్రతినిధి సభా నాయకులుగాను మంత్రులుగాను నుండువారు మిక్కిలి కష్టపడవలసిన వారుగా నుండవలయును. హామర్సటన్, డెర్బీ, రస్సెల్, డిస్‌రాయలీ, గ్లాడ్‌స్టోను మొదలగు మహనీయులెల్లరు నట్టివారలే. వీర లెల్లఱును పదిగంటల శాసనముయొక్క లాభములను బడయకుండ దానికి రెట్టింపుగా రాత్రింబగళ్ళు విసుగును విరామమును లేకుండ జనప్రతినిధిసభలోనుండి కష్టపడిపనిచేసి మిగులఁ బ్రఖ్యాతిగాంచినట్టివారుగా నున్నారు. నవీనకాలమునం దట్లు పాటుపడినవారిలో సర్ రాబర్టుపీ లనునాతఁ డొక్కఁడు; సామాన్యశక్తులను మాత్రమే గలిగియుండి యెడతెగని నిరంతరకృషివలన నద్భుతమయిన యశాస్సత్యమునకు వచ్చిన యీతనిచరిత్రము మిక్కిలి సుప్రసిద్ధమయినది. ఈతఁడు జనప్రతినిధిసభలో నలుబదిసంవత్సరములు కూరుచుండి చేసినపనులు బ్రహ్మాండములయినవిగా నున్నవి. ఈతఁడు తనయంతరాత్మకు విరుద్ధముగా నడుచువాఁడు గాఁడు. తాను చేయుటకు పూనుకొన్నదానిని పూర్తిగా చేసి విడిచిపెట్టినాఁడు. ఆతఁ డేవిషయమునుగుఱించి మాట్లాడఁదలఁచెనో, అతఁ డే విషయమున వ్రాయుటకుఁ బ్రారంభించి వ్రాసెనో, ఆయావిషయములలో జక్కఁగాఁ బరిశీలించి పరిపూర్ణజ్ఞానమును బడసి సఫలీకృతమనోరథుఁ డాయెనని యాతని యుపన్యాసములను గాంచినవారు తలంపకమానరు. ఈతఁడొకవిషయమున తనతోడివారలకంటె నాధిక్యమును వహించియున్నాఁడు. అంధప్రాయముగాఁబూర్వపుదానినెల్ల శ్లాఘించువాఁడు గాక నూతనమైన సదభిప్రాయములయం దభిలాష కలవాఁడుగా నుండెను. బ్రోహాముప్రభువుయొక్క విసుగులేనిపాటు లోకప్రతీతియయి సర్వత్ర వ్యాపించెను. ఆతని దేశోపకారకము లయినపను లాతని జీవితకాలములో నలుబదిసంవత్సరము లాక్రమించుకొనియుండెను. ఆకాలములో నాతఁడు ధర్మశాస్త్రమునందును, భాషాశాస్త్రములయందును రాజ్యాంగవిషయక శాస్త్రములయందును ప్రకృతిశాస్త్రము

నంచును కృషిచేసినవానియన్నిటియందును ప్రావీణ్యతనొంది గొప్పపేరు సంపా
దించుకొనెను. అట్టివాని సెట్లు సాధింపఁగలిగెనో యనేకులకు గూఢముగా
నుండెనది. ఒకప్పుడు క్రొత్తపని చేయవలసినదని కోరఁబడినపుడు సర్ సేమ్యు
యల్ రోమిల్లీ తనకు తీఱిక లేదని క్షమాపణము చెప్పుకొనుచు "మీరు దీనిని
తీసికొని బ్రోహాముకడకుఁ బొండు. ఏపనిచేయుటకును ఆతనికి తీఱిక యున్న
ట్లు గన్పట్టుచున్నాఁడ"ని ప్రత్యుత్తర మిచ్చెనఁట!

విశ్రాంతిఁ గాంచవలసినకాలమాసన్న మయినపుడు వృద్ధులనేకులు కుర్చీల
పైని పండుకొని హాయిగా సుఖమనుభవించుచుండఁగా బ్రోహము తేజో
శాస్త్రమునుగుఱించి బాహుళ్యమయిన విమర్శనములను వ్రాసి నూత్నవిషయ
ములను గనిపెట్టి లండను పారీసు నగరములలోని ప్రకృతిశాస్త్రజ్ఞులసభలలో
నివేదించుచుండెను. ఆకాలములోనే ప్రకృతిశాస్త్రజ్ఞుల జీవచారిత్రములను
మూఁడవజార్జిగారిప్రభుత్వకాలమునందలి భాషాజ్ఞానులచారిత్రములను ముద్రించి
ప్రకటించుచువచ్చెను. ఇంతియఁగాక రాజ్యాంగ విషయములను గుఱించి
పార్లమెంటులోని ప్రభుసభ (House of Lords) లోఁ జర్చించుచుండెను.
ఒకసారి దారుఢ్యవంతులగు ముగ్గురుమనుష్యులు చేయవలసినపనిని తనపైఁ
బెట్టి సిడ్నెస్మిత్తు ప్రేరేపించినపుడు మనఃపూర్వకముగాఁజేసి సంతోష
పెట్టెను. ఒక్కనిమిషమైనను వ్యర్థముగాఁ బోనీయక పనిచేయుట కభ్యాస
పడినవాఁడగుటచేత నెంతగొప్పపని యయినను గోటమీటివేయ శక్తికల
వాఁడుగా నుండెను.

ఆతరగతిలోనే చేరి పాటునకు వెనదీయక మిక్కిలి పాటుపడిన
వారిలో "సర్ బుల్వర్ లిట్టు" ననువాఁ డొకఁడు. ఈతఁడు చిత్రవచనప్రబంధ
ములను వ్రాసి కవి యయ్యెను. నాటకములను వ్రాసి నటుఁ డయ్యెను. దేశచరి
త్రములను వ్రాసి చరిత్రకారుఁ డయ్యెను. వ్యాసములను వ్రాసి బోధకుఁ
డయ్యెను. మహావక్తయై యుపన్యాసముల విన్పించెను. రాజ్యాంగవిషయ

ములం దెలిసికొని రాజ్యతంత్రజ్ఞుఁడయ్యెను. ఈతనివలె పాటుపడి బహుగ్రంథ
ములను వ్రాసి ప్రఖ్యాతినొందినవారు కొందఱుమాత్రమే గలరు. ప్రతివిషయము
నందును ప్రావీణ్యమునొందవలె నన్న సచ్చింతతో నీతఁడు స్వసుఖమును
జూచికొనక మిక్కిలి పట్టుదలతోఁ బాటుపడి క్రమక్రమముగాఁ బైకి
వచ్చెను. మహారాజభోగము లనుభవించుటకును, వినోదములతోను వేడు
కలతోను సోమరియై కాలము వెళ్లబుచ్చుటకును కావలసినంతభాగ్య మున్నను
దానియం దభిరుచిలేక పాటునందే సుఖము కలదని దృఢముగా నమ్మి మహా
గ్రంథకర్త యగుటకుమాత్రమే ప్రయత్నించి కృతార్థుఁడయ్యెను. పైరను మహా
కవియందువలెనే ఇతఁడు ప్రప్రథమమున విరచించిన పద్యకావ్యమును ప్రజా
రంజకముగాక పోయెను. తరువాత విరచించిన చిత్రవచన ప్రబంధము సహితము
గణనకు రాకపోయెను. అట్టిసందర్భమున దుర్బలచిత్తుఁ డగువాఁడు కలమును
కాగితమును నావలఁ బాఱవైచి గ్రంథకర్తయగుటకు మరల నెన్నఁడును గోర
కుండును. కాని బుల్వరుమాత్ర మట్టివాఁడు కాఁడు. ఓపికయును బట్టుదల
యును గలవాఁడు. తనకోరికలు ఫలించువఱకు పాటుపడుటకుఁ గృతనిశ్చ
యుఁడై పరిశ్రమ చేసిచేసి ముప్పదిసంవత్సరములు భాషావిషయకప్రచారమునఁ
గడపి బహుగ్రంథములను విరచించి సుప్రసిద్ధుఁ డాయెను.

మహావక్త యయిన డిస్రాయలీచరిత్ర మత్యద్భుత మయినది. ఈతని ప్రథ
మ ప్రయత్నములు బుల్వరుకీర్తి గ్రంథకర్త కావలె నన్న విషయమున వినియోగిం
పఁబడెను. కాని యీతఁడు తొలుదొలుత ప్రకటించినకావ్యములనుజూచి ప్రజలు
నవ్వ మొదలుపెట్టి యిచ్చవచ్చినటులఁ బరిహసింపసాగిరి. ఈతఁడుమాత్రము తన
పూనికను విడువక నిరంతరకృషివలనఁ దుదకు సఫలీకృతమనోరథుం డయ్యెను.
తాను వక్త యనుపించుకొనవలె నను నభిలాషతో మొదట జనప్రతినిధిమహా
సభలో నుపన్యసించినపుడు బహుజనపరిహాసమునకుఁ బాత్రుఁ డయ్యెను.
ఈతఁడు మాటాడఁ బ్రయత్నించునపుడెల్లను ప్రజలు చప్పట్లు గొట్టుచు నెగ
తాళి చేయసాగిరి. ఈతనినోటనుండి వచ్చిన ప్రతి వాక్యమును విని ప్రజలు

పరిహసింపక పోలేదు. తుదకు ప్రాణము విసిగి యీతఁడు భవిష్యత్తును దెలి పెడు నొక్క వాక్యమును బలికి తన యుపన్యాసమును ముగించెను. "నే ననేక పర్యాయము లనేకవిషయములను మొదలుపెట్టితిని; తుదకు నన్నిటి యందును జయము గాంచితిని; ప్రస్తుతము విరమించెదను; మీ రెల్లరును నాయుపన్యాసమును వినుకాలముకూడ వచ్చును." అని పలికిన కడపటివాక్య మా గందరగోళములో నెల్లవారికి వినిపించెను. అట్టికాలము కూడవచ్చెను. ఒకసారి ప్రపంచములోని మహాప్రభుసభలో గంభీరభాషణ ములతో డిస్రాయలీ ప్రసంగించునపు డెల్లవారును విస్మయానందమగ్నులగుచు వినసాగిరి. ఆహా! అట్టిపనికై యాతఁడెంత పరిశ్రమచేసియుండునో గదా! విసుగును విరామమును లేకుండఁ బాటుపడి పని చేయఁబట్టిగదా తన మనో రథ మీడేర్చుకొనఁ గలిగెను! సాధారణముగా పడుచువాండ్రు తా మొక పనిచేయ మొదలుపెట్టి విఫలీకృత మనోరథు లగుదురేని యంతటితో నాపనిని విడిచిపెట్టి నిరుత్సాహపడి మరలఁ బ్రయత్నింపక మూలమూలకుఁ జేరి వ్యర్థు లగుచుందురు. డిస్రాయలీయ ట్లొనరింపక మనోబలముచేత శ్రద్ధతోఁ బాటు పడి తుదకు జయమును గాంచి మహావక్త యని జనప్రతినిధి సంఘమువారిచేఁ గొనియాడఁబడెను.

స్వయంకృషివలనను స్వశక్తివలనను ఘనకార్యములను నెఱవేర్పవచ్చు నని తెలుపుటకు నైదృష్టాంతములు చాలియున్నను, జీవయాత్ర నడుపునపుడు వీనికితోడు పరులసాహాయ్యముకూడ నావశ్యకమయియుండును. స్వయం సాహాయ్యమునకు పరసాహాయ్యమునకును పరస్పరవైరుద్ధ్యమున్నను రెండును జంటగా నడుపఁ బడవలెనని వర్డ్సువర్తనుకవి చెప్పుచున్నాఁడు. బాల్యము మొదలుకొని ముసలితనము వచ్చువఱకు నెల్లవారును కొంచెమించుమించుగా పరసంరక్షణమునకును పరశిక్షకును పాత్రులగుచున్నారు. యోగ్యులును దారు ఢ్యవంతులునుగూడఁ బరులసాహాయ్యమును బడయుట కంగీకరించుచున్నారు.

దృష్టాంతముకొఱకు అలెక్సీ సు. డీ. టాక్విల్లీ చరిత్రమును శోధించి చూడుఁడు. అన్ని విధములచేతను ఫ్రాంసుదేశము నందలి భాగ్యవంత మయిన యొకజమీందారీ కుటుంబమునందు జన్మించిన వాఁడై తన తల్లిదండ్రులకుంగల యధికారపు చెల్లుబడినిబట్టి వర్సైల్లీసు నగరమున "జడ్జి ఆడిటరు" అను నుద్యోగ పదవియందు నియమింపఁబడెను. కాని సమర్థత లేనందున నాతఁడాపదవియం దుండుట కిష్టము లేనివాఁడయి యెవ్వ రేవిధముగా నిందించినను తా నెప్పుడు సమర్థుఁడను కానని నిశ్చయించెనో యప్పుడే యాపదవిని విడుచుట మంచి దని దృఢమనస్కుఁ డయి యాపనిని మానుకొనెను. అంతట నాతఁడు ఫ్రాంసుదేశమును వదలి యమెరికా ఖండములోని సంఘరాష్ట్రములకుఁ బోయెను. అతని మిత్రుఁడు "గస్టాడీబోమాంటు" అనునాతఁడు టాక్విల్లీని వెంబడించిపోయి యాప్రయాణమునందు టాక్విల్లీ చూపిన యెన్నరాని పాటును గుఱించి వర్ణింపసాగెను. "అతని స్వభావము సోమరితనమునకు విరుద్ధమైనదిగా నుండును. ప్రయాణము చేయుచున్నను నిలిచి యొకచోట నున్నను ఆతని మనస్సుమాత్రము విరామములేక పనిచేయుచుండును. ఆతఁ డెప్పుడు ప్రసంగించిన నుపయోగకరములైనయంశములనే గాని యన్యములనుగూర్చి ప్రసంగింపఁడు; ఆతనికి వ్యర్థముగాఁగడపిన దినము దుర్దినముగా నుండును; అల్పమాత్రపుకాలము వ్యర్థమైనను ఆతని మనస్సును వేధించును." అని బోమాంటు వ్రాసియున్నాఁడు. కార్యసాఫల్యాశకు స్వప్రయత్నమును స్వశక్తి యందలి విశ్వాసము నావశ్యకము లని టాక్విల్లీ దృఢనిశ్చయము కలవాఁడయినను పరసాహాయ్యము నంగీకరించి కృతజ్ఞతాపూర్వక వందనములఁ దెలుపుటయందు పాలుమాలి యుండలేదు. తనకు వివిధవిషయములయందుఁ దోడ్పడిన తనమిత్రులగు డీకెర్గార్లే, స్టోఫెల్సులకు పలుమాఱు తనకృతజ్ఞతను దేటపఱచుచు వచ్చెను. తనయొక్క విద్యావిషయకకృషి సాఫల్యత నొందునట్లుగా తనభార్య శాంతముతో గూడుకొనినచిత్తము గలిగి

తనకు తోడ్పడినందులకై తనభార్య యగు మేరీ యనునామెకుఁగూడ తన కృతజ్ఞతావందనముల నర్పించుకొనియెను. మంచిమనస్సు గలిగినయిల్లాలు తన భర్తను సౌభాగ్యవర్తన కలవాఁ డగునటులఁ జేయఁజాలియుండు ననియును; ఎల్లప్పుడును కొఱకొఱలాడుచు ధూర్తస్వభావము కలిగియుండు భార్య భర్తను హీనస్థితికిఁ గొనిపోవు ననియు నాతఁడు దృఢముగా నమ్మియుండెను. కావున విద్యావిహీన లగుస్త్రీలు భర్తలయుద్యమమునకుఁ దోడ్పడఁజాలరు. వారలకుఁ పురుషులతోఁ బాటు విద్య నేర్పించినప్పుడే ప్రయోజకురాండ్రయి భర్తలకు వన్నెయు వాసియుఁ దెచ్చి తాము ప్రఖ్యాతిఁ గాంచుదురు.



# మూఁడవ ప్రకరణము.

---

సకాయకష్టమునకోర్చి దేశోపకారార్థము తానొకపని చేయనిశ్చయించుకొని యేవిధమైన ప్రోత్సాహము లేక పోయినను, ఇంట భార్యపుత్రాదులు సొమ్ము గడించి పెట్టలేదని వేవిధముల దూషించుచున్నను సరకుచేయక పట్టినపట్టు విడువక పని చేసి విజయమునొందిన నీదేశీయులలోఁ గుమ్మరుల జీవచరిత్రములు ప్రధానము లయినవిగా నున్నవి. అట్టివారిలో "బెర్నార్డు పాలిస్సీ" అను ఫ్రెంచివాఁడును, "జోహాన్ ఫ్రీడ్రిచ్ బోట్ ఘర్" అను జర్మనివాఁడును, "జోసయా వెడ్జివూడ్" అను నింగ్లీషువాఁడును సుప్రసిద్ధులు.

బంకమంటితో సామాన్యపాత్రములు చేయువిధము ప్రాచీనదేశముల వారికెల్లరకును దెలిసినదే యయినను పింగాణివస్తువులని పిలువఁబడుచున్న "ఎనేమలుపూఁత వేయఁబడిన మంటిపాత్రలను చేయువిధ మంతగాఁ దెలియకుండెను. ప్రాచీన కాలమునందు "ఎట్రుస్కానులు" (Etruscans) ను జాతివార లుపయోగించినట్లు దొరతనమువారు సంగ్రహించి పెట్టియుంచిన పురాతనసంబంధ మయిన వస్తుసముదాయమునందుఁ గానిపించుచున్నది. ప్రాచీనకాలమున నీపాత్రములు మిక్కిలి విలువగలిగినవిగా నుండినవి. అగస్టస్సను రోమకచక్రవర్తికాలమున కొక్కపాత్ర దాని యెత్తుబరువుగల బంగారమునకు విక్రయింపఁబడుచుండెను. మూరులనుతురకలు చాలకాలమువఱకు నాపని చేయువిధములు దెలిసి యుండినట్లు పండ్రెండవశతాబ్దారంభమున స్పేనులు యూరపుఖండమునకు దక్షిణమున నున్న భూమధ్య సముద్రములో నుండిన మజార్కాద్వీపమును జయించి స్వాధీనము చేసికొనినప్పు డిట్టిపాత్రములు గానిపించుటచే నూహింపఁదగియున్నది. మూరులను జయించి స్పేనులు కొల్ల

గొనిపోయిన సామానులలో నీమంటిపాత్రము లనేకములు గలవు. వారలు వానిని గొనిపోయి పీసానగరమునందు తమదేవాలయపుగోడలలో నమర్చికొని యుండిరి. అవి నేఁటికిని గానిపించుచున్నవి. రెండుశతాబ్దములకు తరువాత ఇటాలియను (ఇటలీదేశస్థులు) లామాదిరినే పింగాణిపాత్రముల చేయ నారంభించి మజోలికాపాత్రములని పేరుపెట్టి వాడుచుండిరి. ఇటలీదేశములో నీ పూఁత వేయువిధమును పునరుద్ధారణము చేసినవాఁడు విగ్రహాదులు చెక్కు పనియందు నేర్పరియయిన లూకాడెల్లా రొబ్బియా యనువాఁడు. ఉలిచేతఁ బట్టుకొని పగలంతయును రాత్రి విశేషభాగమువఱకును మిక్కిలి యోర్పుతోఁ బని చేయువాఁడని వాసారి యనుచరిత్రకారుఁడు చెప్పుచున్నాఁడు. రాత్రి వేళ పనిచేయునప్పుడు మంచుచేత కాళ్లు చల్లపడి బిగిసిపోయి దేహమునకు జబ్బుచేయకుండ వెచ్చగా నుండుటకయి రంపపుపొట్టుగాని మఱియేదైనను చెక్కులుగాని తట్టలోవేసికొనిపోయి కాళ్ళందులో నుంచి కాపాడు కొనుచు మిక్కిలి యాసక్తితోఁ బనిచేయువాఁడుగా నుండెను. ప్రతిదిన మాఱఁ దట్టిపని చేయుట కలవాటుపడెనుగాన నాతనికిఁ గష్టముగా దోఁచ లేదు. సోమరితనము విడిచి లూకా పట్టుదల గలిగి మిగుల శ్రద్ధాభక్తులతో నెంతపాటుపడినను ఱాతిబొమ్మలఁ జెక్కుపనియందు ధనములభింపక తనవిద్య వలనఁ దాను జీవించుట కష్టసాధ్య మయ్యెను. చలువఱాయికన్న చౌక యైనట్టియును సులభమయినట్టియును నొకపదార్థముతోడ ప్రతిరూపముల నిర్మించుట కనుకూల మగునన్నయూహ యాతనికిఁ బొడమెను. కాబట్టి అతఁడు బంకమట్టితో బొమ్మలనుజేసి అవి చిరకాలము గట్టిగానుండునట్లు నిర్మించు కొఱకుఁ దగు పూఁతలను బూయించుచును గాల్చుచును ప్రయోగములను జేయఁ బ్రారంభించెను. అనేకప్రయత్నములు చేసినతరువాత తుట్ట తుదకు బంకమట్టికి పూఁతవేయుటకుఁ దగిన యొకపదార్థమును కనుఁగొనెను.

అయ్యది కొలిమిలోనుంచి బలమైనమంటచే కఱఁగించినపు డెన్నఁడును నాశము
కానట్టి 'ఎనేమ" లనెడు ప్రత్యేకపదార్థముగా మాఱెను. తరువాత నాతఁ
డా యెనేమ లను పదార్థముతోడ వివిధములయిన రంగులను మిశ్రమము చేసి
మఱీరాత యందమును దీసికొని వచ్చెను.

లూకాచేయు వ్యాపారముయొక్క ప్రసిద్ధి యూరపుఖండమునం
దంతట వ్యాపించెను. ఆతని శిల్పచమత్కారమును దెలుపు మాదిరివస్తువులు
సర్వత్ర వెదచల్లఁ బడెను. వానిలో ననేకములు ఫ్రాన్సు, స్పెయిన్ మొద
లగు దేశములకుఁ బంపఁబడి యచట శ్లాఘింపఁబడుచుండెను. ఆకాలము
నందు ఫ్రాన్సుదేశములో మోటుగానుండు నీరుకావి వన్నెగల జాడీలును చట్టిఁ
కుండలు మొదలగు మృణ్మయపాత్రములుమాత్రమే యుండెను. ఈరీతిగా
ఫ్రాన్సుదేశములో పాలిస్సీ యనువానికాలమువఱకు స్వల్పాభివృద్ధితో
మాత్రమే పనిముట్లు చేయఁబడుచువచ్చెను. చిత్రవిచిత్రమైన తన జీవితము
లోని కార్యము లద్భుతకల్పనములో యనునట్లు ప్రకాశింపఁ జేయునట్టి వీరా
వేశముతో నీతఁడు బ్రహ్మాండమయిన పరిమాణముగల కష్టపరంపరలలోఁ
దగుల్కొని పోరాడి విజయముగాంచెను.

ఈబెర్నార్డుపాలిస్సీ 1510 సంవత్సరప్రాంతమున దక్షిణఫ్రాన్సుదేశ
మున జన్మించినట్లు తెలఁపఁబడుచున్నాఁడు. ఈతనితండ్రి అద్దములపనివాఁడుగా
నుండెను. ఆవ్యాపారమునే యీతఁ డవలంబించెను. ఈతనికి చదువు చెప్పింప
లేనంత దైన్యస్థితిలో నీతనితల్లిదండ్రు లుండిరి. స్వర్గమును భూమియునుగాక
తనకుగ్రంథము లేవియు లేవని యాతఁ డొకమాఱు చెప్పియుండెను. అయినను
నీతఁ డద్దములపై చిత్తరువుల వ్రాయుటను నేర్చుకొనెను. తరువాత చదు
వుటయును వ్రాయుటయును నేర్చుకొనెను. పదునెనిమిదిసంవత్సరముల వయ
స్సు వచ్చినతరువాత నద్దములవ్యాపారము మూలఁబడఁగా జోలె వీపునకు వ్రే
లాడవేసికొని పితృగృహమును విడనాడి ప్రపంచములో బ్రతుకుతెఱువునకయి

దేశాటనము చేయ మొదలుపెట్టెను. మొదట నీతఁడు గాస్కొనీదేశముగుండ ప్రయాణము చేసి యచట తనకు పని లభించినందునఁ దనవ్యాపారమును జేసికొనుచు నప్పుడప్పుడు కొంతకాలము భూమి కొలుచుటయందు వినియోగించి యుండెను. తరువాత నుత్తరదేశములగుండ ప్రయాణము చేసి ఫ్రాన్సు, ప్లాండర్సు, దక్షిణజర్మనీ మొదలగు నాయాస్థలములయందు కొంతకాలము నివసించుచు వచ్చెను.

ఈప్రకారముగా పాలిస్సీ మఱి పదిసంవత్సరములు గడపి తరువాత వివాహముచేసికొని సంచారమును మానుకొని చారెంటీ దిగువభాగమున నున్న సేయింటీసు పట్టణమున స్థిరనివాస మేర్పఱచుకొని మొదటివ్యాపారమునే చేయుచుండెను. అచట నాతనికి బిడ్డలు కలిగిరి. సంసారతాపత్రయ మెక్కువయ్యెను. తాను సంపాదించిన స్వల్పధనము కుటుంబపోషణమునకుఁ జాలకుండెను. కాఁబట్టి మఱింత చులుకఁదనముతోఁ బనిచేయుట యావశ్యక మయ్యెను. అద్దములమీఁద చిత్తరువులు వ్రాయుపని లాభకారి కానందున దానిఁ బట్టుకొని వ్రేలాడుటకంటె మంచిపని చేయఁదలంచెను. కావున నాతనిమనస్సు చిత్తరువులు వ్రాయుటకును, మృణ్మయపాత్రములకు 'ఎనేమలు' పూఁతవేయుటకును పురికొల్పఁబడెను. అయిన నంతవఱకు వానివిధానములను గుఱించి యాతని కేమియుఁ దెలియకుండెను. తనపనులు ప్రారంభించుటకుఁ బూర్వము మట్టి కరుగుచుండఁగా దా నెన్నఁడును జూచియుండలేదు. ఎవనిసాహాయ్యమును లేకుండఁ దనంతట తాను నేర్చుకొనవలసి యుండెను. అడ్డంకిలేని పట్టుదలతోను తొణఁకని శాంతముతోను ఆవ్యాపారమును నేర్చుకోవలె నను నభిలాషఁ గలిగి తనప్రయత్నమునందు విజయముఁ గాంతునన్న దృఢవిశ్వాసమును గలిగి యుండెను.

లూకా చేసినదని భావింపఁబడు నిటాలియాదేశపు సుందరమైన గిన్నె నొకదానిఁ జూచినప్పటినుండియు నాతని కీనూతనవిద్య నేర్చుకొనవలె ననెడు

సంకల్ప ముదయించెను. సామాన్యమనుష్యునియం దట్టి స్వల్పాంశము గుణము పుట్టింపఁజాలదు. సామాన్యకాలమున పాలిస్సీయందును ప్రయోజనమును గల్పింపఁజాలదు. అయినను తన వృత్తిని మార్చుకొనుతలంపుతో నున్నవాఁడు గావున నట్టిమాదిరి వస్తువును తాను చేయవలయు నన్నవాంఛ యాతనిహృదయమునఁ బ్రజ్వలింపసాగెను. ఈపాత్రమును దర్శించుట యాతని జీవితము నంత నల్లకల్లోలముఁ గావించెను. ఎనేమలు పదార్థమును కనుఁగొన నిశ్చయించి యావ్యామోహమునఁ దగుల్కొని తప్పించుకొన లేకపోయెను. తానొంటరివాఁడయిన యెడల నారహస్యమునుఁ గ్రహించుటకై యిటలీదేశమునకుఁ బ్రయాణము చేసి యుండును. అయినను పెండ్లాము బిడ్డలను కలిగియుండెను. కావున వారలను విడిచిపెట్టి పోలేకపోయెను. కనుక వారితోనే యంధకారములోఁ బడియుండి ఎనేమలు పదార్థమును తెలిసికొనఁగలనన్న సంపూర్ణవిశ్వాసముతో నుండెను.

మొట్టమొదట నా యెనేమలుపదార్థమేవో కొన్ని వస్తువులయొక్క మిశ్రమ మని యూహించెను. ఏయేవస్తువులయొక్క మిశ్రమమని తానూహించెనో యావస్తువులను దెచ్చి యాపదార్థమును జేయుటకుఁ బ్రయత్నించుచు వచ్చెను. ఆవస్తువులన్నిటిని పొడుముఁజేసి సామాన్యపు మట్టికుండలను కొని పగులఁగొట్టి వానిపై నీపొడుముచల్లి వానిఁగఱగించుట కేర్పఱచిన కొలిమిలో నుంచి మంటపెట్టుచుండెను. తనశోధన లన్నియును వ్యర్థములయ్యెను. కుండముక్కలు మూలికలు మునుపటియట్లు యుండెను. కాలము దుర్వినియోగమయ్యెను. పాటుయొక్క ఫలితము లేకపోయెను. కట్టెలన్నియు వ్యర్థముగాఁ దగులఁబడి బూడిద యయ్యెను. కుడుచుటకుఁ గూడును గట్టుబట్టయును లేనప్పుడిట్టి శోధనలు చేయుటకు స్త్రీలు తోడ్పడఁజాలరు. పాలిస్సీభార్య యితర విషయములయందు భర్త కెంత వినయవిధేయురాలయియున్నను ఈవిధముగాఁ బగులఁగొట్టి వ్యర్థపఱచుటకై మట్టికుండలను కొనుట కెంతమాత్ర మొప్పుకొనకుండెను. ఈవిషయమున నాతఁడు దృఢనిశ్చయుఁడై యున్నవాఁడు

గావునఁ దనకెంత యిష్టములేకపోయినను భర్తచేయు పనికి నోర్చుకొనవలసి వచ్చి సహించి యూరకుండెను.

నెలలు సంవత్సరములు ఈరీతిగా నాతఁడు శోధనలు చేయుచునే యుండెను. ఈశోధన లన్నియు నింటిలోపలను వెలుపలనుగూడఁ జేయుచు మత్సరమయిన దారిద్ర్యము తనకుటుంబమును బట్టుకొని వేధించువఱకు తన కున్న దాని నంతయు వినియోగించి వ్యర్థపఱచెను దారిద్ర్య మనెడు మహాసముద్రములో మునింగియున్న పు డాతఁడు "నే న నేకసంవత్సరములు నాయభిలాషమును దీర్చుకొనుటకయి దుఃఖములతోను నిట్టూర్పులతోను బుద్ధిహీనతచే వ్యర్థము చేసికొంటిని" అని పలికెను. ఈశోధనలు చేయుకాలమున మధ్య మధ్యను తీఱిక కలిగినప్పుడు చిత్తరువులు వ్రాయుట, భూమి కొలుచుట మొదలగు పూర్వపు వృత్తులనుగూడఁ జేయుచువచ్చెనుగాని వానివలన వచ్చెడు నాదాయము మిక్కిలి స్వల్పముగా నుండెను. కట్టెలకగు వ్రయ మధికమగుట చేత తుదకు శోధనలుచేయుట దుస్సాధ్యముగా నుండెను. తరువాఁత నీతఁడు మరల కుండలను గొని పగులఁగొట్టి మూలికామిశ్రమమునుజేర్చి సేయింటీసు పట్టణమునకు దూరముగానున్న పెంకులుకాల్చు కొలిమిలోఁ బెట్టి శోధింప నారంభించెను. అప్పుడును నాతనికి విస్మయము కలుగునట్లుగాఁ దనశోధన యంతయును వ్యర్థమైపోయెను. ఇట్లు జరిగినను నాదృఢచిత్తుఁడు వెనుదీయక తన కృషియందు విజయమునొందువఱకు నీపని మాన నని సంకల్పించుకొని మఱింత యుత్సాహముతోఁ బనిచేయ నారంభించెను.

భూమి కొలిచెడు నుద్యోగమున నుండుటచేత కొద్దికాలము తనశోధనలను మానుకొనవలసివచ్చెను. రాజకీయ శాసనమునుబట్టి పన్ను విధించుటకు గాను సేయింటీసు పట్టణసామీప్యముననుండు పల్లపునేలలను కొలుచుట యావశ్యక మయ్యెను. ఈపనిచేసి పటము తయారుచేయుటకయి పాలిస్సీ యీయుద్యోగమునఁ బ్రవేశపెట్టఁబడెను. ఈపని కొంతకాల మాక్రమించుకొనెను.

అందులకు నాతనికి నెక్కువజీత మీయఁబడెను. ఈపని ముగించినతరువాత నాతఁడు మరల వెనుకటికన్న ద్విగుణమయిన యుత్సాహముతోను పట్టుదలతోను పూర్వపు శోధనలు చేయ నారంభించెను. ముప్పదియాఱుకుండలను దెచ్చి పగులఁగొట్టి వివిధపదార్థముల మిశ్రమముతోఁ జేర్చి సాహాయ్యమున నున్న అద్దములకొలిమివద్దకుఁ దీసికొని వెళ్లెను. తనకృషి ఫలించుసూచన కొంచెము గాన్పించెను. ఆకొలిమియొక్క యపరిమితమయిన మంటవలనఁ గొన్ని పదార్థములు కఱుఁగ నారంభించెను. కాని యెంతజాగ్రత్తగాఁ బరిశోధించి చూచినను ఎనేమలువంటి తెల్లనిద్రవపదార్థముఁ గానఁబడలేదు.

నేలకొలతవలన సంపాదించినధనము వ్యయమగువఱకును మరల రెండు సంవత్సరములు వ్యర్థము లయిన శోధనలను చేయుచునే యుండెను. అతఁడు మరల దరిద్రస్థితికి వచ్చి యుండెను. కడపటిశోధన యని మఱింతపట్టుదలతో విశేషప్రయత్నము చేసెను. వెనుకటికంటె నధికముగాఁ గుండలను దెచ్చి పగులఁగొట్టి తాను సమకూర్చిన మిశ్రమపదార్థములతోఁ జేర్చి యద్దములఁ గఱగించి కొలిమికిఁ బంపి వానిఫలితమును దెలిసికొనుటకయి స్వయముగాఁ బోయి శోధించుచు నచట వేచియుండెను. నాలుగుగంటలవఱకు వేచియుండఁగాఁ దుదకు మూఁడువందలకుండపెంకులలో నొకదానిపై నున్న ప్రధానపదార్థము కఱఁగెను. దానిని పైకితీసి చల్లాఱఁబెట్టిచూడఁగా గట్టిపడి తెల్లగాను నునుపుగాను మెఱయుచుండెను. దానిని జూచినవెంటనే యాతఁడు పట్టరాని సంతోషముతో నింటికిఁ బఱువెత్తి భార్యకు నాపదార్థమును జూపించెను. ఇట్టి స్వల్పవిజయము లభించుటవలన నింక సంపూర్ణ విజయముగలుగక మానదన్న దృఢవిశ్వాస మాతని హృదయమున నంకురించెను. అందువలన నాదృఢచిత్తుఁడు విడువక మరల మరల శోధనలఁ జేయుచు విఫలమనోరథుఁడగుచు వచ్చెను. పూర్ణమైన విశ్వాసముతో నాతఁడు తనయింటికి సమీపమున నద్దముల కొలిమి నిర్మించుటకు నియమముచేసికొని యిటుకావములోనున్న యిటుకలను

తనవీపుమీఁద మోచుకొనివచ్చి తనచేతులతోనే కొలిమి నిర్మించెను. అందున
కేడెనిమిది నెలలకాలము పట్టెను. తరువాత నెప్పటియట్ల శోధన ప్రారంభిం
చెను. ఆపనికిం దనవద్దనున్న కట్టెలు చాలునని యూహించెను. ఆతఁడు
మంటపెట్టి కట్టెలు తగిలించుచు నొకరోజంతయుఁ గడపెను. రాత్రి
యంతయు దానిని గమనించుచు వేచియుండెను. ఆప్రధానపదార్థము కఱఁగి
ఎనేమలు బయలుపడలేదు. సూర్యోదయమై కొంచెముపైకి వచ్చెను. అప్పుడు
భార్య కొద్దిగ చల్దియన్నమును దెచ్చెను. అదిలేనియెడల కొలిమిలో కట్టెలు
చేర్పుటకే శక్తుఁడు కాకపోవును. రెండవరోజుకూడ మొదటి దానివలెనె
గడచిపోయెను. మూఁడవరోజు వచ్చెను. కండ్లు లోఁతుగ దించుకొనిపోయి
శవాకారముగానున్న పాలిస్సీ దృఢచిత్తుఁడై ఎనేమలెప్పుడు కరఁగునా
యని తదేక దీక్షతోఁ జూచుచుండెను. ఇట్లు మూఁడవరోజుకూడఁ గడచెను.
ఆప్రకారము 4, 5, 6, దినములు గడచినవి. రాత్రింబగళ్ళీవిధముగా నెంత
యుఁ గష్టపడుచు నెంతదీక్షతోనున్నను ఎనేమలు కరఁగ నేలేదు. అంతట
తానుగప్పిన ప్రధానపదార్థములలో నేదోదోషముండెనని యాతఁడూహించెను.
మరలఁ గ్రొత్తవిచేర్చి యథాప్రకారముగా నూతన శోధన ప్రారంభించెను. రెండు
మూఁడువారములు గడచినవి. కుండలు సంపాదించుట దుస్సాధ్యముగా నుండె
ను. సొమ్మంతయు వ్యయమయ్యెను. ఇఁక నప్పుచేయవలసి యుండెను. ఇట్టి వ్యర్థశో
ధనలవలన లాభములేకపోవుటచే భార్యయును ఇరుగుపొరుగు వారలును బుద్ధి
హీనుండని ఆతనిని తలంచినను అతనియోగ్యత కేమాత్రమును లోపము రాలేదు.
ఇంతేగాక యెట్టకేలకు జయమునుగూడఁ బొందెను. తన మిత్రునియొద్ద నప్పు
పైకొని కావలసిన సాధనవస్తువులను గొని మరల గృషిచేయఁ నారంభించెను.
యథాప్రకారము కుండముక్కలను సాధనవస్తువులను కొలిమిలోఁ బెట్టి మంట
బెట్టుటకుఁ బ్రారంభించెను. అదియే వాని కడపటి పరిశోధనము. అగ్నిహో
త్రము బగబగలాడుచు మండుచుండెను. వేఁడిమి యతిశయించెను. ఎనేమలు

కరఁగలేదు. కట్టెలు సరిపోయినవి. ఇంక నగ్గి యెట్లు నిలుపఁ గలుగును? అంతట తోఁటలోని కంచెలను దెచ్చి కొలిమిలో వేయుచుండెను. అవియును వ్యర్థముగాఁ దగులఁబడెను. ఇంకను ఎనేమలు కఱుఁగలేదు. ఇంక బది నిమిషములు మంట నిలిచినయెడల నది కఱఁగును. కట్టెలు లేవు. చేయవలసిన దేమియు లేక యుండెను. పిమ్మట నాతఁ డింటిలోని కఱ్ఱసామానును దెచ్చి గొలిమిలో వేయుచుండెను. బల్లలు మొదలగు నుపయోగకరములయిన వస్తువులను బ్రద్దలుగాఁ గొట్టి కొలిమిలోఁ బడవైచుచుండెను. తుదకు నింటివాసములు నూడఁబెఱికి మంటలో వేయుచుండెను. వాని భార్యపుత్త్రాదు లాతనికి మతి పోయినదని యేడువ మొదలు వెట్టిరి. బీరువాలు కొయ్యపెట్టెలు మొదలగు విలువగల సామాను సయితము మంటపాలు చేయుట సహింపఁజాలక పెండ్లామును బిడ్డలును గొల్లున గోలపెట్టుచు నూరిలోఁ బడి పాలిస్సీకి పిచ్చి పట్టినదని మొఱలిడ సాగిరి. తినఁ గూడులేదు. కట్ట బట్ట లేదు. సర్వవిధముల నాతఁడు భ్రష్టుఁడై కృశించిపోవుచుండెను. ఇట్టిదృఢచిత్తము గల వాని ప్రతిజ్ఞను దైవము మన్నింప కుండునా? అప్పు డత్యద్భుతముగా నాపదార్థములన్నియుఁ గరఁగిపోయినవి. కొలిమిలోనుండియు మంటిపాత్రములను బైకిఁ దీసిచూడఁగాఁ దెల్లని నునుపైన బదార్థ మాపాత్రములపైని బూఁతవేసినట్లుగా నంతట నలముకొనెను.

తరువాత పాలిస్సీ తాను చూపిన మాదిరిగ మంటిపాత్రములను జేసి తన కద్దె నిచ్చునటుల నొక కుమ్మరివాని నేర్పఱచుకొనెను. మంటిపాత్రములను జేసి యనేకులు పూఁతవేసి విక్రయమునకు సిద్ధపఱచు వఱకు జీవన మెట్లు జరుగఁగలదు? కాని యదృష్టవశమువలన నాపట్టణమునందు నొక గృహస్థుఁడు పాలిస్సీ నమ్ముదానియందు విశ్వాసము లేకపోయినను అతని సత్యవర్తనమునందు దృఢవిశ్వాసము కలిగి యాఱుమాసములవఱకు కాతనికి బసయిచ్చి పోషించుట కొప్పుకొనెను. అట్లయినను పాలిస్సీ తాను నియమించుకొన్న

కమ్మరివానికి సొమ్మియలేక వానికి బాకీపడి కొంత యప్పునకు తనబట్టల నిచ్చివేసెను. వెనుకరీతిని బ్రయత్నించి చూచెనుగాని ఏనేమలు సరిగా నేర్పడినను పని పాడయి సూత్రములు సరిగా లేకపోయినవి. తక్కువవెలకు వానిని కొనుటకుప్రజలు సిద్ధముగానున్నను అందువలనఁ దనకు గౌరవ భంగము కలుగునని యాఱుమాసములు కష్టపడి చేసిన వాని నన్నిటిని చితుకఁగొట్టెను.

ఇంతియఁగాక యాతఁడు తనకృషియందు తనకుఁ గల పూర్ణవిశ్వాసమును తనకుటుంబము వారివలనఁ గలుగు బాధలను జనులపరిహాసములను తన దారి ద్ర్యమును తనమనోదుఃఖమును దలంచుకొని పరిపరివిధముల వెచ్చనూర్చు చుండెను. ఈరీతిగాఁదనదుస్థితినిఁ దలంచి విచారగ్రస్తుఁడు నిరుత్సాహుఁడు నై పిచ్చిపట్టినవానివలె సేయింటీసు పట్టణములోని పొలములలోఁదిరుగుచుండెను. చినిఁగిపోయిన గుడ్డలుకట్టుకొని కృశించిపోయిన వికృతవేషముతోనున్న నాతని స్వకుటుంబమేమి యిరుగుపొరుగువారేమి నానావిధముల దూషించుచుఁ బరిహ సించుచుండిరి. అంతట నాతఁడు ధైర్యమవలంబించి ప్రారంభమునఁ దాను పూనినవృత్తియందుఁ బ్రవేశించి యొక సంవత్సరము పాటుపడి కొంతడబ్బు సంపాదించి తనసంఘమువారివలన మెప్పునొంది మరలఁదనయభిలాషమును గడ తేర్చుకొనుటకై ప్రయత్నింపసాగెను. ఎట్టకేలకు పదునాఱుసంవత్సరములు నానాకష్టములపడి తనకృషియందు విజయమును గాంచి తనవ్యాపారమును బలపఱచి దినదినాభివృద్ధి పొందించుచుండెను. తనజీవితమును సుఖప్రదమును గావించుకొనెను. తాను ధనమును సౌఖ్యమును బొందఁగలిగినను కష్టము లాతని నింకను విడిచినవికావు. ఈతఁడు ప్రొటెస్టాంటుక్రైస్తవమత మవలం బించినవాఁడగుటవలన దొంగతనమువారికేమి జనసామాన్యమునకేమి యీతని పట్ల ద్వేషము ప్రబలమై తుదకితనియిల్లు ముట్టడివేసి వ్యాపారమును పాడు చేసి సర్వమును దోఁచుకొని బోర్డోపట్టణమునఁ జెఱసాలం ద్రోచి బ్రతికి యుండఁగా గాల్చివేయుటకు సిద్ధము కాఁగా నీయొసేమలు చేయువిద్య

మతి యెవరికిఁ బట్టుపడలేదు గావున మతముకొఱకుఁ జంపఁబడవలసినవాఁ డయినను ఈవిద్యకొఱకు వానిని రక్షింపవలసిన దని యధికారము గల యొక ప్రభువు వాదించెను. తరువాత బంధవిముక్తుఁడై తనపట్టణముఁ జేరి కొడుకుల సాహాయ్యమువలనఁ దనజీవితముయొక్క కడపటిదినయందు కుష్ఠరపనినిగుఱించి బహుగ్రంథములను రచియించెను. ఒక్క యీవిద్యనుగుఱించిమాత్రమే గాక వ్యవసాయశాస్త్రము, జంతుశాస్త్రము మొదలగు గ్రంథములను వ్రాసెను. జోస్యము, మంత్రశాస్త్రము, బంగారు చేయునట్టిశాస్త్రము మొదలగుశాస్త్రములు మానవాభివృద్ధికి భంగకరము లని సహేతుకములతోడ విమర్శించి ప్రచురించెను. డెబ్బదియెనిమిది సంవత్సరముల వయోవృద్ధుఁడై యున్న కాలమున నీతని సంస్కారకృత్యములను బోధనలను విని పాషండుఁ డని శత్రువులు పెక్కుఱ్ఱు బయలుదేఱి యీతని మరల చెఱసాలం ద్రోచిరి. ఆదేశపురాజు వానివద్దకు వచ్చి "నీమతము విడిచినయెడల నిన్ను రక్షించెదను. నీవిద్యకొఱకు నలువదియైదుసంవత్సరములు కాపాడితిమి. విననియెడల రేపటిదినము కాల్చివేతు మని బెదరించెను." అందులకు పాలిస్సీ "అయ్యా ! నాకు చావన్న భయములేదు; నీప్రజలకు నీవు వశుఁడవైతివి గాని దేవుని తలంప కున్నావు. దేవునియందు భక్తిగల నాకు నీవలనను నీప్రజలవలనను భయములేదు. ఎట్లు చావవలెనో నాకు తెలియును." అని ప్రత్యుత్తరమిచ్చెను. తరువాత నొక సంవత్సరము కారాగృహవాసశిక్ష ననుభవించి బాస్టిల్లీ పట్టణమున సుఖముగా దేహమునుజాలించెను.

# నాలుగవ ప్రకరణము.

---

పట్టిపింగాణిని కనిపెట్టిన జానుఫ్రిడరిక్ బోట్గరు అను వానియొక్క జీవితము పాలిస్సీ జీవితముకంటె మిక్కిలి వ్యత్యాసము కలదై యున్నది. 1685వ సంవత్సరమున వాయిట్లాండు మండలమున స్లీజను గ్రామమున బోట్గరు జన్మించెను. పండ్రెండు సంవత్సరముల ప్రాయము వచ్చినతరువాత బర్లిను నగరములోని యొకవైద్యునివద్ద పని నేర్చుకొనుటకు నొప్పగింపఁబడెను. మొదటి నుండియు రసాయనశాస్త్రమునం దభిరుచి కలవాఁడై తీఱిక కాలము నంతయును శోధనలు చేయుటయందుఁ గడపుచుండెను. సామాన్య లోహములను సువర్ణముగా మార్పవలె నన్న సంకల్పము మనస్సులో నుంచుకొని పనిచేయుచు వచ్చెను. కొన్ని సంవత్సరములు పోయినతరువాత బంగారమును చేయునట్టి యొకపదార్థమును కనిపెట్టితి నని వెల్లడి చేసి యాప్రజ్ఞ కలిగియున్నట్లు నటించుచుండెను. ఒకప్పుడు తన యజమాని యైన జోరను కడ తన శక్తులను జూపి యేదో టక్కరితనము చేసి రాగిని బంగారము చేసినట్లుగా నాతనిమాత్రమే గాక యాతనితోడఁ జూడవచ్చినవారినిగూడ నమ్మించి మోసపుచ్చెను. ఈమహారహస్యమును కనిపెట్టిన బోట్గరుని వృత్తాంతము దేశమెల్లెడల వ్యాపించినది. సువర్ణకారుని సందర్శించుటకై బహుజనులు వాని యంగడివద్దకు గుంపులు గుంపులుగ వచ్చి చూచుచుండిరి. ఆదేశమును పాలించు రాజుకూడ వానిని చూచి మాట్లాడవలసిన పనియున్న దని తన యభిలాషను దెలిపెను. రాగి బంగారముగా మార్పఁబడిన దని చెప్పఁబడిన యొక బంగారపు ముక్క ఫ్రిడరిక్కను రాజునకు బహుమానము చేయఁబడినపుడు నాప్రభువు మేరమీఱిన ద్రవ్యలాభమును బొంద నదృష్టము లభించెను గదా యని

యుష్పాంగెను. ప్రష్యాదేశము ధనమునకై కష్టదశలో నుండుటచేత రాజు నా బోట్ఘరుని వశపఱచుకొని బలాఢ్యమగు ష్పాండావుకోటలో నుంచి తన కొఱకు బంగారమును చేయు పనియందు నియమించుటకై నిశ్చయించుకొనెను. కాని యీ పసుచువైద్యుఁడు ప్రభువుయొక్క తలంపును కనిపెట్టి చిక్కు పడుదు నన్న భయముచేతను గాఁబోలు దేశము విడిచి పోవ నిశ్చయించుకొని తుదకు శాక్జనీ దేశమునకుఁ బాఱి పోయెను.

తరువాత బోట్ఘరునియొక్క సమాచారమును దెలిపినవారికి వేయి డాలరులు బహుమాన మీయఁబడు నని ప్రకటింపఁబడినను కార్యకారి కాక పోయెను. బోట్ఘరు విట్టెంబర్గు పట్టణమునకుఁ బోయి పోలాండుదేశపు రాజు నకు ప్రాణసంరక్షణార్థము విజ్ఞాపనము చేసికొనెను. ఆసమయమున నా పోలాండుదేశపు రాజుగూడ ధనాభిలాషియై యున్నవాఁడు గావున మిక్కిలి సంతోషించి యీస్వర్ణకారుని మూలమున విశేష ద్రవ్యమును సమకూర్ప వచ్చు నని నిశ్చయించి తనయొక్క మూలబలము తోడుగానిచ్చి రహస్యముగా డ్రెస్డెను పట్టణమునకుఁ బంపించెను. అతఁ డచట సువర్ణగృహమునఁ బ్రవేశ పెట్టఁబడి రక్షకసైన్యముతోఁ గాపాడఁబడుచు గౌరవముగాఁ జూడఁబడు చుండెను. ఆతఁడు విట్టెంబర్గుపట్టణము వదలిపెట్టిన తోడనే ప్రష్యాదేశపు సైన్య మీతని కొఱకు వచ్చెను గాని ప్రయోజనము లేకపోయెను. సువర్ణము మీఁద యాశచేత బంగారము చేయు నా రహస్యమార్గమును దనకుఁ జూపు మని యాదేశపు రాజు బోట్ఘరుని బలవంతపెట్టెను. చేతఁ జిక్కియున్న యాతఁ డేమి చేయఁగలఁడు? అంతట నాకపటవేషధారి యొజ్జని ద్రవపదార్థము గల యొకచిన్నబుడ్డిని పంపించి దీనిని వెచ్చఁ జేసి యుపయోగించిన యెడల సమస్తలోహములను బంగారముగా మార్చు నని చెప్పెను. ఈబుడ్డిని రాజ కుమారుఁడు ముందుగాఁ గైకొని దానితో వార్సా నగరమునకుఁ బోయెను. తరువాత రాజును రాజకుమారుఁడును నంతఃపురమందిరములోని యొక గదిలోఁ

జేరి తలుపులు బిగించుకొని రాగిని బంగారము చేయుటకుఁ బూని దానిని కరఁగింప నీక్రొత్త ద్రవపదార్థమును దానికిఁ జేర్చుచు నిజముగా బంగార మగు నన్న విశ్వాసముతో సకల శ్రమలను బడుచుండిరి. ఎన్ని పాటులఁ బడినను రాగి యథాప్రకారముగానే యుండెను; గాని కరఁగి బంగార మగుజాడ గానరాకపోయెను. చిత్తశుద్ధి లేని యెడల నాపని జరుగనేర దనియును ఆపని మొదలుపెట్టుటకు ముందు దుష్టసాంగత్యము సంభవించిన దనియును, అందు వలననే యీకృషి యందుఁ దనకు విజయము కలుగలే దనియును తలంచెను. రెండవ సారి పరిశుద్ధ మైన హృదయముతో శోధనము ప్రారంభించి యెంత శ్రద్ధగా జరపినను వ్యర్థమగుటచేత నగ్నిహోత్రునివలె మండిపడు చుండెను. ఏరీతి నైన నిర్బంధించి బోట్ఘరుచేత బంగారము చేయించుటకు దృఢసంకల్ప మును బూని యుండెను. బోట్ఘరుని కిది తెలియవచ్చిన పిమ్మట నింక ప్రమా దము సంభవింపక మానదని నిశ్చయించుకొని యెట్లో రక్షక సైన్యమునుండి తప్పించుకొనిపోయి మూఁడహోరాత్రములు ప్రయాణము చేసి ఆస్ట్రియా దేశములోని యెన్సు పట్టణమును జేరి యచట సురక్షితముగాఁ గాలము గడుప వచ్చునని తలంచెను. అయినను పోలాండు రాజభటులు వాని వెంటనే పఱు వెత్తి వానిని బట్టుకొని వాఁ డెంత మొఱ్ఱపెట్టినను, తనకు తోడు చూప వలసిన దని ఆస్ట్రియా దేశాధికారుల కెన్ని విజ్ఞాపనలను బంపినను మానక బలవంతముగా డ్రెస్డెను పట్టణమునకు గొంటుకొని పోయిరి. తదాదినుండి యాతని కోనింగుస్టేయిను కోటలోనుంచి మున్నటి కంటె నెక్కువ బలమును కాపువెట్టి రాష్ట్రధనాగారము శూన్యముగా నున్నదనియును పది పటాలము లకు జీతములు చెల్లింపవలసి యున్న దనియును, సువర్ణ మావశ్యకమై యున్న దనియును రాజు బోట్ఘరునకు వర్తమానము పంపుటయే గాక తాను గూడ స్వయముగాఁ బోయి "నీవు వెంటనే బంగారమును జేయకుండిన యెడల నీకంఠముఁ ద్రుంచెద." నని మిక్కిలి కఠినముగాఁ జెప్పెను.

ఈరీతిగా సంవత్సరములు గడచెను. అయినను బోట్ఘరు, బంగారమును జేయలేదు. ఉరి తీయఁబడను లేదు. ఈ కాలయాపనమువలన రాగిని బంగారము చేయుదానికంటెను ప్రధానమైన దగు బంకమట్టిని పింగాణిగాఁ జేయుట కవకాశము చిక్కెను. చీనాదేశమునుండి పోర్చుగీసు వారివలన నిట్టి మాదిరి పాత్రములు కొని తేఁబడి యెత్తునకెత్తు బంగారమునకు విక్రయింపఁబడుచుండెను. ఈవిషయమునకయి బోట్ఘరుని చిత్తమును మొట్టమొదట త్రిప్పినవాఁడు సులోచనములు మొదలగు పనిముట్లను చేయునట్టి వాల్టరనువాఁడు. ఈవాల్టరు విద్యాధికుఁడయి పేరు పొంది రాజుచేతను రాజకుమారుని చేతను మిగుల గొప్పగా గౌరవింపఁబడుచుండెను. ఈతఁడు "నీవు బంగారమును జేయలేక పోయిన మానెగాని మఱియొకదానిఁ జేయుము. పింగాణిని జేయుము." అని బోట్ఘరుని కోరెను.

ఈతని హితోపదేశమును విని యీవిషయమును గూర్చి శోధనలఁ జేయుచు రాత్రింబగళ్లు విరామములేక పాటుపడుచుండెను. విజయమును బొందకయే చాలకాలము గడచెను. ఇట్లు చేయఁగాఁ జేయఁగా మొదట యెఱ్ఱ పింగాణిని కనిపెట్టఁ గలిగెను. దానినే చేయుచు నదియే పింగాణి యని విక్రయించుచుండెను.

అయినప్పటికిని నిజమయిన పింగాణియొక్క రంగు తెల్లగా నుండు నన్న సంగతి యాతనికిఁ దెలియును. ఈ తెల్ల పింగాణిని బడయుటకయి బహు సంవత్సరములు శోధనలు చేయుచునే యుండెను. కడపట 1707 వ సంవత్సరములో నిజమగు తెల్ల పింగాణిని కనుఁగొనెను. దానిని రాజునకుఁ జూపించెను. రాజు దానికి మిక్కిలి సంతోషించి యీవ్యాపారమును వృద్ధి పఱచుటకయి కావలసిన యుపకరణముల నన్నిటిని నాతని కిచ్చుటకయి యుత్తరు విచ్చెను. తెలివి గలిగినట్టియును నొక పనివానిని సాహాయ్యముగాఁ గొని పింగాణి వ్యాపారము నభివృద్ధిలోనికిఁ దెచ్చెను. అందు కొక యంత్ర

శాలను స్థాపించెను. ఇట్లుండినను రాజునకు వీనియం దనుమానము మాత్రము విడువ లేదు. ఈరహస్యము నితరులకుఁ జెప్పునేమో యన్న యనుమానముచేత కాపు వెట్టి యాతని కొఱకు స్థాపింపఁబడిన నూత్నయంత్రముల చుట్టును రక్షకసైన్యముల నుంచి రాత్రింబగల్లు కాచుచుండ వలసిన దని నియమించెను. ఇంతియగాక యీ కష్టరివాఁడు పాఱిపోకుండ నాతని రక్షణమునకయి యున్న కోర్యోగీయుల నాలుగురిని నుత్తర వాదులనుగా నేర్పాటు చేసెను.

బోట్ఘురు తరువాత క్రొత్త కొలుములతోఁ జేసిన శోధనలు విజయము గాంచుటయును, ఆతఁడు కనుఁగొనిన పింగాణీవలన నెక్కువ సొమ్ము లభించుచుండుటయును జూచి ప్రభుత్వమువారు తా మొక పెద్ద యంత్రశాలను స్థాపించుటకుఁ గృతనిశ్చయు లైరి. డెల్ఫ్టు పట్టణమునఁ జేయఁబడిన మట్టిపాత్రములవలన హాలండు దేశము భాగ్యవంత మైనపుడు ఈ పింగాణి వ్యాపారమువలన నీశాక్జనీ దేశపురాజేల యైశ్వర్యవంతుఁడు గాకుండును? కాఁబట్టి శాక్జనీ దేశపురాజు 1710 వ సంవత్సరము 23 వ జనవరి తేదిని మెయిస్సేను మండలమున ఆల్బ్రెక్ట్సు పట్టణమున నొక మహానూతన యంత్రశాల నిర్మించుటకు తీర్మానించెను. దీనిని గుఱించియును, ఈవ్యాపారాభివృద్ధిని గుఱించియును ల్యాటిను, ఫ్రెంచి, డచ్చి భాషలలోఁ బ్రకటన పత్రికలను వ్రాయించి యితర దేశపు రాజ సభలలోఁ బ్రకటించెను. ఇతర దేశములనుండి పనివాండ్రను రప్పించి బోట్ఘురునకు సహాయులనుగాఁ జేసి వారలకు జీత బత్తెముల నేర్పఱచెను. ఈయంత్రశాలల కన్నిటికిని బోట్ఘురు కార్యనిర్వాహకుఁడుగాఁ జేయబడుట మాత్రమే గాక "బ్యారను" పదవికిఁ గొనిపోఁబడె ననియును జర్మనీ దేశపు వార్తా పత్రికలయందుఁ బ్రకటింపఁ బడెను.

ఇట్టి మర్యాదలకు బోట్ఘురు తగినవాఁడే యనుటకు సందియము లేదు. కాని దొరతనమువారి వలన నాతఁడు చూడఁబడుచున్న విధము మాత్రము మిక్కిలి క్రూరముగాను నీచముగాను అమానుషముగాను నుండెను. అతఁ

డెల్ల కాలము రాజుయొక్క బందీలో నుంచఁబడెను. ఆతఁడు వెలుపలకు వచ్చునప్పుడును పని చేయునప్పుడును రక్షకభటులు కావలి కాచుచుందురు. రాత్రు లాతని గది రక్షకభటులచే బీగము వేయఁబడును. ఆతఁ డప్పుడప్పుడు రాజునకు వ్రాసికొనునట్టి జాబులు మిక్కిలి జాలిని పురి కొల్పుచుండును. "నా జీవితకాల సంపదయును పింగాణి వ్యాపారమందే వినియోగింతును; పూర్వ మితరులు చేసిన దానికంటె నధికముగాఁ జేయుదును; నాకు స్వేచ్ఛను మాత్ర మిండు." అని పలుమాఱులు రాజునకు విజ్ఞాపనములను బంపించు కొనెను.

ఈ విజ్ఞాపనముల నన్నిటిని రాజు పెడచెవిని బెట్టెను. కావలసిన ద్రవ్యమును నొసంగి యుపకారము చేయుటకు సిద్ధముగా నుండెను గాని స్వేచ్ఛను మాత్ర మనుగ్రహింపలేదు. ఆతఁడు వానిని దన బానిస వానినిగాఁ జూచుకొనుచుండెను. ఇట్టి స్థితిలో నాతఁడు బాధితుడై రెండేండ్లవఱకుఁ బని చేయుచుండి తన బ్రతుకు నేవగించుచు లక్ష్యము లేనివాఁ డయి యుండెను. ప్రపంచము మీఁదను తనమీఁదను రోతపుట్టి త్రాగుబోతుఁ దనము నేర్చుకొనెను. ఈతఁ డిట్టి దుర్వ్యసనమునకుఁ బాల్పడఁగానే యంత్రశాలలోఁ బని చేయువా రెల్లరు నీ దురభ్యాసమునకు లోఁబడి త్రాఁగుబోతు లైరి. అందు వలన జగడములును పోరాటములును ప్రబలముగా వృద్ధి నొంది నెమ్మదికి భంగము కలిగించుచున్నందునఁ దఱచుగా సైన్యములను రప్పించుట యావశ్యక మగుచుండెను. కారాగృహవాసులుగాఁ జేయఁబడిరి. **1713** వ సంవత్సరము మే నెలలో బోట్ఘరు రోగగ్రస్తుఁడై జీవయాత్ర ముగించునట్టులు కాన్పించు చుండెను. అట్టి విలువ గలిగిన బానిసనాని యెడబాటునకు భయపడి రాజు వానికి రక్షక సైన్యముతో బండిమీఁద షికారు చేసి వచ్చుట కనుజ్ఞ యిచ్చెను. **1714** వ సంవత్సరము స్వేచ్ఛ యొసఁగఁబడు నని వాగ్దత్తము చేయుచు నొక జాబు వ్రాసి ప్రభువు పంపెనుగాని కాల మతిక్రమించెను. అప్పటికే శరీరా

రోగ్యము చెడినవాఁడై మతిపోయి సురాపానరతుఁడై నిరంతరము కారాగృహమున బంధింపఁబడి మనోవ్యాధిచేఁ గృశించి పోవుచున్న యానిర్భాగ్యజీవునకు నీయుత్తరము సంతోషమును కలిగింపలేక పోయెను. అతఁడీస్థితిలో నైదు సంవత్సరములు జీవించి 1719వ సంవత్సరము తన ముప్పదిరెండవ యేఁట దేహవియోగమును బొందెను. ఆతనిఁ గుక్కవలె నొక రాత్రి పూడ్చి పెట్టిరి. ఆ శాక్జనీ దేశమునకు మహోపకార మొనర్చిన వారిలో నొకఁడైన యీ మహనీయునకుఁ గలుగఁ జేసిన బాధ లట్టివిగా నుండినయవి.

ఇంగ్లాండుదేశపు కుమ్మరియగు జోసయా వెడ్జివూడ్డుయొక్క నడత పాలిస్సీ బోట్ఘరులవంటిది గాక సుఖప్రదమైనదిగా నుండెను. ఇంగ్లాండు దేశము పదునెనిమిదవ శతాబ్ద మధ్యమమువఱకు నైరోపా ఖండములోని యితర దేశములకంటె సకాయకష్ట కర్మలయందు వెనుకఁబడియే యున్నయది. వెడ్జివూడ్ కాలమువఱకు నింగ్లాండు దేశమునఁ జేయఁబడు మట్టి పాత్రములు సొగసయినవియును, ఎక్కువ కాలము మనునవియును గాక సామాన్యమయినవిగా నుండెను. హాలండు దేశమునుండియును జర్మనీ దేశము నుండియును వచ్చునట్టి పాత్రములు మేలయినవిగాను విలువగలవిగాను నుండినవి. 1730 వ సంవత్సరమునందు వెడ్జివూడ్డు జన్మించిన తరువాత నాతనియొక్క బుద్ధి విశేషము వలనను సామర్థ్యమువలనను మట్టి పాత్రముల వ్యాపారము పూర్తిగ మాఱిపోయెను. వెడ్జివూడ్డు మరణము నొందువఱకు నఁగా నఱువదియైదు సంవత్సరముల కనంతరము కుమ్మరి పని పరిపక్వ దశకువచ్చి స్వదేశ వ్యాపారమునందు ప్రధానమైన స్థానమును బొందెను.

వెడ్జివూడ్డు సామాన్యుఁడైన పనివాఁడు కాఁడు. మిక్కిలి యోరిమియును జాగరూకతయును బుద్ధివికాసమును గలవాఁడు. సకాయకష్ట కర్మల నభివృద్ధి పఱచుటయందు జనసామాన్యమునకు మార్గ ప్రదర్శకుఁడైన వాఁడు. ఆర్క్‌రైటువలెనే పదముగ్గురు బిడ్డలుగల కుటుంబములోఁ గడపటివాఁడుగా

నుండెను. ఇతని తాతయును, పిన్నతాతయును, తండ్రియును కమ్మరి పని సే
చేయుచుండిరి. ఈతఁడు బాలుఁడుగా నుండినపుడే తండ్రిమరణము నొందెను.
పిత్రార్జిత మీతనికిఁ దండ్రి పోవునప్పటికి నిరువది పౌనులు మాత్రమే యుం
డెను. గ్రామ పాఠశాలలోఁ జదువుటయును వ్రాయుటయును నేర్చుకొను
చుండెను. కాని తండ్రి మృతుఁ డయిన వెనుకఁ జదువు మాన్పింపఁబడిపదు
నొకొండు సంవత్సరముల వయస్సు గలప్పుడు జ్యేష్ఠ సోదరునిచేఁ బనిలోఁ
బ్రవేశ పెట్టఁబడెను.

అట్టి బాలప్రాయముననే జీవయాత్ర నారంభించిన తరువాత స్వల్ప
కాలమునకు భయంకర మగు స్ఫోటకపు వ్యాధి పాలఁ బడెను. ఆవ్యాధి కాల
మున నాతని కుడిమోకాలియందు నొక జబ్బు పుట్టి మానక యప్పటప్పటఁ
దిరుగఁ బొడఁ జూపుచు వేధించుచున్నందువలన నవయవచ్ఛేదనముఁ గావింప
వలసివచ్చి యంగవిహీనత్వమువలన జీవితకాల మంతయు బాధ పడుచుండెను.
ఈయంగ విహీనత్వమే యాతని భవిష్య దభివృద్ధికిఁ గారణ మయ్యెనని గ్లాడ్
స్టోను బర్లిన్ పట్టణమున నిచ్చిన యుపన్యాసములలోఁ జెప్పెను. తా నవలం
బించిన శిల్పముయొక్క మర్మముల నన్నిటిని దెలిసికొని కృషి సాఫల్యమును
బొందునంత జ్ఞానము నాతనికిఁ గలిగించెను.

తన సోదరునితోఁ గూడ పని నేర్చుకొన్న తరువాత జోసయా మతి
యొక పనివానితో భాగస్వామిగాఁ జేరి గృహోపయోగార్థమై కత్తి పిడులు,
పెట్టెలు, మొదలగు చిల్లర సామానులను జేయు స్వల్పవ్యాపారమును బ్రారం
భించెను. ఈరీతిగా నితరులతోఁ జేరి స్వల్పవ్యాపారమును జేయుచున్నను
1759 వ సంవత్సరము బర్లిన్ పట్టణమున నితరులను విడిచి స్వతంత్రముగాఁ
దాను పని ప్రారంభించు వఱకు నభివృద్ధి లేక సామాన్యుఁడుగానె దినములు
గడపుచుండెను. స్వతంత్ర వృత్తియందుఁ బ్రవేశించిన తరువాత తన తెలివి
తేటల నుపయోగించి జాగరూకత గలవాఁడై నూత్న వస్తువులను గల్పన
చేయుచు వ్యాపారమును వృద్ధి పొందించెను.

ఆదివఱకు కాలమునఁ జేయఁబడునట్టి యెనేమలు పాత్రములకంటె నెక్కువకాలము మనునట్టియును, ఎక్కువ సొగసును నునుపును గలిగినట్టియును మీఁగడ రంగుగల యెనేమలు పాత్రములను జేయుటయందు మాత్రమే తన బుద్ధిని వినియోగించి పాటుపడుచుండెను. ఈవిషయమును గురించి సంపూర్ణముగాఁ దెలిసికొనుటకుఁ దన తీఱిక కాలమునంతయును రసవాదశాస్త్రము నభ్యసించుచుండెను. బంకమట్టితో ననేకవిధము లయిన శోధనలను గావించెను. సూక్ష్మబుద్ధి కలవాఁడును బ్రతిసూక్ష్మాంశమును విడిచిపెట్టకుండఁ బరిశీలించు స్వభావము కలవాఁ డగుటవలనఁ దుదకు నొకవిధమైన యిసుకతో మిశ్రమమై కాల్చుటకు ముందు నల్లగానుండి మండుచున్న కొలిమిలోఁ బెట్టి చక్కగాఁ గాల్చిన తరువాతఁ దెల్లఁబడునట్టి మట్టిఁ గనుఁగొనెను. ఇట్టిసంగతిఁ గనుఁగొన్న తరువాత నిదివఱ కెవ్వరును గనిపెట్టని తళుకుతళుక్కని మెఱయునట్టి నునుపును దెప్పించుటకై యాతఁడు కృషిచేయవలసియుండి దానికై విశేషపరిశ్రమమును జేసియుండెను.

పాలిస్సీ కష్టపడిన రీతిని వెడ్జివూడ్డు కష్టపడ నక్కఱలేకపోయినను కొలిమి నేర్పఱచుకొనుటయందు నీతఁడుగూడ బాధపడుచు వచ్చెను. అతనివలెనె నిరంతర పరిశ్రమమువలనను తప్పిపోని యోపికవలనను వదలిపెట్టని పరిశోధనలవలనను కష్టముల నన్నిటిని దప్పించుకొనఁ గలిగెను. నెలల కొలఁదిఁ జేసిన పాటుయొక్క ఫలిత మొక్కదినములో నాశమగుచుండెను. బహుదినములు ధనమునకును శరీరప్రయాసమునకును వెనుదీయక నిరంతరముచేయు కృషివలనఁ గట్టకడపట నాతఁడు విజయమును గాంచెను. కోరినకోరిక లన్నియును కొనసాగుకాలము వచ్చినది. ఈకుమ్మర వ్యాపార మభివృద్ధి పొందించుటయందే యభిలాష కలవాఁడై యుండుటవలన నొకక్షణ మైనను వ్యర్థముగాఁ బోనీయక నిరంతరముఁ బాటుపడి తెల్లజాతి పింగాణి పాత్రములను మీఁగడరంగు పింగాణి పాత్రములను జేయఁగలిగి యున్నతస్థితికిఁ దీసికొనివచ్చి యింగ్లాండు

దేశమున నీవ్యాపారము మిక్కిలి విలువగలిగినట్టిదిగాఁ జేసి యింగ్లీషు పింగాణి పాత్రములకు ప్రాశస్త్యమును దెచ్చెను.

కపటవేషధారిగాక నిజమయిన సచ్చింతతోడఁ పాటుపడి పనిచేయు చున్నవాఁడు గావున లౌక్యాధికారు ధూర్వహు లయిన గృహస్థు లనేకు లీతనికి తోఁడు చూపియుండిరి. గర్వితుఁడు గాక తనతోఁడి పనివాండ్రను గూడ నీతఁడు ప్రోత్సాహ పఱచుచుండెను. చార్లట్ రాణిగారికి పింగాణిపాత్రములను జేసి మెచ్చుకొనఁబడి రాజకుటుంబమునకుఁ గుమ్మరవాఁడుగా నేర్పఱుపఁ బడెను. మాదిరివస్తువులు చేయుటకుఁగాను విలువఁగలిగిన పింగాణివస్తువు లీతని పరము చేయఁబడుచుండఁగా నట్టివానిఁ బోలువస్తువులను దిరుగఁ జేసి వింతగా నగరి కప్పగించుచుండెను. ఎవ్వ రెట్టివస్తువును దెచ్చి చూపించినను నావస్తువు మాదిరి మరల వస్తువును జేసి యిచ్చుచుండెను.

“బార్బెరినివేజ్” అను వస్తువు (Barberini Vase) విక్రయమునకు రాఁగా వెడ్జివూడ్డు 1700ల గిన్నీలకు బేరముచేయఁగా పోర్టులాండు రాణి 1800 గిన్నీ లిచ్చికొనెను. వెడ్జివూడ్డుయొక్క యభిప్రాయ మామె తెలిసి కొన్నప్పు డామె యావస్తువు నాతని కెరవిచ్చెను. ఆతఁ డట్టిమాదిరి వస్తువుల నేఁబదింటిని చేసెను గాని 2,700ల పౌనులు వ్యయపెట్టవలసి వచ్చెను. వాని విక్రయమువలన వ్యయ మయినసొమ్మును మాత్రమె రాఁబట్టుకొనఁగలిగి లాభము పొందకపోయినను తలఁచిన తలంపు కొనసాగించుకొనఁగలిగెను. చిత్రము లయిన యాకారములుగల పాత్రములను జేయుట “ఫ్లాక్సుమాను” అనువాని యొద్ద నేర్చుకొని వానికి పింగాణిపూఁత వేయుచు వానిపైని సొగసయిన చిత్తరువును వ్రాయుచు నావస్తువులను మిగుల విలువగల వానినిగాఁ జేసి విక్రయించి యమితలాభమును పొందుచుండెను.

ఈతఁ డీవ్యాపారమును గుఱించి బహుగ్రంథములను వ్రాసెను. దేశోప కారకరము లగు పను లనేకములఁ గావించెను. శిల్పివ్యాపార కౌశలమును దేట

పఱచు నొకగొప్ప కాలువను త్రవ్వించెను. దేశమున మంచిబాటలు వేయించెను. పింగాణివ్యాపారమును పెంపుచేసెను. తన కాలమున నీవ్యాపారమువలన నెను వదివేల జనులు బ్రదుకునట్లు చేసెను. 1852 వ సంవత్సరములో దేశమున నుప యోగించునవి గాక యితర దేశములకు నెగుమతి చేయఁబడిన యీపింగాణి సామాను లెనిమిదికోట్ల నలువదిలక్ష లుండెను. వెడ్జివుడ్డు ఈపని ప్రారంభించు టకు పూర్వము దేశ మనాగరిక దశలో నుండి ప్రజలు మిక్కిలి దరిద్రులుగా నుండిరి. అట్టిదేశమున జనాభివృద్ధి మూడింతలు పెఱిగి యందఱకును పనిపా టులు గలుగునట్టి స్థితిలోనికిఁ దెచ్చి మిక్కిలి పేరుపొందెను. యుద్ధములందు నిర్వక్రపరాక్రమమును జూపి యజేయులై పేరుపొందిన వీరభటులకంటె నిరంతరము దుర్భర దారిద్ర్యముతోను కష్టపరంపరలతోను బెనఁగులాడుచు లోకమునకు మహోపకారము లయిన పనులను జేసినట్టి యీకుమ్మరులవంటి వీర భటు లెవ్విధముగాను దక్కువవా రని తలంపరాదు.

—∞∞—

# అయిదవ ప్రకరణము.

---

## ప్రయోగము—పట్టుదల.

ఏకార్యము సాధించుటకునైనను నిరంతరప్రయోగమును పట్టుదలయు నావశ్యకము అని లోకములోని ప్రసిద్ధపూరుషుల చారిత్రములను జదివినప్పుడు మనకుఁ దేటపడఁగలదు. ప్రతిదినము తన కుండు బాధ్యతలతోను ధర్మములతోను సామాన్యజీవితమె మనకు విశేష లోకానుభవమును గడియింప నవకాశ మిచ్చుచున్నయది. అది త్రొక్కాడు త్రోవలె నిజమైన పనివానికి నాత్మాభివృద్ధిఁ గలిగించుకొనుటకుఁ గావలసినంత సావకాశము నిచ్చుచున్నయది. ఎవరు విడువని పట్టుదలతో మనఃపూర్వకముగాఁ బాటుపడు చుందురో వారు సాధారణముగాఁ గారణసాఫల్యమును గాంచుచుందురు. భాగ్యము అంధ మని తఱచుగా దూషింపఁ బడుచున్నది గాని మనుష్యులవలె నంత గ్రుడ్డిది గాదు. వాయువులును తరంగములును ప్రసిద్ధనౌకాయాత్రికుల ప్రక్కనే యుండినట్లుగాఁ బాటుపడువారి ప్రక్కనే భాగ్యముండఁగల దని మన ప్రతిదినానుభవమే వేనోళ్ళఁ జాటి చెప్పుచున్నది. సామాన్యజ్ఞానము, శ్రద్ధ, నిరంతర ప్రయోగము, పట్టుదల మొదలగు సుగుణము లున్నయెడల నవియె సమస్తకార్యములను సాధింపఁగలవు. ప్రపంచములో సామాన్యులే, యోగ్యతచేతను పట్టుదలచేతను మహాకార్యములను సాధించి విజయమును పొందుచుండుటవలన గొప్పవారనేకులు కేవలము మేధాశక్తియం దెంతమాత్రము నమ్మికలేనివారుగా నున్నారు. కొందఱు మేధ యనఁగా సామాన్యజ్ఞానము హెచ్చు పొందుటయే యని యొక యర్థము చెప్పియున్నారు. ఓర్మి మేధ యనియొక బుద్ధిమంతుఁడు చెప్పియున్నాఁడు.

న్యూటను శాస్త్రజ్ఞునియొక్క మనస్సు మిక్కిలి యుత్కృష్టమైనది. అతఁడు కనిపెట్టిన మహద్విషయముల కొఱకు నే సాధనముల నుపయోగించి పనిచేసె నని యడుగఁబడినపుడు "నిరంతరము వానిని గుఱించి యోచించుచుండుటవలననే" యని నమ్రతతో నాతఁడు ప్రత్యుత్తర మిచ్చెనఁట ! మఱియొకప్పుడు తాను నేర్చిన విధము నీరీతిగాఁ జెప్పెనఁట ! "దేనిని గుఱించి నేను తెలిసికొనఁ గోరితినో యావిషయమును నిరంతరము మనస్సునం దుంచుకొని కొద్దికొద్దిగాఁ దెలియుట ప్రారంభించినది మొదలుకొని పూర్ణముగా నవగాహమగునవఱకును వేచియుండుట వలననే" యని చెప్పెను. ఒక విషయమును గుఱించి పూర్ణముగాఁ దెలిసికొన్న తరువాతనే రెండవవిషయమునకుఁ బోవుచు వచ్చెనఁట. "నేను లోకమున కేదైన యుపకృతి సలిపిన యెడల నది పాటువలనను శాంతముతోఁ గూడిన యాలోచనమువలనను నైనది గాని యన్యము వలన నయినదికాదని డాక్టరు బెంట్లీ చెప్పెను. ఆప్రకారముగానే కెప్లరను మఱియొక తత్త్వశాస్త్రజ్ఞుఁడు తన యభివృద్ధిని గుఱించి తెలిపియుండెను. పాటువలనను పట్టుదలవలనను నత్యద్భుతము లయినకార్యములను సాధింపఁగలమని యొప్పుకొన్నను లోకమునం దధిక మేధాశక్తి సంపన్నత గలవారని పేర్కొనఁబడెడు వారెల్లరును పట్టు వదలని పనివాండ్రుగా నున్నారు. కార్యాచరణాశక్తి గల హృదయమును మేధయును లేకుండిన యెడల నెంత జాగ్రత్తగల యోపికతోఁ బ్రయత్నించి పాటుపడినను షేక్స్పియరు, న్యూటను, బీతోవెన్, మైకేయల్ ఏంగిలో వంటివారుగా నుండుట యసంభవము గదా ?

రసాయనశాస్త్రజ్ఞుఁ డగుడాక్టరు తాను నెఱవేర్పఁ గలిగిన దంతయును పాటువలననే యని తెలిపి "అధిక మేధాశక్తి గలవాఁ" డని తనయెడఁ బ్రజలకుఁ గల యభిప్రాయమును నిరాకరించెను. "నామనస్సు తేనెపెట్టెవంటిది; కాని ఝుంకారముతోఁ గూడి చిందఱవందఱగా నుండియున్నది ; అయినను క్రమమును వరుసయు దప్పనిదిగాకున్నది; ఎడతెగని పాటుతోఁ బ్రకృతియొక్క

ప్రశస్తమైన పదార్థసంచయమునుండి యాహారమును సేకరించినయది" అని జాన్ హంటరను వాఁడు తన్ను గురించి చెప్పుకొనెను. నూత్నవస్తుకల్పనకారులయొక్క జీవచారిత్రములను జదివితిమేని మహాకార్యములను సాధింపఁ గలిగిన విధమంతయును వారొనర్చిన యెడతెగని పాటులో నున్నదని మనకు బోధపడఁగలదు. వారెల్లరును సమస్తవస్తువులను బంగారముగా మార్చినవారు. వేయేల ? కాలమునే వారు బంగారముగాఁ జూచినారు. "ఏవిషయమున నీవు విజయమును గోరుదువో యావిషయమును గురించిన జ్ఞానమును ముందు పూర్ణముగా గ్రహింపుము. అట్టిజ్ఞానము నిరంతరకృషివలన సంప్రాప్తమగును. ఇదియే జీవితముయొక్క విజయమునకు రహస్యకారణము." అని డిస్రాయలీ యను గొప్పవాఁడు చెప్పెను. కాఁబట్టి ప్రపంచమును నడిపింపఁ గలిగిన వారు విశేష మేధావంతులు గాకపోయినను వేఱువిధములయిన శక్తిసామర్థ్యములు గలవారుగాను విడువని పట్టుదలగలవారుగాను నుండిరి. నిరంతరకృషి లేని తెలివిగల వానికంటె మందమతు లయినను జాగరూకత గలిగి పాటుపడుచుండువారు విజయమును గాంచుదు రనుట నిస్సంశయము. నెమ్మదిగ నడుచువారె యెక్కువదూరము పోఁగలుగుదురు.

కాబట్టి దేనికైనను మొదట పరిశ్రమ ముండవలయును. యథార్థజ్ఞానముఁబడయవలెను. నిరంతరకృషి చేయుచుండవలెను. అప్పుడు పందెమును సులభముగాఁ గెలువవచ్చును. చేసినదే చేయుచుండవలెను. పాటుపడిన కొలఁది సులువగుచుండును అది లేనిదే యేచిన్నపనియును సాధింపఁగారాదు.

చిన్ననాఁటనుండి క్రమశిక్ష గలిగి ప్రఖ్యాతగుణములఁ గొన్నిఁటి నలవఱచుకొనుటవలననే సర్ రాబర్టుపీల్ బ్రిటీషుశిష్టసభలో నొక యలంకారముగా నుండి ప్రఖ్యాతుఁడయ్యెను. రాబర్టు బాలుఁడుగా నుండినప్పుడె యాతని తండ్రి అయత్నపూర్వకముగాఁ దన కుమారుఁ డుపన్యసించునటుల నభ్యాసపఱచుచువచ్చెను. భానువారమునాఁటి మతోపన్యాసమును జ్ఞాపకమున్నంత

పలుకు వల్లించునటులం జేసెను. ఇటులఁ గొంచెము కొంచెముగా విజయమును గాంచుచు నానాఁటికి నిరంతరకృషిమూలమున నాయుపన్యాసమంతయు నవలీలగా నోటితో బిగ్గఱగా నుపన్యసింపసాగెను. ఈయభ్యాసమువలన నీతఁడు తరువాత జనప్రతినిధి మహాసభలోఁ బ్రతిపక్షవాదముల ఖండించు నపుడసమానమైన వాచాపటుత్వమునుఁ జూపి ప్రసంగించుటకు సమర్థుఁడయ్యెను.

మొట్టమొదట వీణె వాయించుట మిక్కిలి సులువుగాఁ గానిపించును. కాని యెంతకాల మభ్యసించిన నది సాధ్యపడునో యూహింపుఁడు. ఒకపడుచువాఁ డది యెంతకాలమునకు సాధ్యపడు నని 'జియార్డిని' యనునాతని యడిగినపుడు "దినమునకుఁ బండ్రెండు గంటల చొప్పున నిరువది సంవత్సరములు నేర్చుకొనిన సాధ్యపడు" నని ప్రత్యుత్తర మిచ్చెనఁట.

శాశ్వతాభివృద్ధి యెప్పుడును నెమ్మదిగాఁ గలుగుచుండును. గొప్ప ఫలితములు క్షణమాత్రములో సంభవించునవి కావు. పంటపండించుటకు ముందు పొలము దున్నవలెను. తఱుచుగా దీర్ఘకాలము వేచియుండవలెను. ఈ లోపల ఫలితము కొఱకు నోపికతోఁ జూచుచు తృప్తి నొందియుండవలెను. మంచిఫల మెప్పు డాలస్యముగ లభించును.

అయినను నోర్పుతో వేచియుండుటకు మనుష్యు లుత్సాహముతోఁ బని చేయుచుండవలెను. ఉత్సాహము పనిచేయుటకుఁ బురిగొల్పునట్టి మంచి గుణముగా నున్నది. అయ్యది యోగ్యతను విస్తరింపఁ జేయును. అనుభవజ్ఞానమునకు నుత్సాహమును ప్రయత్నమును పదింట తొమ్మిదిపాళ్లుగా నున్నవి. కార్యసాఫల్యమునకును సౌఖ్యమునకు నియ్యవి ప్రధానములు. మనః పూర్వకమైన నిరంతరకృషియె జీవితమున కెక్కువ సంతోషమును గలిగించునది. ప్రతి సద్గుణమును దానితో సంబంధించి యుండును.

ముఖ్యముగా లోకోపకారముకొఱకు పాటుపడువారు సద్యఃఫలితములఁ గాశింపక దీర్ఘకాలము పాటుపడవలసినవారయి యుందురు. కొన్ని వేళల

నాటఁబడిన విత్తనములు చిరకాలపు మంచుక్రింద నణఁగియుండి తొలకరించిన తరువాత మొలక లెత్తుటకుఁ బూర్వమే కర్షకుఁడు శాశ్వత విశ్రాంతిని పొంద వచ్చును. గోలాండుహిల్లు వలెనే ప్రతి దేశోపకారియుఁ దన జీవితకాలము లోఁ దన యుద్దేశము నెఱవేఱి ఫలితమును గలిగించుటను జూడఁజాలక పోవచ్చును.

మనుష్యునికిఁ గలవిశ్వాసము చెడినప్పుడు ప్రతిఫలమిచ్చునది యేదియు లేదు. అది వానియొక్క స్వాభావికగుణమును మార్చివేయును. "నాకుఁ గల నమ్మిక చెడినప్పుడు నేనెట్లు పని చేయఁగలను ? నేనెట్లు సుఖ మనుభవింపఁ గలను?" అని యొకమహాదౌర్భాగ్యుఁడయిన చింతకుఁడు పలికెను. నమ్మికఁ గలిగి పాటుపడినవారిలో మతబోధకుఁడయిన క్యారేయనువాఁడు మిక్కిలి యుత్సాహమును ధైర్యమును గలవాఁడుగా నుండెను. ఇండియాలో నున్నప్పుడు తనయొద్ద లేకరులుగానున్న ముగ్గురు పండితులకు విశ్రాంతి కలుగఁజేయుట కొకదినమందే యొకరి తరువాత నొకరి పని తాను దైకొని చేయుచుండుటయె తనకు విశ్రాంతియని భావించుచు నచ్చటఁ బలుమాఱు జరుగుచు వచ్చెను. చెప్పులు కుట్టువాని కుమారుఁడైన యీక్యారే తన కృషియందు నొకవడ్రంగి కుమారుడైనవార్డు వలనను నేతగాని కుమారుఁడైనమార్షుమనవలనను సాహాయ్యము చేయఁ బడుచుండెను. వారల కృషిమూలమున శ్రీరామపురమునందు (Serampur)నొక సొగసయిన కాలేజి కట్టఁబడినది. పదునాఱు నకాముతేర్పా టు చేయఁబడినవి. బైబిలను క్రైస్తవ మతగ్రంథము పదునాఱు భాషలలోనికి భాషాంతరీకరింపఁబడినది. బ్రిటీషు ఇండియాలో క్రైస్తవమతబీజములు వెదచల్లఁబడెను. కులము తక్కువవాఁడనని క్యారే యెన్నఁడును సిగ్గుపడియుండ లేదు. ఒకప్పుడు రాజప్రతినిధిగారి సభలోఁ గూరుచుండి నప్పుడు క్యారే కెదుటనున్న మఱియొక దొరగారు బిగ్గఱగా "క్యారే యొకప్పుడు చెప్పులు కుట్టువాఁడుగా నుండలేదా యని మఱియొకని నడిగెనఁట. అదివిని "కాదయ్యా మాదిగవాఁడ" నని క్యారే వెంటనె ప్రత్యుత్తర మిచ్చెనఁట!

క్యారేయొక్క పట్టుదలను గూర్చిన యాతని చిన్ననాఁటికథయొక్కటి కలదు. ఒకనాఁ డతఁ డొకచెట్టెక్కుచుండఁగాఁ గాలుజారి క్రిందఁ బడి నందువలనఁ గాలువిఱిగెను. కొన్నివారములు మంచ మెక్కి కాలు బాగు పడిన తరువాత మొదట చేసినపని యేమనఁగా మరలఁ బోయి యాచెట్టు మీఁది కెక్కెను. ఇటువంటి ధైర్యము నాతఁడు కలిగియుండుటచేతనే తన జీవితము మతబోధనకై వినియోగించి దృఢనిశ్చయముతోఁ బనిచేసెను.

"ఇతరుఁడు చేసినదాని నేమనుజుఁ డయినను జేయఁగలఁడ"ని త్రిత్వ వేత్తయైనడాక్టరు ఎంగు నమ్మియుండెను. ఈతని గుఱించి యొకచిత్రమైన సంగతి చెప్పఁబడినది. ఈతఁడు మొదటసారి గుఱ్ఱము నెక్కినప్పుడు పందెము లం దాఱితేఱిన రౌతుతోఁ గూడనుండెను. గుఱ్ఱపుసవారు చేయునప్పు డా పందెగాఁడు వీనిని మించిపోయి గుఱ్ఱము తోడగూడ నొకకంచెను దాఁటెను. వాని ననుకరించిపోయి తానుగూడ దాఁటవలెనని ప్రయత్నించి యాప్రయత్నములో గుఱ్ఱము నెక్కి రెండవతూరి మరల దాఁటుటకుఁ బ్రయత్నించియుఁ బరాభవము నొంది క్రిందఁ బడలేదు గాని గుఱ్ఱము మెడ మీఁదఁ బడి గట్టిగాఁ బట్టుకొనెను. మూఁడవసారి చేసిన ప్రయత్నములోఁ గృతార్థుఁ డయ్యెను.

అదుబాన్ అను నమెరికాఖండవాసి యొకఁడు పక్షిశాస్త్రము వ్రాయవలెనని బహుకాలము కష్టపడి యరణ్యములకుఁ బోయి శోధనలు గావించి కొంతగ్రంథమును వ్రాసి యొక కొయ్యపెట్టెలోఁ బెట్టి యొక స్నేహితునికి నొప్పగించి యదివఱకు తాను నివసించియున్న కెంటకీమండలములోని హెండర్సను గ్రామమును విడిచి ఫిలాడెల్ఫియా నగరమునకు వచ్చెను. కొన్ని నెలలు గడచిన తరువాత నాతఁడు తాను పెట్టె దాచనిచ్చిన మిత్రుని కడకుఁ బోయి పెట్టె నడిగిపుచ్చుకొని చూచునప్పటికి నెలుకలు చేరి తినఁగా మిగిలిన చిత్తు కొంతయును మూషకసంతానము కొంతయును బయలుదేఱెను. ఇంక నాతని మన స్సెట్లుండునో చెప్పవలెనా? ఆతఁ డెంతయేడ్చినను ప్రయోజనము లేదని

దుఃఖమును మాన్పుకొని మున్నటికన్న బాగుగా వ్రాయవచ్చునని దృఢమన
స్కుండై తుపాకియును కాగితపుఁ గొత్తమును సీసపుం బిల్లలును గైకొని
సంతోషముతో మరల నరణ్యములకుఁ బోయి మూఁడు సంవత్సరములు నివసించి
పక్షిశాస్త్రమును వ్రాసి లోకమునకు మహోపకారి యయ్యెను. చిరకాలము
గణితము చేసిచేసి నిలువచేసికొని యుంచిన కాగితములను సర్ ఇసాకు న్యూ
టను బల్లమీఁద నెట్టియుండఁగా నాతఁడు పెంచుచున్న డైమండనుకుక్క
పిల్ల వెలుఁగుచున్న దీపపువత్తిని తలక్రిందు చేసెను. అందువలనఁ గాకితము
లన్నియు భస్మమయ్యెను. అప్పు డాతనికిఁ గలిగిన మనోవ్యథ యాతని యా
రోగ్యమును జెఱుపుటయే గాక మేధాశక్తినిఁ గూడ క్షీణింపఁజేసెను. పట్టు
దల గలిగియున్న వారి కెన్నియంతరాయములు ఘటిల్లించి కార్యవిఘాతము
చేయుచున్నను వారి మనస్సు లెప్పుడు కార్యము సాధించువఱకును దృఢము
లై యుండుననుట కీక్రింది వృత్తాంతమె చాలియుండును.

థామస్ కార్లయిలు "ఫ్రెంచిరివల్యూషన" ను సంపుటము నచ్చుపడని
దాని భాషాపరిచయము గలిగిన యొకమిత్రునికిఁ జదువనిచ్చెను. ఆమిత్రుఁ
డాగ్రంథమును జదివి దానిని గ్రంథకర్త కీయక క్రింద నెక్కడనో పడవైచి
యాసంగతి మఱచి పోయెను. ఆగ్రంథమును ముద్రితము చేయఁ దలఁచి గ్రం
థమునకై కార్లయిలు వర్తమానము పంపినపు డామిత్రుఁడు "తన వంటకత్తె
వానిని పనికిమాలిన చిత్తుకాగితముల కట్టయని వంటకట్టియలకు బదులుగా
నుపయోగించి తగులఁబెట్టె" నని ప్రత్యుత్తర మిచ్చెనఁట! అప్పు డాతని హృ
దయ మెంతపరితపించెనో వేఱుగఁ జెప్పవలయునా? అతఁడు తిరిగి వ్రాసికొన
వలయునే గాని యెంతవిచారించినను ప్రయోజనము లేదుగదా! ఆగ్రంథము
వ్రాయఁబడి చాలకాలము జరిగెను. చిత్తుప్రతియు లేదు. ఆగ్రంథములోని
సంగతుల నన్నిటిని జ్ఞప్తికిఁ దెచ్చుకొని వ్రాయవలయును. మొదటిసారి
వ్రాయుట సంతోషకరముగా నుండెను. రెండవసారి వ్రాయుట మిక్కిలి

దుఃఖమును బాధను కలిగించునదిగా నుండెను. ఏది యెట్లు లయినను శ్రమపడి పట్టుదలతో నధికప్రయత్నము పూఁడ సాధించి గ్రంథమును సమాప్తి నొందించి జయమును గాంచెను.

తాళిమి గలిగియుండుటయే బుద్ధికుశలత యనిచెప్పిన కోమ్టి డే బఫ్ఫాను చరిత్రము ప్రఖ్యాతమైనది. జీవకోటివర్ణనమునం దెట్టిమేధాశక్తి నుపయోగించి మహద్విషయములను దెలిసికొనఁ గలిగినను బఫ్ఫాను పడుచువాఁడుగా నుండి నప్పుడు సామాన్యబుద్ధిగలవాఁడుగానె పరిగణింపఁబడెను. మందబుద్ధికలవాఁడు మాత్రమేగాక సోమరిగాఁ గూడ నుండెను. భాగ్యవంతమగు కుటుంబమున జనించినవాఁ డగుటచేత నిరంతరము విశేషసుఖాసక్తుఁడై యుండునని యూహింపవచ్చును. అట్లుండుటకు బదులుగా నాతఁడు మొదటినుండి సుఖాపేక్షను వదలి యాత్మశిక్షయందును గ్రంథపఠనమునందును కాలము వినియోగించుచు వచ్చెను. ఆతఁడు కాలమును పరిమితిగల భాగ్యమునుగాఁ దలంచి ప్రాతఃకాలమునఁ బెందలకడఁ బాన్పుపైనుండి నిద్ర విడిచి లేవకుండుటవలనఁ బెక్కుగంటల కాలము వ్యర్థ మగుచున్నదని తలపోసి యట్టిదుస్స్వభావమును మాన్పుకొనుటకు స్థిరచిత్తుఁ డయ్యెను. కొంతకాల మాదుస్స్వభావముతోఁ బెనఁగులాడియు విజయమును గాంచ శక్తుఁడు గాకపోయెను. ఈదురభ్యాసము నుండి విముక్తి నొందుటకు మార్గము గానక తుదకు తనయొద్ద నౌకరుగానున్న యోసేపును బిలిచి యాఱుగంటలు వేయుటకు ముందు నిద్రనుండి తన్ను మేల్కొలుపఁ గలిగిన యెడల నాతనికి నైదు షిల్లింగులు బహుమానము చేయుదునని వాగ్దత్తము చేసెను. యజమాని యాజ్ఞప్రకారము మేల్కొలుప నౌకరువచ్చినపుడు బఫ్ఫాను జబ్బుగా నున్నదని యొకమాఱు నిద్రాభంగము కలిగించుచున్నవాఁ డని కోపమును జూపుచు వేఱొకమాఱు నీరీతిగా సాకువలు చెప్పుచువచ్చెను. నిద్రనుండి తనంతటతాను లేచినపుడు తనయాజ్ఞ యేల నెఱవేర్ప లేదని నౌకరును చీవాట్లు పెట్టుచుండెను. బహుమానముఁ బడయుటకుఁ

గృహనిశ్చయుఁడయి యాతఁడు ప్రతిమాటికిని రాకెటినుండి తొలఁగించెను. అని భయపెట్టినను వెనుదీయక నిద్రనుండి లెమ్మని నిర్బంధపెట్టుచువచ్చెను.

ఒకనాఁటి యుదయకాలమున మిక్కిలి మొండితనమును జూపి లేవకుండినప్పుడు నౌకరుకూడ మొండితనమునే చూపఁదలఁచి యొకగిన్నెడు సంచునీళ్లు గొనివచ్చి యాతని ప్రక్కక్రిందను బోసి బట్ట లన్నియుఁ దడిపివేసెను. ఈరీతి మోటుపనులు చేయుచు రాఁగా రాఁగా దుదకు నాతఁడ భ్యాసమును వదలిపెట్టఁగలిగెను. ఈనౌకరు మూలముననే తన గ్రంథములో మూఁడు నాలుగు సంపుటములు ముగింపఁగలిగితినని చెప్పుచుండెడివాఁడు.

బహ్వాను నలువది సంవత్సరముల వఱకు నుదయమున ప్రాతఃకల్లకడఁ గూరుచుండి తొమ్మిదిగంటలు మొదలుకొని రెండుగంటలు వేయువఱకును సాయంకాల మైదుగంటలు వేసినది మొదలుకొని రాత్రి తొమ్మిదిగంటల వఱకును పనిచేయుచువచ్చెను. నిరంతరము కృషిచేయుటవలననే యాతనికది స్వాభావిక ధర్మమైనది. అతఁడు మనస్సాక్షి కడుగు దాఁటని పనివాఁడుగా నుండెను. తాను వ్రాసినదానిని మరల మరలఁ జదువుచుండు స్వభావముగలవాఁ డగుటచేత నాతని శైలి పరిపక్వదశకు వచ్చినది.

ఏఁబది సంవత్సరము లాలోచించి యాతఁ డొక గ్రంథమును రచియించి తన మనస్సునకుఁ దృప్తి కలుగుటకు దానినే పదునొకండు మాఱులు వ్రాసెను. ఈతఁడు ప్రతివస్తువును క్రమస్థితియందుంచు పనివాఁడు. ఈతఁడు బహుకాలము కష్టపడి పాటుపడుటచేతనే గ్రంథకర్తగాఁ బ్రఖ్యాతిఁ గాంచెను. మానవదేహమునకు సహజమయిన యొకవ్యాధివలన మిక్కిలి పీడింపఁబడుచుండియు మహాగ్రంథముల ననేకములను రచియింపఁగలిగెను.

భాషావిషయమునఁ గృషిచేసినవారిలో నిట్టిపట్టుదలగల వారనేకులున్నారు. ఈవిషయమున సర్ వాల్టరుస్కాటుయొక్క చరిత్రముకూడ మనకు విశేషధర్మములను బోధింపఁగలదు. ఈతఁడు మొదట నొకలండను

లాయరుగారివద్ద లేకరిగానుండి నకళ్ళు వ్రాయుచుండుటచేత నోపికయు స్థిరచిత్తతయు మొదలగు సుగుణములు పట్టు పడినవి. పగటికాలమంతయు నిట్టి బండపని చేయుటచేత రాత్రికాల మీతనికి సంతోషకరముగా నుండెను. కావున నాకాలమునందు గ్రంథపఠనము చేయుచుండెను. వేఱు ప్రతి వ్రాయుటకు పేజీకి మూడు పెన్సులవంతున నీయఁబడినపుడు కొన్ని వేళలయందు నిరువదినాలుగు గంటలలో నూటయిరువది పత్రములు వ్రాసి ముప్పది షిల్లింగులు గడించి యాసొమ్ములోనుండి యొక క్రొత్తగ్రంథమును గొనుచువచ్చెను. ఎడింబర్గు సెషన్ కోర్టులో లేకరిగాఁ బ్రవేశించిన తరువాత ప్రాతఃకాల భోజనమునకు ముందు గ్రంథములను వ్రాయుచుఁ బగలంతయు నుద్యోగపు సంబంధమయిన వ్యవహారములను జరుపుకొనుచుండెను. మొత్తముమీఁద సంవత్సరములో సగముకాలము వృత్తి సంబంధమైన పనుల కొఱకు వినియోగించెనని లాకుహార్టు స్కాటును గుఱించి చెప్పియుండెను. తానవలంబించిన వృత్తివలనఁ బొట్టపోసికొనఁ దలంచెనుగాని గ్రంథములవలన జీవింపఁ దలఁచుకొనలేదు. ఏపని యేకాలమునకుఁ జేయ నిశ్చయించెనో యాకాలమునకు సరిగా నాపని జరుపుట కభ్యాసపడినందువలననే యాతఁడు బహుగ్రంథములను వ్రాయ సమర్థుఁడయ్యెను. సాధారణముగా నేదినమున వచ్చుజాబుల కాదినమే జవాబు వ్రాయ నిశ్చయించుకొని యాప్రకారము జరుపుచుండెను. ఈతఁడు ప్రతిదినము నైదుగంటలు వేసిన తరువాత నిద్రనుండి లేచి దీపము వెలిగించుకొని నిత్యకృత్యములు దీర్చుకొని కాగితములు మొదలగునవి వ్రాఁతపెట్టె మీఁద బెట్టుకొని యాఱు గంటలు వేయునప్పటికి వ్రాఁత పెట్టెకడఁ గూరుచుండును. కావలసిన గ్రంథములు తనచుట్టు నుంచుకొనును. ఆతఁడు ప్రేమించిన కుక్క మాత్రము గ్రంథముల కావలఁ బరుండి చూచుచుండును. తన కుటుంబములోనివా రెల్లరును తొమ్మిది పది గంటలకు మధ్య ప్రాతఃకాల భోజనమునకు లేచినపుడు తానుగూడ వ్రాఁతను మాని భోజనమునకు లేచును.

# ఆఱవ ప్రకరణము.

---

రెండవతరగతి గ్రంథకారులయొక్క జీవితములుగూడ మనకు పట్టుదలను గూర్చిన దృష్టాంతములను పెక్కింటిని దెలుపుచున్నవి. శిల్పశాస్త్ర సంబంధము లయినగ్రంథము లనేకములను రచించి ప్రసిద్ధికెక్కిన జాన్ బ్రిటను విల్టుషైరు మండలములోని కింగ్స్టను గ్రామమున నిర్భాగ్య స్థితియందున్న యొక గోడిసెయందు జనించినవాఁడే. వీనితండ్రి రొట్టెలు చేయువాఁడుగాను పడిబియ్యము చేయువాఁడుగాను నుండెను. బ్రిటను శిశువుగా నుండు కాలమునందే వీనికి వర్తకములో దండుగ వచ్చి యందుమూలమునఁ బిచ్చి పట్టెను. అనాదరణముగా నీబాలునకుఁ బాఠశాలలో విద్యాభ్యాసము చేయునంతటి యదృష్టము పట్టినది గాదు. తండ్రియొక్క సంరక్షణము తప్పి పోయినందున నీ కుఱ్ఱవాఁడు బాల్యమునుండి పాటుపడవలసి వచ్చి పినతండ్రి సారాదుకాణము పెట్టుకొని యుండ నాతనికడఁ జేరి సీసాలలో సారాయి పోయుచు బిరడాలు వేయుచు సారాయి తిత్తులమూతులు బిగించుచు నయిదు సంవత్సరము లావృత్తియందే కాలము గడపెను. ఈపనిలో నున్న కాలమున వాని యారోగ్యము చెడుటవలన నయిదు సంవత్సరములు పని చేయించుకొనియుఁ రెండు గిన్నీలు (42 షిల్లింగులు) చేతిలోఁ బెట్టి ప్రపంచములోఁ బ్రతుకుమని వాని పినతండ్రి మెల్లగ నావలకు సాగనంపెను.

తరువాత బ్రిటను దిక్కులేనివాఁ డయి యందందుఁ దిరుగుచు ననేక వృత్తుల నవలంబించి యొందును స్థిరచిత్తుఁడై నిలువఁబడక వివిధ కష్టములకు లోనై యేడేండ్లు గడపెను. అయిన నట్టి నిర్భాగ్య స్థితియందుండియు వారమునకుఁ బదునెనిమిది పెన్నీలు సంపాదించుచు దీపము పెట్టుకొనుటకు డబ్బు

లేక శీతకాలపు సంధ్యలయందు మంచముపైఁ బరుండియే పాఠములఁ జదువు-
కొంటిని అని యాతఁడు తన జీవచారిత్రమునందు వ్రాసికొని యున్నాఁడు.
ద్రాక్షాపట్టణమునకు కాలినడకను బోయి సెలమాళిగవాఁడుగ (Cellarman
నుండియు నందుండలేక కుడువఁ గూడును, కట్టుకొనఁ గుడ్డయును, చేతి
దమ్మిడియును లేక లండను నగరమునకు మరలి వచ్చెను. తుదకు లండను
సారాయికొట్టములో సెలమాళిగవాఁడుగా జీతమునకుఁ గుదిరి ప్రాతఃకాల
మేడు గంటలు మొదలుకొని రాత్రి పదునొకండు గంటలు వేయువఱకు
సాలెలలోనే యుండి పనిచేయుచుండెను. ఇట్లు చీఁకటిలో నెంత కాలము
కష్టసాధ్యమయిన యిట్టిపని చేయుచుండుటవలన నాతని యారోగ్యము చెడి
పోయెను. అనంతర మాతఁ డాపనిని మానుకొని అదివఱకు చక్కఁగా వ్రాయ
నేర్చుకొని యున్నవాఁడు గావున నొక వకీలు నొద్ద వారమునకుఁ బదునైదు
షిల్లింగులు జీత మిచ్చుపద్ధతిని లేకరిగాఁ గుదిరెను. ఈ యుద్యోగములో
నున్నకాలమునఁ దీఱిక గలిగినప్పు డెల్లను పుస్తకములను విక్రయించు నంగ
ళ్ళకుఁ బోయి పొత్తములను గొనుటకు సొమ్ములేక యా పొత్తములను నిలువ
వేయుచు నందందుఁ జదువుచుఁ గొంచెము కొంచెముగా జ్ఞానాభివృద్ధిఁ జేసి
కొనుచు వచ్చెను. తరువాత నిరువది షిల్లింగుల పనిమీఁద మఱియొకరి యొద్దఁ
బ్రవేశించి యారీతినే విద్యాభ్యాసము చేయుచుండెను. ఇరువది యెనిమిది
సంవత్సరములు వచ్చిన తరువాత నొక గ్రంథమును వ్రాయునంతటి శక్తిగల
వాఁ డయ్యెను. అప్పు డతఁడు 'పిజార్రో' యనువాని 'సాహసకృత్యము'
లను గ్రంథమును వ్రాసెను. అదిమొదలుకొని ప్రతిసంవత్సరము కొనఁగా నించు
మించుగా నేఁబదియైదు వత్సరములు వచ్చువఱకు నెనుబదియేఁడు గ్రంథము
లను వ్రాసి ప్రకటించి కీర్తిఁ గాంచెను. అట్టి గ్రంథములలో నెల్ల నుత్తమ
మయినదియు ఘనమైనదియు నగు నింగ్లాండుదేశపు "పురాతనదేవాలయ చరి
త్రము" పదునాలుగు సంపుటములుగల గ్రంథమై యుండెను. అట్టి యుత్కృ

స్త్రగ్రంథమే జాన్ బ్రిటనుయొక్క యెడతెగని పాటులని ఫలితమును వేనోళ్లఁ జాటుచున్నయది. అదృష్ట మనఁ బాటుకన్న నింక వేఱ యుండునన్న సిద్ధాంతమును జాన్ బ్రిటనువంటివారలు నమ్ముదురని యనుకొనఁజాలము గదా!

లౌడను తోఁటమాలిగూడ జాన్ బ్రిటను యోగ్యతను బోలిన యోగ్యత కలవాఁడయి పాటుపడుటయందమితశక్తికల వాఁడుగా నుండెను. ఇతఁడు దృగ్గోచర ప్రదేశములను పటములయందు లిఖింప మేధాశక్తి గలవాఁడగుటం జేసి వీని తండ్రి ల్యాండుస్కేపు తోఁటమాలిగా వీనిఁ దరబీతు చేసెను. ఇతఁడు పని నేర్చుకొను కాలమునందు వారమునకు రెండు సంపూర్ణరాత్రులు విద్యాభ్యాసము నిమిత్తము వినియోగించుచుండెను. అయిన నితఁడలకన్నఁ బగలంతయు నెక్కువగాఁ బాటుపడుచుండెను. రాత్రులు విద్యాభ్యాసము చేయు కాలమునందె ఫ్రెంచిభాష నేర్చుకొని పదునెనిమిది సంవత్సరముల వయస్సు రాకపూర్వమె ఎన్సైక్లోపిడియా (సకలార్థ సాగరము) యను గ్రంథమునకొఱకు నొకని జీవచారిత్రమును భాషాంతరీకరించెను. ఎక్కువ యభివృద్ధిఁ బొందవలె నన్న యభిలాష గలిగియుండి యీతఁ డిరువది సంవత్సరముల ప్రాయమప్పు డింగ్లాండులోఁ దోఁటమాలిగాఁ బని చేయునప్పుడు తన దినచర్యను దెలుపు పొత్తములో "నా కిరువది సంవత్సరములు గడచినవి; నా జీవితకాలములో మూఁడవవంతుఁ కాఁబోలుఁ గాలము గడచి పోయినది; అయినను భ్రాతృసమాను లయిన మనుష్యులకు నే నేమి యుపకృతి చేసితిని?" అని వ్రాసికొనియెను. ఇంతప్రాయమున దిట్టియాలోచనము చేయువాఁడుండుట మిక్కిలి యరుదుగదా! ఫ్రెంచిభాషతరువాత జర్మనిభాష నేర్చుకొనుటకు మొదలు పెట్టి యాభాషయందు మంచిపాండిత్యమును సంపాదించెను. కృషివిద్యయందు స్కాట్లాండుదేశీయులు చూపు నభివృద్ధిమార్గముల నింగ్లాండుదేశీయులకు నేర్పుటకొఱకు నొక పెద్దపొలమును సంపాదించి యత్యల్పకాలములోనే యెక్కువరాఁబడి వచ్చునట్లుగాఁ జేయుటయందు

యిచ్చవచ్చినటుల దిరుగ నారంభించెను. ఫలవృక్షములను దొంగిలించు దొంగ లకు గురువుగా నుండెను. దొరతనమువారికి సుంకములను చెల్లింపకుండ సరకు లను దాటించుటయందును దొంగతనములయందును బ్రవీణుఁడయ్యెను. పదునేడు సంవత్సరములు వచ్చినతరువాత తనపని మానుకొని నావికాసైన్యమునఁ జేరి వీరభటుఁడు గావలయు నన్న కోరికతోఁ బారిపోయి యొకగడ్డిపొలములోఁ బరుండి కొంతవఱకు హృదయము చల్లపడినతరువాత మరలివచ్చి యెప్పటిపని లోఁ బ్రవేశించెను. పిమ్మట ప్లిమత్తుపట్టణసమీపమునందలి కాసాండుగ్రామ మునందు కోళ్లు చేయుచుండెను.

ఇతఁడు గదాయుద్ధమున నేర్పరియగుటచేత నచట నావిద్యయందు మంచిబహుమానముఁ బొందెను. తనరాఁబడి వారమున కనిమిది షిల్లింగు లే యగుటవలన ధనాశచేతను సాహసకృత్యములందభిలాషచేతను దొంగలగుం పులోఁ జేరి దొరతనమువారికి సుంకము చెల్లింపకుండ సరకులను దాటించునట్టి సాహసకృత్యములలో నొకదానియం దుంమమించుగాఁ జచ్చియుఁ జావక బ్రదికెను. ఒకనాఁటిరాత్రి క్రాష్తోలుగ్రామమునందు సరకులను వేసికొని దొం గపడవ సముద్రతీరము వెంబడి వచ్చుచున్నదిగావున నావృత్తి నభ్యసించిన వా రెల్లను వొడ్డునకు రావలసినదని తెలియఁజేయఁబడెను. ఆప్రకారముగా నా వృత్తియం దున్నవా రెల్లను నాఁటిరాత్రి యొడ్డునకు వచ్చి కొందఱు ఱాళ్ళ గుట్టలమీఁదనుండి గుర్తులు చూపుటకు నియమింపఁబడి కొందఱు చిన్నచిన్న నావల నెక్కి సరకులపడవలోని సరకుల నొడ్డునకుఁ జేర్చుటకు నేర్పాటుచేసి కొనిరి. సేమ్యుయల్ డ్రూ పడవలో నెక్కి సరకులు చేరవేయుపనియం దుం డెను. ఆప్రకారము సరకులపడవ వచ్చినక్షణమున నెయ్యదివఱకు నియమించుకొన్న ప్రకారము జరపుచుండిరి. ఇంతలో దురదృష్టవశముచేత గాలి యెక్కువయయి సముద్రతరంగములు పర్వతోపమానము లయి పైకి లేచుచుండెను. ఆసంక్షోభ ములో సేమ్యుయల్ డ్రూ నెత్తిమీఁదికుళ్ళాయి వాయువశమున నెగిరి క్రిందఁ

బడెను. దానిం పైకొనవలెనని సేమ్యుయల్ యత్నించుచుండఁగా నావదలక్రిందు లయి పోయెను. ముగ్గురు మునిఁగి పోయిరి. ఇతరులు కొంతకాలము నావఁబట్టు కొనిరి గాని యది సముద్రములోనికి లాగుచుండుటచేత దానిని వదలి యీఁదుటకుఁ మొదలుపెట్టిరి. వారిలో సేమ్యుయల్ ప్రాకూడ నుండెను. వానికి నేల రెండుమైళ్ళదూరమున నుండెను. అంధకారబంధురమయి కన్నులు గానరాక యుండెను. ఆరీతిని సముద్రతరంగములతోఁ బోరాడుచు ప్రా సుమారు గంటలకాలము శ్రమపడి యెట్టకేలకు నొకరిద్దఱితో దరి నున్న రాళ్ళపై జేరి చలిచేత వణఁకుచు తెల్లవాఱువఱకు నచ్చటనే యుండెను. తెల్లవాఱిన తరువాత బ్రదికియుండియుఁ జచ్చినవారివలెఁ బడియున్న వీరలు గనుఁగొనఁబడి బ్రాంది మొదలగునవి త్రాగింపఁబడిన తరువాత రెండుమైళ్ళదూరమున నున్న అతని నివాసస్థలమునకు నడువఁ గలిగిరి.

ఇట్లతిదుర్మార్గుఁడయిన యీ సేమ్యుయల్ ప్రా తుదకు బహుగ్రంథద్రష్టయై మతబోధకుఁడై బహుగ్రంథకర్త యయ్యెను. ఎట్లనఁగా నీతనితండ్రి కుమారుని దుశ్చర్యలఁ జూడఁజాలక యీతని వద్దకు వచ్చి మెల్లగ బోధించి స్వస్థలమునకుఁ గొనిపోయి తొంటి వృత్తియందుఁ బ్రవేశపెట్టెను. డాక్టరుక్లార్కనుమతబోధకుని మతోపన్యాసము లీతని మనస్సు నాకర్షించెను. ఆసమయమునందే యీతని సోదరుఁడు మృతి నొందుట సంభవించెను. తన దుర్వృత్తి వలనఁ గలిగిన విపత్తులు మనస్సునఁ బట్టెను. అప్పటినుండి కన్నులు దెఱచి ప్రపంచమును జక్కగఁ జూడ నారంభించెను. ఎప్పుడు కన్నులు దెఱచి ప్రపంచస్థితిఁ గనిపెట్టఁ గలిగెనో యప్పటినుండి యాతని చిత్తవృత్తి యద్భుతముగా మాఱిపోయి క్రొత్తవాఁ డయ్యెను. అప్పు డాతఁడు నూతనముగా చదురాభ్యాసమునకుఁ గడంగెను. అదివఱకు నేర్చినదంతయు మఱచిపోయెను. తరువాతఁ గొన్ని సంవత్సరము లభ్యసించినను సాలెపురుగు సిరాలో మునిఁగి కాగితముపైఁ బ్రాకినపు డెట్లుండునో యాతని వ్రాత యట్లుండె నని యాతని

మిత్రుఁ డొకఁడు దెలిపియున్నాఁడు. ఆకాలములోని తన స్థితిని గూర్చి యనంతరము డ్రూ యీవిధముగాఁ జెప్పెను.

"నేనధికముగాఁ జదివిన కొలఁదిని నాయజ్ఞానమును గూర్చి నేను తలపోయుచున్నాను. నాయజ్ఞానమును నేను తెలిసికొన్న కొలఁదిని దానిని గడచుటకై ప్రయత్నించెడు నాశక్తి జయింపరానిదిగా నుండెను. తీఱికగల ప్రతినిముషమేని యొక దానిఁ జదువుటయందే వినియోగింపఁబడుచుండెను. బ్రతుకు తెఱవునకై పాటుపడవలసి యుండుటచేత చదువుకొనుటకు కాలము చాలక యుండెను. ఈయాటంకమును దొలఁగించుకొనుటకై భోజన కాలమునందు సయితము గ్రంథ మెదుటఁ బెట్టుకొని యైదాఱు పత్రములను జదువుచున్నాను. జ్ఞానమును గూర్చి నాకే వ్రాసిన వ్యాసము నన్ను జడత్వమునుండి మేల్కొలిపినది. నాతుచ్ఛము లయిన యూహలను విడుచునట్లు దృఢనిశ్చయుని గావించెను." డ్రూ మొదటఁ గొన్ని షిల్లింగులు మాత్రము మూలధనముగాఁ బెట్టుకొని తనకుఁ దానె వ్యాపారము చేయ నారంభించెను. స్థిరచిత్తము కలిగి యోగ్యత యేర్పడిన తరువాత సమీపమునందు నివసించునట్టి యొక పిండివర్తకుఁ డాతనికిఁ గొంత సొమ్ము బదులిచ్చుటకు నొప్పుకొనెను. అది గైకొని వర్తకమును సాగించి సంవత్సరాంతమున నాయప్పంతయుఁ దీర్చివేసెను. తరువాత నతఁ డెన్నికష్టములు తటస్థించినను ఋణ మెక్కడను జేయ నని దృఢనిశ్చయము చేసికొని యాప్రకారము సుస్థిరచిత్తుఁడై యుండెను. రాత్రులం దొకానొకప్పుడు తిండి లేక పస్తుపడి యుండవలసి వచ్చినను సహించుకొని యుండెనుగాని ఋణము చేయలేదు. మితవ్యయమువలనను బాటువలనను స్వాతంత్ర్యమును బడయవలెనని ప్రయత్నించి క్రమముగా విజయమును గాంచెను. ఎడతెగని పాటుపడుచుండియుఁ దన బుద్ధి నభివృద్ధి పఱచుకొనవలెనని ఖగోళశాస్త్రము, దేశచరిత్రము, తత్వశాస్త్రము మొదలగునవి అభ్యసించెను. తరువాత డ్రూ తన తరగతి వారికి నాయకుఁడును మత బోధ

కుండు నయ్యెను. ఇతఁడు రాజ్యాంగ విషయములయం దత్యంతానురాగము గలిగియుండెను. తన గ్రామములోని రాజ్యతంత్రజ్ఞులకెల్లరకుఁ గనిష్ఠుండగు సమావేశ ప్రదేశముగా నుండెను. వారలు తనయొద్దకు రాకుండినఁ దానే వారల యొద్దకుఁ బోవుచుండెను. ఇట్టితరులతోడ రాజ్యాంగవిషయములను గూర్చి చర్చించుచుండుటచే కాలము విశేషముగా వినియోగింపఁబడుటచేతఁ దన షాపులోఁ గూర్చుండి యర్ధరాత్రము వఱకు బని చేయవలసి వచ్చెను. రాజ్యాంగ స్వపరిపాలన సంస్కారణమునం దాతనికిఁ గల యభినివేశమును గూర్చిన ప్రసంగముతో గ్రామమంతటను వ్యాపించెను. ఒకనాఁటి రాత్రి [illegible] పని చేయుచుండఁగా నొక పిల్లవాఁడు తలుపు బొరియలోనుండి కన్ను పెట్టి చూచి 'చెప్పులు కుట్టువాఁడా! చెప్పులు కుట్టువాఁడా! పగలెల్లఁ దిప్పుతిరుగుచు రాత్రులా పనిచేయుట!' అని వెక్కిరించి పోయెను. ఈసంగతి నొకప్పు డొకమిత్రునకు దెలిపినప్పు డాయన "పిల్లవాని వెనుక పరుగెత్తి యాడ్చి యొక చెంపకాయ కొట్టలేదా' యని పలికెనఁట! "లేదు; లేదు. నాచెవియొద్దను తుపాకి పెట్టి పేల్చినను నే నంత భయపడకుందును; నాపని మానివేసి "నిజము నిజము; నన్ను గూర్చి తిరిగి యిట్లు పలుకునట్లు చేయకు" మని నాకు నేనుబుద్ధి చెప్పుకొంటిని. అది నాకు దేవునివాక్యముగాను విన వచ్చెను. ఆగి నాజీవితకాలమునం దంతటను మఱవని వాక్యముగా నుండెను. నేను పని చేయు కాలమున సోమరిగా నుండకుండుటకును ఈరోజు చేయుపని రేపటిరోజు వఱకు నాపి యుంచకుండుటకును ఆవాక్యమునుండి గ్రహించితి నని బదులు చెప్పెను. ఆనిమిషము మొదలుకొని రాజ్యాంగ విషయములను గూర్చిన చర్చలను మానుకొని తన పని తాను జేసికొనుచుఁ దీఱికవేళలఁ జదువుకొనుచుండెను. తనచదువునిమిత్తము తన వ్యాపారమునకు భంగము గలిగించుకొనలేదు. అనంతరము వివాహము చేసికొనెను. అమెరికా ఖండమునకు లేచిపోవలెనని యూహించెను గాని పని చేసికొనుచు నిలిచి యుండెను. భాషాభిమానము

పెంపొందినకొలఁది పద్యకావ్యరచనమునకు మొదట మొదలుపెట్టెను. వాని పద్యము లాత్మయొక్క నిరాకారత్వమును, నిత్యత్వమును దెలుపునవై యున్నవని తరువాతఁ దెలియవచ్చినవి. అతనికి వంటయిల్లే విద్యాభ్యాసము చేయు స్థానముగా నుండెను. భార్యయొక్క కొలిమితిత్తియే డసుకుబల్లగా నుండెను. చెవులు గింగురుమనునట్లు బిడ్డలేడ్చుచు రొద సేయుచుండఁగా గ్రంథములను వ్రాసెను. పేయిన్ వ్రాసిన హేతువాదిక కాలమను వ్యాస మాకాలమున సంపుటమును కలవర పెట్టెను. ఆగ్రంథములోని హేతువుల నెల్ల ఖండించి తా నొక గ్రంథమును వ్రాసి ప్రకటించెను. అతఁ డాహేతువాదికకాల మనుగ్రంథమె తన్ను గ్రంథకర్తనుగాఁ జేసెనని పలుమఱు చెప్పుచు వచ్చెను. దాని తరువాత ననేక స్వల్పగ్రంథములను రచించెను గాని యందు ప్రధానమైనది "మానవాత్మయొక్క నిరాకారత్వము—నిత్యత్వము" గా నున్నది.

ఆగ్రంథ విక్రయమువలన నిరువది పౌనులు సంపాదించెను. ఆకాలములో నదియే యాతనికి గొప్ప మొత్తముగాఁ గానిపించెను. ఆగ్రంథ మనేక పర్యాయములు ముద్రింపఁబడి యిప్పటికిని శ్లాఘింపఁబడుచున్నది. ఇతర బాలగ్రంథకర్తలవలె నావిజయముతో గర్వపడి యుండలేదు. గ్రంథకర్తయని ప్రఖ్యాతి నొందిన తరువాతఁ గూడ దన వాకిటి ముందు వీధిలో నూడ్చుచుండెను. కొంత కాలమువఱకు నాతఁడు గ్రంథరచనమువలననే జీవింపఁ దలఁచి యుండ లేదు. ముందు తన వ్యాపారమువలన మర్యాదజీవనము సేయుచుఁ దరువాతఁ గ్రంథరచనావిజయమును గూర్చి ప్రయత్నింపఁ దలంచెను. గ్రంథరచనవలని జీవనము లాటరివంటి దని పేర్కొనియెను. అయినను తరువాత తనకాల మంతయును గ్రంథరచనమునకే వినియోగించెను. మతము బోధించు పత్రికలను వ్రాసి ప్రకటించెను. అనేక పత్రికలకు విమర్శనగ్రంథములను వ్రాసెను. తన యవసాన కాలమునం దాతఁ డిట్లు తన్ను గూర్చి చెప్పుకొనెను. 'నేను మిక్కిలి హీన

వృత్తుల తరగతులలోనుండి తలయెత్తి మర్యాదగల పాటువలనను మితవ్యయ మువలనను, యోగ్యవర్తనమువలనను నాకుటుంబమును గౌరవస్థితికిఁ దీసుకొని రావలయునని నాజీవితకాల మంతయుఁ గృషి చేసితిని. దైవ మనుగ్రహించి నాకు విజయమును గలిగించెను.

జోసెఫ్ హ్యూ మనునాతఁడు ద్రూవలెఁగాక వేఱునడవడి గలవాఁడై నను వానివంటి పట్టుదలతోడఁ బాటుపడి పనిచేయువాఁడుగా నుండెను. ఇతని బాల్యమునందే తండ్రి గతించుటచేత తల్లి యీతని పెంచుటకై బహుకష్ట ములఁ బొందెను. ఆమె తనబిడ్డలు నీతి దప్పకుండునటుల శిక్షచేసి పెంచెను. తల్లి హ్యూమును శస్త్రవైద్యునికడనుంచి వైద్యవిద్యను నేర్పించెను. అందు పాండిత్యపట్టమును బడసిన తరువాత నీతఁడు హిందూదేశమున కనేకపర్యా యములు పడవల శస్త్రవైద్యుఁడుగా నుండి ప్రయాణములు చేసెను. తరువాత తూర్పుఇండియావర్తక సంఘమువారి నావికాసైన్యములోఁ బ్రధానోద్యోగిగా నుండుటకై యుద్యోగధర్మములు నేర్చుకొనుట కనుజ్ఞచేకొనెను. అతనివలె నెవ్వరు కష్టపడి పనిచేయలేదు. అతనివలెఁ బరిశుద్ధజీవన మెవ్వరును జేయ లేదు. తనపని తాను తప్పక నిర్వహించు సమర్థతగలవాఁడని యున్నతాధికా రుల విశ్వాసమునకుఁ బాత్రుఁ డయిన తరువాతఁ గ్రమక్రమముగా నున్నతో ద్యోగము లొసఁగబడుచుండెను. 1803 వ సంవత్సరములో మహారాష్ట్రులతోడ జరిగిన యుద్ధమున పోవెల్లను సైన్యాధిపతి పక్షమునందు సేనతోఁ గూడ నుండెను. భాషాంతరీకరణోద్యోగి పదమునొందుటవలన నీహ్యూము స్వదేశభాష లభ్యసించినవాఁ డగుట నాపనియందుఁ బ్రవేశపెట్టఁబడెను. ఇది నిర్వహించుటయె గాక జీతము లొసఁగుపనియును, లేఖావహనకార్య స్థానాధిపతి పనియును గూడ తృప్తికరముగా నిర్వహించి యధికారుల మెప్పు నొందెను. మఱియు నాహారవస్తువులను సమకూర్చుకొనుటకై వర్తకసంఘము వారితో నొడంబడిక చేసికొని యాపని తృప్తికరం బగునటుల నిర్వహించుట

మాత్రమె గాక తానుగూడ లాభముఁ బడసెను. ఇట్టియుద్యోగధర్మమును పదిసంవత్సరములు నెఱపి తిరిగి యింగ్లాండు దేశమునకుఁ బోయి తనకుటుంబములో బీదలుగానుండు వారికి బ్రతుకుతెఱ వేర్పఱచెను. తనపాటుయొక్క ఫలిత మును వ్యర్థసంతోషమునకై వినియోగించునట్టివాఁడు కాఁడు. తనదేశస్థితిని ప్రజలస్థితిని జక్కఁగాఁ దెలిసికొనుటకై కొంచెము వర్తకములందును చేతి పనులయందును పేరుగాంచిన ప్రతిపట్టణమును ప్రతిగ్రామమును పరి శోధించెను. తరువాత విదేశసంస్థానముల స్థితిఁ దెలిసికొనుటకై విదేశ యాత్రలు చేసి తిరిగి వచ్చి 1812 వ సంవత్సరములో బ్రిటీషుజన ప్రతినిధిమహా సభలో సభ్యుఁ డయ్యెను. ఆస్థానమున నొకప్పు డెప్పుడో కొంచెము కాలము దక్క ముప్పదినాలుగు సంవత్సరము లుండి బహుకార్యముల నిర్వహించి ప్రజోపకారి యయ్యెను. ప్రథమమునం దాతఁడు చేకొనిన విష యము సంఘవిద్యావ్యాపనముగా నుండెను. సంఘములో విద్యాభివృద్ధి కలుగుటకై తానా సభలో నున్నంతకాలమును బాటుపడి దేశమున విద్యా భివృద్ధి కలిగింపఁజేసెను. ఒక్కవిద్యనుగూర్చిమాత్రమే గాదు. దేశోపకార కరములయిన సమస్తసంస్కరణముల కొఱకును తన శక్తియుక్తులను ధారపోసి కృషిచేసెను. ఇతఁడు మంచి వక్త కాఁడు. అయిన నాతఁడు చెప్పిన దెల్ల మనఃపూర్వక మైన దని విశ్వసింపఁబడు చుండెను. అయిన నామహాసభలో నీతఁడు మాట్లాడుచుండినప్పుడు ప్రతిపక్షులచేఁ బరిహసింపఁ బడుచువచ్చెను. ఎంతపరిహసింపఁబడినను నీతనివాదముయొక్క సత్యమే యెల్లవారిమనస్సులను లోఁబఱచుకొని పెక్కుసంస్కరణములను గావింపఁ గలిగెను. జనప్రతినిధి సభాచర్చలలో నీతఁడు లేకుండుట యరుదుగానుండెను. ఉదయ మాఱుగం టలకు లేచి జాబులు వ్రాసికొని జనప్రతినిధిసభాసంబంధము లయినకాగితముల సమకూర్చుకొని భోజనముచేసి తననిమిత్తము పనిగలిగి వచ్చినవారితో మాట్లాడి ఎడతెగనిపాటు పడుచుండెను. జనప్రతినిధిసభలో నొక్కొక్కప్పుడు

తెల్లవాఱుటకు ముందు మూఁడుగంటలు వేయువఱకు విసుగును విరామమును లేక పనిచేయుచుండును. తా నేవిషయమును దలపెట్టెనో యావిషయము విజయము గాంచువఱకు నెంత యెగతాళి చేసినను నోడు చూపక పోయినను తా నొంటరిగా నిలిచి చర్చింపవలసివచ్చినను మానక కార్యములను సాధించుటకుఁ బాటుపడి మిగులఁ బ్రఖ్యాతి నొందెను.

---



# ఏడవ ప్రకరణము.

---

## పరిశ్రమము—సంస్థానాధిపతులు.

పూర్వ ప్రకరణములయందు సామాన్యజను లనేకులు తమనిరంతర పరిశ్రమమువలనను ప్రయోగకౌశల్యమువలనను దమ హీనస్థితులనుండి యున్నతపదవులకు వచ్చియుండి రని చదువరులకుఁ దెలిపియుంటినిగదా. ఉన్నతపదవులకు వచ్చుటయేగాక సంస్థానాధిపతులుగూడ నైరని పెక్కుదృష్టాంతములు చూపవచ్చును. మనదేశపు సంస్థానాధిపతులవలె వంశపారంపర్యముగా వచ్చిన ఘనతగలవారుగాక బ్రిటానియాదేశపు సంస్థానాధిపతులు పెక్కండ్రు స్వయంకృషివలననే యౌన్నత్యమునకు వచ్చిన వారలుగా నున్నారు. సమస్తమానవులయొక్క రక్తము దూరముగానుండెడు నొక యుత్పత్తి స్థానమునుండి సమానముగాఁ బ్రవహించుచున్నయది. అనేకులు దమ తాత ముత్తాతలకుఁ బూర్వము నున్నవారినిఁ జెప్పలేకపోయినను తమ వంశమునకు మూల పురుషునిగా గొప్పవానినే తమ వంశవృక్షములయందు నెక్కొలుపుచునే యున్నారు. ఏతరగతియు దేశమున సుస్థిరముగా నిలిచి యుండలేదు. బలవంతు లథోగతి పాలయిరి. బీదలు పైకివచ్చిరి. ప్రాచీనకుటుంబముల యౌన్నత్యమడుగంటి నూత్నకుటుంబములు వానిస్థానముల నాక్రమించుకొనినవి. ప్రాచీనకుటుంబములు సామాన్యకుటుంబములోఁ గలిసి యదృశ్యము లగుచున్నయవి. బర్కు వ్రాసిన "కుటుంబములయొక్క దశాభేదము" లను గ్రంథము కుటుంబములెట్లభివృద్ధిఁబొంది పడిపోయినవో, ఎట్లుదురదృష్టముల పాలయిన బీదలకుటుంబములకన్న భాగ్యవంతులయొక్కయు, ప్రభువులయొక్కయు కుటుంబము లధికసంఖ్యాకములై యున్నవో చక్కఁగాఁ జాఁటి చెప్పుచున్నది.

బ్రిటను రాజ్యమును జానుప్రభువు పరిపాలించుకాలమున "మెగ్నచార్టా" (Magna Charta) యను శాసనమును నిర్వహించుటకై యెన్నికగాంచిన ఱేను(Barons)లను బిరుదుగల జమీందారు లిరువదియేవుర సంతతిలో నొక పురుషుఁడయినను నిప్పటి ప్రభుసభలోఁ గానరాఁడని యాగ్రంథకారుఁడు నుడివి యున్నాఁడు. అన్యోన్య కలహములవలనను దౌర్జన్యములవలనను యుద్ధములవలనను పూర్వప్రభువులు నాశమునొందఁగా వారలకుటుంబములు చెదరిపోయినవి. అయినను వారిసంతతిలోని వారలనేకులు సామాన్యజనులలోఁ గానిపించుచు నిప్పటికిని జీవించియున్నారు. మొదటి యెడ్వర్డుప్రభువుయొక్క యాఱవకొడుకయిన కెంటుప్రభువుయొక్క వంశములోనివారగు నిరువు రిప్పుడున్నారనియు నందులో నొకఁడు కసాయివాఁడుగాను మఱియొక్కఁడు చాకివద్ద సుంకముతీయువాఁడుగాను నుండెనని బర్కు వ్రాసియున్నాఁడు. క్లారన్సు ప్రభువు (Duke of Clarance) యొక్క కూఁతురయిన మార్గరెటుయొక్క మునిమనుమడిప్పుడు ష్రాపుషైరు జనపదమునందలి న్యూపోర్టులో చెప్పులుకుట్టువాఁడుగనుండెను. మూఁడవ యెడ్వర్డుప్రభువు కొడుకయిన గ్లాసెస్టరు ప్రభువుయొక్క సంతతివారిలో నొకఁడు సెంటు జార్జియను క్రైస్తవాలయములో నొకపనివాఁడుగ నుండెను. ఇంగ్లాండుదేశమునకుఁ బ్రధానమంత్రిగా నుండిన సిమాన్ డిమాంట్ఫోర్టుయొక్క సంతతిలోనివాఁడొకఁడు టూలే వీధిలో గుఱ్ఱపుజీనులు కుట్టువాఁడుగా నుండెను. నార్తంబర్లాండు ప్రభువుయొక్క సంతతిలోనివాఁడొకడు డబ్లిన్నగరమునఁ బ్రయాణమునందు బాటసారుల కుపయోగించు పెట్టెలను జేయు పనివాఁడుగ నుండెను. పెర్తుప్రభువుయొక్క వంశజుఁడొకఁడు నార్తంబర్లాండు సేలబొగ్గుగనిలో పనిచేయు కూలివాఁడుగ నుండెను. ప్రసిద్ధపురుషుఁడయిన ఒలీవరు క్రోమ్వెల్లుయొక్క మునిమనుమలలో నొకఁడు స్నోహిల్లనుచోటఁ జిల్లరసరకు లమ్మువాఁడుగ నుండెను. క్రోమ్వెల్లు సంతతిలోనివారనేకులు నిర్భాగ్యులై చనిపోయిరి. గర్వ

భూయిష్టములయిన పేరులను బిరుదములను వహించిన ప్రభువరు లనేకులు చీడపురుగు లాకులన్నిటిని దినివేసి మొక్కలను జంపి తాముగూడ నాశమునొందురీతిగఁ దమ పెద్దలుకూడఁబెట్టిన యైశ్వర్యమునంత మ్రింగివేసి పోవరుఃయి చనిపోయిరి. మఱికొందఱు దురదృష్టముపాలయి మరల నెప్పటికిని కోలుకోన లేక దరిద్రస్థితిలోనె మునిఁగిపోయి యుండిరి. ఔన్నత్యముగలవారియొక్కయు భాగ్యవంతుల యొక్కయు స్థితు లట్లుగ మాఱెను.

బిరుదములనుబట్టియాలోచించినంతవఱకు నిప్పటిప్రభువులలోననేకులు నవీనముగఁ పైకివచ్చినవారుగ నున్నారు. గౌరవదాయకమయిన పరిశ్రమమును శ్రేయుపనివాండ్రతరగతులలోనుండి సామాన్యులు సంస్థానాధిపతులగుట సంస్తవనీయమేగదా. శక్తియు నభినివేశముగలయట్టివారిచేఁ బెంపొందింపఁబడిన లండనునగరపు వాణిజ్యము నైశ్వర్యము నే పూర్వకాలమునందు ప్రభుస్థానమునకుఁ గొనివచ్చుటకు మార్గదర్శకములుగానుండినవి. కారన్‌వాలీసు జమీను (Earldom) ప్రసిద్ధవణిక్శిఖామణియగు థామస్ కారక్ వాలీసువలన స్థాపింపఁబడినది.

ఎస్సెక్సు సంస్థానము ఉల్లియమ్‌కేపెల్ అనువానివలన స్థాపింపఁబడినది. ఉల్లియమ్‌క్రేవెనను కుట్టుపనివానివలన క్రేవెన్‌జమీను స్థాపింపఁబడినది. వార్విక్కు ప్రభువురాజవంశజుఁడుగాక రోమముల(బొచ్చు) వ్యాపారముచేయునట్టి ఉల్లియమ్ గ్రెవిల్లేయొక్క సంతతివాఁడుగా నుండెను. ఇప్పటినార్తంబర్లాండు డ్యూకులు (ప్రభువులు) హ్యూస్మిత్‌సన్ అను మాననీయుఁడగులండనునగరపు భిషగ్వరుని సంతతి వారయియున్నారు. టాంకర్విల్లి, డార్మర్, కోవెంట్రీ మొదలగు జమీనులయొక్క స్థాపకులు బట్టలవర్తకులుగా నుండిరి. రామ్నే, డడ్లే, వారుప్రభువులయొక్క పూర్వికులు స్వర్ణకారవృత్తి గలవారుగానుండిరి. మొదటిచార్లెసురాజు పరిపాలనమునం దుండిన డేక్రీసుప్రభువు విక్టోరియారాజ్ఞీ గారి పాలనమునందలి ఓవరుస్టోను ప్రభువువలెనె వడ్డి

వ్యాపారము చేయు సాహుకారుగా నుండెను. లీడ్సు జమీను స్థాపించిన యెడ్వ ర్డుఆస్బారను భాగ్యవంతుడైన బట్టలవర్తకుఁడగుఁ విల్లియమ్ కావెట్టను వాని వద్ద పనిచేయుచున్న వాఁడుగ నుండెను. ఈ ప్రకారముగా ఫిట్జివిల్లియమ్, లెమ్, పెల్హే, కాపర్, డారన్లే, హిల్, క్యారింగ్టన్, మొదలగు జమీనులయొక్క స్థాపకులు గొప్పవర్తకులుగానే యుండిరి.

ఫోలేకుటుంబముయొక్క మూలపురుషుఁడగు రిచార్డ్డుఫోలే యనువాని తండ్రి మొదట చార్లెసు రాజుకాలమున స్టోనుబ్రిడ్జి సామీప్యమున నివసించు చుండిన యొక్క చిన్న సేవకుఁడు (బంటురౌతు) గా నుండెను. ఆకాలమునం దాస్థానము దేశమధ్యముననున్న మండలములలో నెల్ల నినుపపనిముట్లను జే యుటకు ముఖ్యమయినదిగా నుండెను. అట్టి యినుపసామానులలో నొక్క టియగు మేకులు చేయునట్టి పనియందు రిచార్డు ప్రవేశపెట్టఁబడి తరిబీతు చేయఁ బడుచుండెను. ఆతఁడక్కడ పనిచేయుకాలమునందు మేకులు చేయుటకు గాను నినుపకమ్ములను విభాగించు చిక్కుపద్ధతివలన కాలహరణమగుటయు నెక్కువపని పుచ్చుకొనుటయుఁ గనిపెట్టెను. స్వీడనుదేశమునుండి విరివిగా మేకులు దిగుమతి చేయఁబడుచున్నందువలన స్టోరుబ్రిడ్జిలోని మేకులవర్తకుల యమ్మకముతగ్గి తన్మూలమున వ్యాపారము క్షీణింప నారంభించెను. ఇంగ్లాండు దేశమున మేకులకొఱకు నినుపకడ్డీలను చేయుపద్ధతి మిక్కిలి కష్టసాధ్యమ యిన దగుటచేత నక్కడిపనిముట్లకంటె స్వీడనుదేశమునందు యంత్రసాహాయ్యం బున జేయబడు పనిముట్లు మిక్కిలి చౌకగా లభించుచున్నదని దేశమునం దంతట నల్లుకొని దెలియవచ్చెను.

రిచార్డ్డుఫోలే యీమర్మమును గనిపెట్టి యానూత్నపద్ధతిని దెలిసికొనవలెనని దృఢనిశ్చయము చేసికొనెను. స్టోరుబ్రిడ్జి సామీప్యముననుండి యక స్మాత్తుగా నదృశ్యుఁడై కొన్నియేండ్లవఱకు మరలఁ గానరాఁడయ్యెను. అతఁ డెక్కడికిఁబోయెనో యెవ్వనికిఁ దెలియరాకుండెను. తనకుటుంబమువారి తో

డనైనఁ జెప్పియుండలేదు. తనయభిప్రాయము వారికిఁ దెలియఁజేసినయెడలఁ గొనసాగదని యాతనికిఁ దెలియును. ఆతనివద్ద నేమాత్రమయినను ధనములేదు. హల్లను పట్టణమునకుఁ బోఁగలిగి స్వీడను దేశపు రేవులలో నొకదానికిఁ బోవునట్టి పాగయోడమీఁదఁ బనిచేయుటకు నొప్పుకొని వెళ్లెను. అతఁడు ప్రయాణముచేయునపు డతనివద్ద నొకపిడిలు (సంగీతయంత్రము) మాత్రముండెను. స్వీడనుదేశము చేరఁగానే రిచార్డు పిడిలు వాయించుచు దన్మూలమున ధనముసంపాదించుచు అప్సాలానగరమునకు సమీపమునందలిడేనిమోరా గనులకుఁ జేరుకొనెను. అతఁడు సంగీతవిద్యయందుఁ గౌశల్యముగలవాఁడును, ఉల్లాసము గలిగించు స్వభావముగలవాఁ డగుటవలన నినుపగనులలోని పనివాండ్రతోడఁ జెలిమి గలిగించుకొనెను. ఆపనిచేయు యంత్రశాలలో నేభాగమునకుఁ బోయినను నాతని నెవ్వరు నాటంకపెట్టక యుండిరి. అది సందుచేసికొని కుశాగ్రబుద్ధి గలవాఁడుగావున నాయంత్రశాలలో జరుగుపనియొక్క క్రమమునంతను జక్కఁగా నేర్చుకొని కొంత కాలముండి తనమిత్రులకెవ్వరికిం దెలియంజెప్పకయె యకస్మాత్తుగ నదృశ్యుఁడయ్యెను. వాఁడెచ్చటికి బోయెనో యెవ్వనికిఁ దెలియకుండెను. ఇంగ్లాండుదేశమునకుఁ దిరిగివచ్చి తనప్రయాణముయొక్క వృత్తాంతమునంతను స్టౌరుబ్రిడ్జినందలి దనమిత్రులకుఁదెలిపి తనపట్లవారలకు విశ్వాసము కలుగునట్లు ప్రవర్తించి వారివలనయంత్రనిర్మాణమునకుఁ గావలసిన ధనసాహాయ్యమునుబొంది నూత్నపద్ధతిప్రకార మినుపయంత్రశాలఁ గట్టించెను. యంత్రశాల నిర్మింపఁబడినతరువాత పని ప్రారంభించినపుడు యంత్రములుపని చేయకుండెను. అందునకతఁడును మిత్రులునుగూడ నిరుత్సాహమును వ్యసనమును బొందిరి. మరల ఫోలె యప్పటియట్ల యదృశ్యుఁడయ్యెను. ఈయవమానమును భరింపఁ జాలక దేశాంతరగమనుఁడయ్యెనని యెల్లవారును దలపోయుచుండిరి. అదిసత్యముగాదు. దానిమర్మముఁ దెలిసికొని యెట్టులయిన యంత్రమును నడిపింపవలెనని నిశ్చయముచేసికొనెను. అందునకుఁగాను మరలనాతఁడు స్వీడను

దేశమునకుఁ బోయి తనమిత్రులను గలసికొనెను. వారలాతఁడు పిడిలువాయించు టకు మాత్రమే సమర్థుఁడని తలంచిరిగాని తమ యంత్రాదికముయొక్క మర్మమును గ్రహింపఁగలమేధాశక్తి గలవాఁడని తలంపలేదు. అందువలన నాతని నినుపక మ్ముల చీల్చునట్టి యంత్రముగల ప్రదేశమునకుఁగూడ రప్పించుకొనుచుండిరి. గాని దెలిసికొనుటయే యాతని సంకల్పమై యుండెనుగాన నతఁడు జాగ్రత్త గాఁ బరీక్షించుచుండెను.

ఇనుపకమ్ములఁ జీల్చెడు యంత్రమును బాగుగా శోధించి తనయంత్ర ము నడువ కుండుటకుఁ గారణ మెద్దియో కనుఁగొనెను. తనకునూతనవిద్యగా నున్నను నాయంత్రముయొక్క రూపమును చేతనగుకీలిని కాగితముపైని వ్రాసి కొనియెను. మరల నేసంశయమును గలుగకుండునటుల మరికొంతకాలముండి తెలిసికొనవలసిన వాని నన్నిటిని దెలిసికొని పనివాండ్రను వదలి పెట్టి రేవు నకువచ్చి పొగయోడ నెక్కి స్వదేశముఁ జేరెను. అంత పట్టుదలయు నోపిక యుఁగల మనుష్యుఁడు విజయమును బొందక మానఁడు. అతఁడు వచ్చి తన కార్యము లన్నిటిని సమగ్రముగాఁ బూర్తి కావించుకొని జాగ్రత్తగాఁ బని చేసి తన కృషియందు విజయమును గాంచి సత్ఫలములను గాంచెను. తన చాతుర్యమువలనను నిరంతరకృషి వలనను విశేషభాగ్యమును సంపాదింపఁ గలు గుటయే తన మండలముయొక్క వ్యాపారము గూడ నభివృద్ధిపఱచెను. తన జీవితకాలములోఁ దన వ్యాపారమును దాన నడుపుకొనుచు సామీ ప్యమునందు దేశోపకారకరము లయిన పనులను బ్రోత్సాహపఱచుచుఁ జేయు చునుండెను. స్టోరుబ్రిడ్జియందొక పాఠశాలను స్థాపించి మూలనిధి యేర్పఱచి పాఠశాల శాశ్వతముగా నుండునటులఁజేసెను. అతని కొమారుఁడగు థామస్ కిడ్డరుమినిస్టరనుచోట పెద్దపరాబుగా నుండి బిడ్డలు స్వేచ్ఛగా విద్య నేర్చుకొనుటకై స్వన్ ఫోర్డుగ్రామములోఁ వైద్యశాల గట్టించెను. ఫోలే కుటుంబములోని పూర్వికులెల్లరును ప్యూరిటానులను నొక క్రైస్తవ తెగలో

నివారుగా నున్నారు. ఈ కుటుంబమువారు గౌరవమును, న్యాయబుద్ధియును, దైవభక్తియును, మతాభిమానమును, సంస్కరణ దీక్షాధురీణతయును గలిగియున్నారు. వీరలు రెండవ చార్లెసు రాజు పరిపాలనమునఁ బ్రభుస్థానమునకు వచ్చియుండిరి.

మల్గ్రేవు కుటుంబమునకు మూలపురుషుఁడయిన ఉల్లియమ్ ఫిప్సు రిచార్డుఫోలేవలెనె ప్రసిద్ధికెక్కిన వాఁడుగ నుండెను. అతనితండ్రి అమెరికా ఖండములోని మేయిన్ మండలమున "ఉూల్విచ్చి" యను గ్రామంబున మిక్కిలి బలాఢ్యుఁడయి తుపాకులు చేయు పనివాఁడుగ నుండెను. అతఁడు ౧౬౫౧ వ సంవత్సరమున జనించెను. ఇరువదియాఱుగురు జనులుగల కుటుంబములోఁ దానొక్కఁడుగా నుండెను. అం దిరువదియొక్కరు కొడుకులుగా నుండిరి. ఇండఱును దమ స్వకాయకష్టమువలనను బుద్ధికుశలత వలనను ధనము సంపాదించుకొని బ్రతుకవలసినదేగాని వేఱు జీవనాధార మేమియును లేదు. ఆకాలమునందు డెన్మార్కు దేశీయు లగు డేనులు నావికాయాత్ర చేయుట యందు బహువిధముల సమర్థులుగా నుండిరి. ఉల్లియముయొక్క దేహము నందు డేనులరక్తము ప్రవహించుచున్నందువలన బాల్యమునందు గొఱ్ఱెలకాపరిగా నున్నను యౌవనము నా ప్రకారము గడుపఁదలంచి యుండలేదు. అసమాన ధైర్యసాహసములు గలిగియుండిన స్వభావము గలవాఁడగుటచేత దాను నావికుఁడుగా నుండి ప్రపంచమునం దంతట సంచారము చేయవలె నన్న కుతూహల మాతనికిఁ గలదు. అందువలన నాతఁ డేదయిన యొకయోడ కొఱకు వెదకుచుండెను. అది సమకూరనందున నోడను గట్టు వానినొకని నాశ్రయించి వాని వలన నాపని నేర్చుకొని తీఱిక వేళలందుఁ జదువుటయు వ్రాయుటయు నభ్యసించుచు వచ్చెను. ఇట్లా పనినంతయు నేర్చుకొని బోస్టను నగరమునకుఁ బోయి కొంత జీవనము గలిగి యుండిన యొక విధంతువును బెండ్లి చేసికొని తరువాతఁ బరిశ్రమము చేసి యొక చిన్నయోడను గట్టుకొని సముద్రములో

నడుపుచు పనికిమాలిన సరకుల వ్యాపారమును జేయుచు బహుకష్టములు పడి పాటుపడుచు పది సంవత్సరముల కాలము గడపెను.

ఒకనాఁడు ఫిప్సు బోస్టను నగరపు వంకరసందులలోఁ దిరుగుచుండి నప్పుడు బహామాసుద్వీప సమీపమునందు స్పెయినుదేశపు నావ బ్రద్దలయి మునిఁగి పోయినట్లును, అందు విశేషమగు ద్రవ్యముండినట్లును నావికు లిరువురు చెప్పుకొను మాట లాతనికి వినవచ్చెను. దానిని విని వెంటనే యాతఁ డత్యు త్సాహముతోఁ గొందఱు నావికులను జేర్చుకొని కాలయాపనము చేయక బహామాసు ద్వీపమునకుఁ బ్రయాణము చేసెను. ఓడయొక్కునే బ్రద్దలగుట వలన సులభముగాఁ గనుఁగొనఁబడెను. సరకులను విశేషముగాఁ దీయఁగలి గెను; గాని ధనసుమాత్రము స్వల్పముగానె లభించెను. ఆపన మాతనికయిన వ్యయమునకుఁ జాలియుఁ జాలినంతటిదిగా నుండెను. ఆతని యుత్సాహ మం తట్టితోఁ దీఱియుండ లేదు. ఇరువదియేను సంవత్సరములకుఁ బూర్వము పోర్టు డీలా ప్లాటాయను రేవునకు సమీపమున నొకయోడ యమిత ద్రవ్యముతో మునిఁగిపోయె నని విని యాద్రవ్యమును సంపాదింపవలెనన్న యభిలాష యాతని కుదయించెను. అతఁడు బీదవాఁ డగుటవలన గొప్ప సాహాయ్యము గలిగినఁగాని యాపని నెఱవేర్పఁజాలనని యూహించి అట్టి సాహాయ్యమింగ్లాండు దేశమునఁ బడయఁగలనని నిశ్చయించుకొని యాదేశమునకుఁ బోయెను. బహామాసు ద్వీప మువద్ద పొందిన యాతని విజయముయొక్క కీర్తి యింగ్లాండు దేశమునందును వ్యాపించెను. సాహాయ్యమును గోరి దొరతనమువారికి విజ్ఞాపనము చేసికొనెను. రాజకీయోద్యోగియుల యనుగ్రహమును బడసెను. రెండవ చార్లెసురాజు పదునెనిమిది ఫిరంగులు తొంబదియైదుగురు నావికులు గలిగిన యొకయోడ నిచ్చి యాధిపత్యమాతని కిచ్చెను. పగిలిపోయిన యాయోడను గనుగొని ద్రవ్యమునంత నెత్తికొని వచ్చుటకయి ఫిప్సు ప్రయాణమయి వెళ్లెను. అతఁడు సురక్షితముగా హిస్పానియోలా తీరము చేరెను. మునిఁగిపోయిన యోడ నెట్లు

కనుఁగొనఁ గలఁడు. అట్లు కనుఁగొనుట బహుకష్టము గదా! నిజము విచా
రించిన నా యోడ మునింగిపోయి యేఁబది సంవత్సరము లాయెను. జనులు
పరంపరగా నా సమాచారమును జెప్పుకొనుటయేగాని సత్యమెంతటిదో నిజ
ముగా నాతనికిఁ దెలియదు. ఏవిధమైన జాడయుఁ గానఁ బడని యాసముద్ర
తీరమునంతను బరిశోధింపవలసి యుండెను. ఫిప్సు మాత్రము నిరుత్సాహముఁగలఁ
వాఁడు గాక తా నాపడవను గనుఁగొనఁగలనన్న విశ్వాసమును ధైర్యోత్సాహ
ములను గలవాఁడయి యుండెను. సముద్రతీరమునంతను బనివాండ్రచేతఁ బని
చేయించెను. వారల కాపని కష్టతరముగా నుండి యాతని వివేకవిహీనతను
గూర్చి తమలోఁ దాము మాట్లాడుకొనుచుండిరి. తుదకు గుసగుసలు పోయి
మాటలును, మాటలు పోయి బహిరంగముగ నెదుర్కొని కలహించుటయుఁ
గూడ సంభవించెను. ఒక దినము కొందఱు పనివాండ్రు కట్టుకట్టుకొని వచ్చి
ప్రయాణము మానవలసినదని నిర్బంధించిరి. అంతమాత్రముచేత నావికుఁడు
వారికి జడిసి తన యుద్యమము మానువాఁడు గాఁడు. వారిలోఁ గలహకారు
లను జెరఁబట్టి తక్కిన వారిని వారి పనికిఁ బంపెను. పడవ మరమ్మతు
నిమిత్తమును పడవ నీటిలోనుండి పైకి తేలుటకై యొడ్డునఁ గొంత సామాను
దింపుటకు నొక చిన్నద్వీపమునకుఁ జేర్పవలసి వచ్చెను. నావికులలోఁ
బెక్కండ్ర కాతనిమీఁద వైరము గలదు గావున నాతని సముద్రములోఁ బడఁ
ద్రోచి పడవ స్వాధీనము చేసికొని దక్షిణసముద్రములయందు స్పానియను
లను దోఁచుకొను వృత్తియందుఁ బ్రవేశింపవలెనన్న సంకల్ప ముదయించెను.
కాని వారలకు పడవ వడ్రంగియొక్క సాహాయ్యము గావలసియుండెను గావున
నాతనితోడఁ దాము పన్నిన పన్నుగడఁ దెలియఁ జేసిరి. అతఁడు ఫిప్సునకు
విశ్వాసపాత్రుఁడుగా నున్నందున నాకుట్రసంగతి యాతనికిఁ దెలిపెను.
అతఁడు దనకు విశ్వాసపాత్రులయినవారిని రప్పించి ఫిరంగుల నమాయు చేయించి
సిద్ధముగా నుంచెను. అతఁడు సరకులను దింపి బాగు చేయించుచుండఁగాఁ

గలహాకారు లాయుధములను బూని సరకుల నాక్రమించుకొనఁ జూడఁగా నాతఁడు ఫిరంగులను బేల్చి చంపి వేయుదుననియు దూరముగా నుండవలసిన దనియు భయపెట్టెను. ఫిరంగులయొక్క సంరక్షణముచేత నా సరకులను మరల పడవలో నెక్కించెను.

అప్పుడు కలహాకారులెల్లరు నాద్వీపమునందలి వంధ్య భూమియందు నిక్కలేక చావవలసి వచ్చునని యూహించి తమ తమ యాయుధముల నొప్పగించి శరణు చొచ్చిరి. అంతమాత్రముచేతఁ దృప్తినొంది యేమఱియుండక వారలవలన భావికాలమున నే యపాయము గలుగకుండఁ జూచుకొని మంచి యేర్పాటులు చేసికొనియెను. కాని యోడ బాగు చేయింపవలసి వచ్చి తిరిగి యింగ్లాండునకు రావలసి వచ్చెను. ఆపగిలిపోయిన పడవను గూర్చిన సమాచారము బాగుగాఁ దెలిసికొనియెను. ఇంగ్లాండునకు వచ్చి యావృత్తాంత మచ్చటి వారికిఁ దెలియఁజెప్పెను. అతఁడు జయమును బొంది రానందున మరల నింకొక యోడ నిచ్చి పంపరైరి. అప్పుడు రెండవచార్లెసు రాజు ప్రభుత్వము పోయి రెండవజేమ్సు ప్రభుత్వము వచ్చెను. దొరతనమంతయు నల్లకల్లోలముగ నుండెను. అతఁడాపనికై చందాలు వేయించుకొనవలసి వచ్చెను. ఈసంగతి విన్న మాత్రమున నెల వారు నీతనిఁ బరిహసించుచుండిరి. అయినను నిరంతర కృషివలనను బట్టుదలవలనను ప్రభువులయొక్క యనుగ్రహమువలన నొక సంఘము నేర్పాటు చేయించి తిరిగి యాతనిం బంపించిరి ఈ రెండవతూరి యాతని యదృష్టము ఫలించెను. ఆప్రదేశమునకుఁ బోయి యంత్రసాహాయ్యమున ననేకవారములు సముద్రములోని యడుగు భాగమునంతను బరిశోధించిరి. ఒక నావికుఁ డొకనాఁడు పడవ ప్రక్కను బరిశోధించి చూచుచుండఁగా విచిత్రమైన సముద్రపు మొలక యొకటి గానిపించెను. దానిఁ దెచ్చుటకై యొకనిఁ బంపెను. దానిని వాఁడు దెచ్చి యాస్థలమున ఫిరంగులున్నవని చెప్పెను. మఱియొకఁడు పోయి మునిఁగి చూడఁగా వానికి వెండి కమ్ములు

దొరకెను. వానిఁ జూచి పిప్సు విజయము కలిగినదని దైవమునకు వందనము సమర్పించి యాప్రదేశమునంతను శోధించి కొన్ని రోజులలో మూఁడు లక్షల పౌనుల ద్రవ్యమును సంపాదించెను. ఆద్రవ్యముతో నాతఁ డింగ్లాండునకు వచ్చెను. కొందఱు కుట్రపన్ని యాతనింబట్టుకొని యాద్రవ్య మపహరింపవలసి నదని రాజునకుఁ జెప్పిరిగాని యాతఁడు మర్యాదగలవాఁడు నీతి గలవాఁడని రాజు ద్రవ్యమును ఫిప్సు నాతని మిత్రులు పంచుకొనునటుల నుత్తరువు చేసెను. పిప్సునకు నిరువదివేల పౌనులు వచ్చెను. అతఁడు క్రమముగా గొప్పపదవులకు వచ్చెను. ఒక మండలమునకు పాలకుఁడ (గవర్నరు)య్యెను. ఆతఁ డింగ్లాం డునందును స్థిరనివాసము గుదుర్చుకొని నార్మన్ బై సంస్థానమునకు ప్రభు వయ్యెను.



# ఎనిమిదవ ప్రకరణము.

---

లాన్సుడవున ప్రభువంశస్థాపకుం డగు విల్లియమ్ పెట్టీ యను నాతఁడు పెప్పునవలెనే తనకాలమునందు మిగుల సమర్థతగలవాఁడుగాను లోకమున కుపచరించునట్టి వాఁడుగాను నుండెను. ఇతఁడు హాంప్సుషైరులోని రామ్సే గ్రామమున 1623వ సంవత్సరమున బట్ట లమ్ముకొని జీవించు నొక బీదవానికి జనించెను. ఇతఁడు బాల్యమునందు తన స్వగ్రామమున దేశభాషలను నేర్పుపాఠశాలయందుఁ గొంతవఱకు విద్య నభ్యసించెను. అటుపిమ్మట నార్మండీలోని కేయెన్ కలాశాలయందు స్వయముగా విద్యాభ్యాసము చేయుటకు నిశ్చయించుకొనెను. అచట తన తండ్రివలన సహాయముఁ బడయకుండఁ దన్నుఁ దాను బోషించుకొనుటకై కొంచెముగఁ జిల్లరసరకులను జేర్చుకొని వీథివీథికిఁ దిరిగి యమ్ముకొనువృత్తి నవలంబించెను. ఇంగ్లాండునకు మరలివచ్చి యొకయోడ కెప్టనువద్దఁ బని నేర్చుకొనువాఁడుగఁ బ్రవేశించెను. తన దృష్టిదోషమునకై యాతఁడు త్రాఁడుకొనతోడఁ గొట్టెను. అంతట నాపడుచువాఁడు నిరుత్సాహమును విసుగును బొంది యాపని మానుకొని వైద్యశాస్త్ర మభ్యసింపఁ దొడంగెను.

అతఁడు పారీసునగరమునం దుండినపు డంగచ్ఛేదనముచేసి వేర్వేఱు భాగములుగా కోసి తీయుపనియం దుండెను. మఱియు నాకాలమునందె దృక్శాస్త్రమును వ్రాయుచుండిన హాబ్బిసుకొఱకు పటములను వ్రాసెను. రెండుమూఁడు వారములు తిండిలేక కొండగోఁగుకాయలను మాత్రమే తిని బ్రదుకవలసినంత బీదదశకు వచ్చెను. కాని, మరల నాతఁడు వెనుకరీతిఁ స్వల్పవర్తకమునుఁజేసి న్యాయమయిన కొంతసొమ్ము గడియించి యాసొమ్ముతో

కొలఁదికాలమునకె యింగ్లాండునకు మరల రాఁగలిగెను. అతఁడు స్వతస్సిద్ధ
మయిన యంత్రశాస్త్రజ్ఞానము గలవాఁడగుటంజేసి జాబులకుఁ బ్రతులు వ్రా
యునట్టి యంత్రమునుఁ గనిపెట్టెను. శిల్పవిద్యలను గుఱించియు, ప్రకృతిశాస్త్ర
ములను గుఱించియును వ్రాయ నారంభించెను. ఇంతియకాక రసాయన
శాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము నభ్యసించి విజయమునొంది మంచిపేరు
సంపాదించెను. శాస్త్రజ్ఞులతోడి సహవాసమువలన శాస్త్రజ్ఞాన మభివృద్ధిచే
యునట్టి సంఘము నొకదాని నేర్పఱచుటకై చర్చించి యాసంఘముయొక్క
ప్రథమసభ తాను నివసించియున్న గృహమునందె జరపించెను.

ఆక్సుఫర్డునగరమున దేహచ్ఛేదనమునందు ఱోత గలిగియుండిన యొక
శారీరశాస్త్రపండితునికి సహాయుఁడుగానుండి పనిచేసెను. 1652-వ సంవత్సర
మున నాతని కృషి సఫలత గాంచెను. ఐర్లాండు సైన్యములో వైద్యుఁడుగా
నేర్పాటు కాఁబడి యచ్చటికిఁ బోయెను. అచట నాయుద్యోగములో నున్న
కాలమున వరుసగా లాంబర్టు, ఫ్లీటువుడ్డు, హెన్రి, క్రోంవెల్లను లెప్టినెంటు
ప్రభువులకు వైద్యుఁడుగానుండి చికిత్స చేసెను. యుద్ధనిపుణులగు వ్యారిటాను
షటులకు విశేషముగా భూము లీయఁబడెను. ఆ భూములు సరిగాఁ గొలువఁ
బడలేదని పెట్టీ కనుఁగొనెను. తాను జేయవలసిన వ్యాపారములు పెక్కు
లుండినను ఈపనినిఁ దాను జేయుటకుఁ బూనుకొనెను. ఆతఁడు నిర్వహింప
వలసిన కార్యములు వివిధములుగాను, అధికములుగాను నుండుటచేత ననూ
యాపరు లగువారిచేత లంచగొండి యనిదూషింపఁబడి యాపనులనుండి
తొలఁగింపఁబడెను గాని కొలఁదికాలముననే వారలదయను బొందినవాఁడై
యాపనులయందు మరలఁ బ్రవేశపెట్టఁబడి మిక్కిలి ప్రఖ్యాతినిఁ గాంచెను.

విల్లియమ్ పెట్టీ విసుగుచెందని పరిశ్రమమునుచేసి నూత్న వస్తువులను
పెక్కింటిని గల్పించెను. తరంగములకుఁ బెనుగాలికి నెదురుగఁ బోవునట్టి
యొక క్రొత్తయోడను నిర్మించెను. రంగులు వేయుటను గూర్చియు, ఓడలు

నడుపుటను గూర్చియును, రోమములతో వస్త్రములను నేయుటనుగూర్చియు మఱియు నింక ననేక విషయములను గూర్చియును గ్రంథములను వ్రాసి ప్రకటించెను. ఇనుప పనులను స్థాపించెను. సీసపుగనులను దెఱచెను. కలప వర్తకమును జేసెను. తీఱికవేళలందు ప్రభుసంఘమునుఁజేరి శాస్త్రచర్చలు సలుపుచుండెను. ఆసంఘమునకు విశేషముగా ధనసాహాయ్యమునుఁ జేసెను. అతఁడు తన కొడుకులకు విశేషభాగ్యమును గూడపెట్టి పోయెను. వాని కొడుకులలో మొదటివాఁడు షెల్బెరను జమీనుకు ప్రభువయ్యెను. వాని మరణశాసన మతిచిత్రముగా నుండెను. ఆమరణశాసనమునందు వాని జీవితములోని ముఖ్యాంశములు పేర్కొనఁబడెను. వానివైభవ మెట్లభివృద్ధి కాంచెనో యావిధ మందుఁ గానఁబడుచుండును.

దారిద్ర్యమును గూర్చి యీతని యభిప్రాయములు న్యాయయుక్తము లైనవిగా నున్నవి. బీదలకు మరణకాలమునందు దానశాసనము లిచ్చుటను గూర్చి యాతఁ డిట్లు చెప్పెను. 'నేను దూరముగ నిలుచుండియున్నాను; బీదలకు నే నేమియు నీయలేను; అసమర్థులయినవారిని ప్రజలు సంరక్షింపవలెను. ఆస్తియు వృత్తియు లేనివారలను బంధువర్గము పోషింపవలెను; అందుచేతనే బీదలగు నాబంధువు లందఱకుఁ దోడ్పడితినని తృప్తి నొందుచున్నాను; అనేకులకు బ్రదుకుతెరువును జూపించితిని; క్రొత్తవిషయములను గనిపెట్టి దాతృత్వమున కనుకూలమయిన వానిని వెదకితిని. ఆపత్కాలమందు నావలెనే బంధువులకు తోడుచూపవలయునని నాసొత్తు ననుభవింపఁ బోవువారి కిందుమూలముగాఁ బ్రార్థించుచు నానవెట్టుచున్నాను." అని పలికెను. తా నే పట్టణమునందు బీదవానికిఁ గుమారుఁడై జనించెనో యట్టి రామ్సేపట్టణమునందే యొకసొగసయిన పురాతనపు నార్మనుగుడియందు పాతిపెట్టఁబడెను. గాయకుల సమూహమునకు దక్షిణభాగమున నున్న నొక్కచదునైన చాపఱాయిపైని "ఇచ్చట సర్ విల్లియమ్ పెట్టీ పరుండియున్నాఁడు" అని యొకచదువురాని పనివానిచేఁ జెక్కఁబడిన శాసనము గలదు.

నూత్నవస్తుకల్పనము వలనను వాణిజ్యముచేతను పెంపుగాంచిన వంశము వేఱొక్కటిగలదు. అయ్యది బెల్పరు పట్టణములోని స్ట్రిట్టువంశముగా నున్న ది. ఆవంశమునకు మూలపురుషుఁ డగుజెడీడయ్యా అనువాతఁడు 1758 వ సంవత్సరమునందు పట్టీల మేజోళ్లు చేయునట్టి యంత్రము నొకదానిఁ గనిపెట్టి ప్రసిద్ధుఁడై విశేష ధనమార్జించెను. వాని తరువాత వానిపేరు వహించిన వా రెల్ల వాని యుద్దేశమును బలపఱచి వాని యైశ్వర్యమునుఁ బెంపుచేసి యుప యోగకారి యగునట్లు గావించిరి. జెడీడయ్యా తండ్రి వ్యవసాయకుఁడుగా నుండి బిడ్డల విద్యాభివృద్ధికై కృషి చేసియుండలేదు. అయినను వారెల్లరు నభివృద్ధిఁగాంచిరి. తనతండ్రికి జెడీడయ్యా ద్వితీయపుత్రుఁడు. పొలములోఁ దండ్రికిఁ దోడ్పడుచుండువాఁడు. అతఁడు బాల్యమునందె యంత్రగతిశాస్త్ర మునం దభిమానము గలవాఁడై యా కాలమునందలి వ్యవసాయమున కుపయో గించు మోటుపనిముట్లను బాగుపఱచి యధికోపయోగకరము లగునట్లుగాఁ గావించెను. తన పెదతండ్రి చనిపోయినతరువాత నార్మాంటను మండలములోని బ్లాకువెల్లనుచోటఁగల పొలమును వశపఱచుకొనియెను. తరువాత డెర్బిలో నిజారులు మేజోళ్లు మొదలగువాని నమ్మునట్టి యొకవర్తకుని కొమార్తెను బెండ్లి చేసికొనియెను. పట్టీలమేజోళ్లుచేయుట కనేక ప్రయత్నములు చేయఁబడి వ్యర్థములయి పోయినవని తన బావమఱఁదిచే విని యెవ్వరెవ్వరెట్టి ప్రయత్న ములు చేసి కృతార్థులు గాకపోయిరో వాని నెల్ల గ్రహింపవలయునని కృషి చేసెను. అందుకు వలసిన యుపకరణములను సమకూర్చుకొని క్రొత్తమాదిరులు కనిపెట్టి మేజోళ్లు మొదలగువాని నల్లెడునూత్నయంత్రము నభివృద్ధికిఁ దెచ్చి యా వ్యాపారమునందు సుప్రసిద్ధుఁ డయ్యెను. ఆ యంత్రమును దరువాత డెర్బీ పట్టణమునకుఁ గొనివచ్చి యచ్చట ననేకవిధము లగుపట్టీల మేజోళ్లు చేసి విక్రయించుచు విశేషధన మార్జించెను. పిమ్మట ఆర్కురైటు అను వాని తోడ భాగస్వామిగాఁ జేరి డెర్బిషైరులోని క్రాన్ఫర్డు నగరమున దూదియంత్ర

శాల నొకదాని స్థాపించెను. ఆర్క్‌రైటుతో భాగము విడిపోయిన తరువాత స్ట్రెట్టు కుటుంబమువారు మిల్‌ఫోర్డులో నూదియంత్రములఁ జెక్కెంటిని స్థాపించిరి. తండ్రివలెనే కొడుకులును యంత్రగతిశాస్త్రమునందు నేర్పరులై యుండిరి. జెడీడయ్యా పెద్దకొడుకగు విల్లియ మనువాఁడు తనంతట నడుచు కంచరగాడిద యంత్రమును గని పెట్టెను. విల్లియముకొడుకగు ఎడ్వర్డు యంత్రశాస్త్రజ్ఞానము విశేషముగాఁ గలిగియున్నవాఁడు గావున బండ్లకు త్రేలాడు చక్రములను గని పెట్టెను. ఈ స్ట్రెట్టుకుటుంబములోనివా రెల్లఁ దమధనమును సద్వినియోగమునకుఁ దెచ్చుచుండిరి. తమ యంత్రశాలలోఁ బనిచేయు పనివాండ్ర స్థితిని జక్కఁజేయుటకై తోడ్పడి ఖ్యాతిఁగాంచిరి. ఏ సత్కార్య మెవ్వరు తలపెట్టినను విరివిగా ధనసాహాయ్యమును జేయుచు సర్వవిధములఁ దోడ్పడుచుండిరి. జోసెఫ్ స్ట్రెట్టు డెర్బీలో నొకసొగసయిన యారామమును నిర్మించి పౌరజనులకు దానము చేసెను. ఆయారామము నొసంగునపు డాతఁ డీవిధముగాఁ జెప్పెను. నాజీవితకాలమున సూర్యుఁడు నామీఁదఁ బ్రకాశించుచుండెను. ఎవరిపాటువలన నేను సాహాయ్యమును బొంది యిట్టియభివృద్ధిఁ గాంచితినో, ఎవరిమధ్యను నేను నివసించుచుంటినో, అట్టివారి క్షేమాభివృద్ధులకొఱకు నాయైశ్వర్యములోఁ గొంతభాగము వినియోగింపకుండుట నా కృతఘ్నతను దెలుపునుగదా యనిపలికెను.

వర్తమానకాలమున నేమి భూతకాలమున నేమి ధైర్యశాలు రయినపురుషు లనేకులు తమశక్తులను జూపి పాటుపడి నేలమీఁదను సముద్రముమీఁదను నసమానపరాక్రమమును జూపి జమీందారులైరి. యుద్ధమున నిర్వక్రపరాక్రమమును జూపి ప్రభుస్థానములం బడసిన వెల్లింగ్టన్, హార్డింజి, క్లైవు మొదలగు పూర్వపు ప్రభువులమాట నటుండనిచ్చినను నూతనముగా ప్రభుస్థానములకు వచ్చినవారలలో ననేకులు శాస్త్రము లభ్యసించి న్యాయవాదులై విశేషధన మార్జించినవారుగా నున్నారు. అట్టివారు డెబ్బది మందికంటె నెక్కువగా

నిప్పు డున్నారు. మాన్సుఫీల్డు, ఏర్స్కిన్, అనునిరువురు గొప్పకుటుంబములోని
వారు. అయినను ఎర్స్కిన్ తన కుటుంబములో నొక్క ప్రభువయినను జనింప
కుండినందులకు భగవంతునకు వందనము చేయుచున్నాఁడ ననిపలుకుచుండెను.
మాన్సుఫీల్డుయొక్క పూర్వికులు బీదవారుగాను పలుకుబడి లేనివారుగా
నుండిరి.

ఇతఁడు బాలుఁడుగా నుండినపుడు స్కాట్లాండునుండి లండనునగర
మునకు నొక చిన్నగుఱ్ఱము మీఁదనెక్కి రెండునెలలు ప్రయాణముచేసి
వచ్చెను. ఇతఁడు దేశ భాషాపాఠశాలయందును శాస్త్రపాఠశాల యందును
విద్యాభ్యాసము చేసి న్యాయవాది వృత్తియందుఁ బ్రవేశించి పిమ్మట
ఇంగ్లాండునకుఁ బ్రధానన్యాయాధిపతియై యధిక ప్రఖ్యాతుఁ డయ్యెను. ప్రభు
స్థానమునకు వచ్చినవారిలో నితరులు వర్తకులయొక్కయు, మతాచా
ర్యులయొక్కయు, చిల్లరదుకాణదారుల యొక్కయు, పశువాదుల యొక్క
యు, విశేషకృషిచేయునట్టి నడిమితరగతివారియొక్కయు, బిడ్డలుగా నుం
డిరి. ఈవృత్తిగల వారినుండి హోవార్డు, కావెండిస్సు సంస్థానము లేర్పడి
నవి. ఈసంస్థానాధిపతులకు మూలపురుషులు న్యాయాధిపతులుగా నుండిరి.
ఎల్సుఫోర్డు, ఎల్లెంబరో, గిల్డుఫోర్డు, షాఫ్ట్సుబరీ, హార్డ్విక్కు, కార్డిగాన్,
క్లారెండన్, కామ్డెన్, ఎల్సుమీర్, రాస్లిన్, మాత్రమెగాక ప్రస్తుతకాలము
నందలి కెంటర్డను, ఎల్డను, బ్రోహామ్, డెన్మాన్, ట్రూరో, లింఘర్స్ట్,
లియొనార్డ్సు, క్రాన్వర్తు, కాంబెల్, చెమ్సుఫోర్డు మొదలగు జమీల స్థాప
కులుగూడ న్యాయాధిపతులుగ నుండిరి.

లింఘర్స్టుప్రభువు తండ్రి పటములకు రంగులు పూయువాఁడుగ నుం
డెను. లియోనార్డ్సు తండ్రి సువాసనద్రవ్యముల నత్తరువుల నమ్మువాఁడుగ
నుండెను. ఎంగు ఎడ్వర్డు సూగ్డె ననువాఁడు మొట్టమొదట పత్రములు మొద
లగువాని వ్రాయుటకు యోగ్యతా పత్రికఁ బడసిన గ్రూ మనువాని కార్య

స్థానమున జాబులు గొనిపోవు బాలుఁడుగా నుండెను. ఐర్లాండునకు ఛాన్సెలరు ప్రభువుగానుండిన యాతఁడాకార్యస్థానముననున్న కాలముననే న్యాయశాస్త్రముయొక్క ప్రాథమికజ్ఞానమునుబొందెను. టెంటర్డను ప్రభువు యొక్క ప్రథమదివసంబులు కడునిర్భాగ్యకరము లయినవిగా నున్నవి. అట్టి దుస్థితిని గుఱించి యాతఁడెన్నఁడును సిగ్గుపడి యుండలేదు. ఎందుచేతననఁ బాటువలనను, పఠనమువలనను, ప్రయోగకౌశల్యమువలనను, దా నట్టి యున్నతపదవికి వచ్చియుండెను. ఒకానొక సమయమునం దాతఁడు తన కొడుకగు చార్లెస్సనువానిని క్యాంటర్బరీ దేవాలయమున కెదుట నున్న యొకచిన్నకుటీరము కడకుం గొనిపోయి వానికి దానిం జూపి 'ఓచార్లెస్సా! ఈచిన్నయంగడిని జూడుము; దీనిం జూపించుటకే నేను నిన్నిచ్చటకుఁ దోడ్కొని వచ్చితిని; ఆయంగడిలోనే నీ తాతగారు పెన్నీ పుచ్చుకొని క్షౌరము చేయుచుండువాఁడు; అదియే నాజీవితములోఁ బరువుగల ప్రతిబింబముగా నున్న" దని పలికెను. టెంటర్డను ప్రభువు బాలుఁడుగా నుండినపుడు ప్రార్థనాలయములో గాయకుఁడుగా నుండెను. తనకుం గలిగిన యాశాభంగమువలన నాతని జీవితోద్దేశము మార్పుఁ జెందుట వింతయైన సంగతిగా నున్నయది. టెంటర్డను ప్రభువవలెనే ఇంగ్లాండునకు ముఖ్యన్యాయాధిపతులుగా వచ్చిన పెడసరియైన కెన్యోన్ ప్రభువు యొక్కయు వృషగాత్రుఁడయిన యెల్లెంబరో ప్రభువు యొక్కయు జీవితములు సుప్రఖ్యాతములయినవిగా నున్నవి. మఱియు నాయున్నతపదవికి వచ్చిన క్యాంబెల్ ప్రభువును వారల కేవిషయమునను దీసిపోవువాఁడు కాఁడు. ఇతఁడు బహుసంవత్సరములు వార్తాపత్రికలకు సమాచారములు దెలియఁజేయు వృత్తియం దుండెను. ఆపనియందుండినపుడె న్యాయశాస్త్రపఠనముఁ జేయుచు న్యాయవాది వృత్తికై కృషిచేసి యుండెను. అతఁడు మొట్టమొదట మిక్కిలి కష్టదశయం దుండినను క్రమక్రమముగాఁ బాటుపడి తుద కత్యుత్కృష్టదశకు వచ్చినవాఁడయ్యెను.

ఎల్డను ప్రభువుయొక్క జీవితముగూడ మనముజ్ఞాపక ముంచుకొనవల
సిన దృష్టాంతములలోనొకటిగా నున్నయది. అతఁడు న్యూకాసిల్ పట్టణము
నబొగ్గు సిద్ధముచేయు వానియొక్క పుత్త్రుఁడుగా నుండెను. అతఁడు శ్రమ
పడి పాఠములు వల్లించుటకు మాఱుగాఁ గొంటెవాఁడై చెడుపనులు చేయు
వాఁడుగ నుండెను. ఒకప్పుడింగ్లాండునకు చాన్సెలరు ప్రభువుగానుండిన
యీతఁడు పాఠశాలయందుఁ జదువునప్పుడతి దుర్మార్గుఁడుగానుండి భయం
కరములగు కొట్లాటలయందుఁ బ్రసిద్ధుఁడైయుండెను. తోఁట దొంగతనము
నం దాఱితేఱినవాఁడై యుండెను. వీనితండ్రి తొలుదొల్త కాఫీ, తేయాకు
మొదలగు చిల్లరసరకులమ్మువాని దుకాణములో నప్పగింపఁదలంచెను గాని
తరువాతఁ దానుజేయు బొగ్గుపనియందే ప్రవేశపెట్టుటకు నిశ్చయించుకొనెను.
అప్పటికి నలనికొమారుఁడైన విల్లియము (స్టోవెల్లుప్రభువు) ఆక్సుఫోర్డుపట్టణ
మున విద్యార్థివేతనమును బొందియున్న వాఁడుగావునఁ దనతండ్రికి "జానును
నావద్దకుఁ బంపవలసినది; వానికి నేను మంచితెరవును జూపఁగలను." అని
జాబువ్రాసెను. ఆప్రకారము తండ్రితనరెండవ కొమారుఁడైన యీజానును
ఆక్సుఫోర్డునకుఁ బంపించెను. అచ్చటనాతఁడు తనసోదరునియొక్క పలుకుబడి
నిబట్టియు, తనకుంగల శ్రద్ధనుబట్టియు సాంగత్యమును సంపాదింపఁగలిగెను.
సెలవుదినములలో నింటికడనుండినపుడు దురదృష్టముచలన (దురదృష్టమనియే
చెప్పవలయును) నొకస్త్రీనిమోహించి యామెను దగుల్కొని దేశమువిడిచి
పాఱిపోయి వివాహముచేసికొనియెను. ఇంక నాతఁడు బాగుపడఁడని వాని
బంధుమిత్త్రాదులెల్లరునుఁ దలంచిరి. అతఁడు వివాహము చేసికొనునప్పటికి
నిల్లుగాని వాకిలిగాని లేక యుండెను. అప్పటికినొక్క పెన్నీయైన సంపా
దించియుండలేదు. అదివఱకు తనకుంగల పనిసహితముఁ బోఁగొట్టుకొనెను.
అందువలన నాతనిమనస్సు న్యాయశాస్త్రపఠనమునకై మరలెను. "నేను తొం
దరపడి వివాహముచేసికొన్నాను; నేనుప్రేమించినస్త్రీయొక్క సంరక్షణా
ర్థము బహుకష్టపడి పనిచేయవలెనని నా నిశ్చయము." అనిజాను తన మిత్త్రు
నికి జాబువ్రాసియుండెను.

జానుస్కాట్టు లండనునగరమునకువచ్చి కర్సిటరుసందులోని యొకచిన్న యిల్లుదీసికొని న్యాయశాస్త్ర మభ్యసించుచు నచ్చట నివసించియుండెను. జాగరూకతయు దృఢనిశ్చయమును గలిగి కృషిచేసెను. అతఁడు తెల్లవారుటకుఁ బూర్వము నాలుగుగంటలు వేసినతరువాత నిద్రనుండి మేల్కొనుచు రాత్రులు పొద్దుపోవువఱకు నిద్రకుఁబోక శ్రమపడి పనిచేసెను. నిద్రరాకుండుటకై తడితువాలు తలకుఁజుట్టుకొని చదువుకొనుచువచ్చెను. ఒకప్లీడరువద్ద జదువుకొనుటకు శక్తిలేనంత బీదవాఁ డయినందున లిఖితములయిన దృష్టాంతముల యొక్క మూఁడు గొప్పసంపుటములకు (కాగితములను రెండుగా మడచి కుట్టిన పుస్తకములు) ప్రతులు వ్రాసెను. చాలకాలమునకు నీతఁడు చాన్సెలరు ప్రభువయినతరువాత నొకప్పుడు కర్సిటరు సందుగుండా పోవునప్పుడు తనకార్యదర్శితో "ఇదియ నా చిన్న కుటీరము. చేపలను గొనుట కాఱుపెన్నీలు చేత బట్టుకొని యీవీధియందు పెక్కుమాఱులు దిరిగినటుల నా కిప్పటికిని జ్ఞాపకమున్న" దని చెప్పెను. న్యాయశాస్త్ర పరీక్షం గృతార్థుఁ డయినవెనుకఁ బనిలేక చాలకాల ముండెను. ప్రథమసంవత్సర మీతని యార్జనము తొమ్మిది షిల్లింగులు మాత్రమే యై యుండెను. నాలుగు సంవత్సరములు లండను కోర్టులలో (న్యాయస్థానములు) పనిచేసినను లాభకారిగాఁ గానిపించలేదు. ఏవిధమయినపనియు లభింపనందున నిరుత్సాహుఁడై లండను నగరమును విడిచి రాజధానిలోని మఱియేపట్టణమునకయినఁ బోవనిశ్చయించుకొనెను. లాయరుగానుండినను ప్రయోజనము గానరాకుండెను.

జానుస్కాట్టు న్యాయశాస్త్రమునఁ దనకుఁ గల ప్రజ్ఞావిశేషమును జూపుటకుఁదగిన సమయము రాఁ దటస్థించినది. ఒక వ్యాజ్యెములోఁ దన్నేర్పాటు గావించుకొనిన కక్షిదారుని కోర్కెకుఁ బ్రతికూలముగా న్యాయశాస్త్రాంశమును గుఱించి న్యాయాధిపతి యెదుటఁ జర్చించెను. కాని న్యాయాధిపతి వానికిఁ బ్రతికూలముగఁ దీర్పు చెప్పెను. తరువాత ప్రభుసభకు నప్పీలు

చేయఁబడెను. ధర్లో ప్రభువు స్కాట్టు పెట్టిన న్యాయశాస్త్రాంశమును జక్కఁగాఁ జర్చించి స్కాట్టు పక్షము తీర్పుచేసెను. అప్పటినుండి స్కాట్టుయొక్క ప్రఖ్యాతి దేశ మంతట వ్యాపించెను. అతని పనియు దినదినాభివృద్ధిఁ గాంచెను. ముప్పదిరెండు సంవత్సరముల వయస్సు వచ్చునప్పటికె రాజునకు కౌంసెల్ గా నేర్పాటు కాఁబడెను. క్రమక్రమముగాఁ దన కృషివలనను దెలివికలనను చాన్సెలరు పదవికి వచ్చెను. ఆపదవియం దిరువదిరైదు సంవత్సరము లుండెను.

'హెన్రిహిక్కర్ స్టైత్' అనునాతఁడు వెస్టుమోరులాండు మండలమున కర్కబై లాన్సుడే లనుగ్రామమునందలి యొక శస్త్రవైద్యుని కుమారుఁడుగా నుండెను. ఇతఁడు వైద్యశాస్త్రమభ్యసింపఁదలఁచి యెడింబరో పట్టణమునకువచ్చి మిక్కిలి శ్రద్ధాభక్తులతోఁ బాటుపడి యావిద్యయందుఁ బ్రవీణుండయ్యెను. ఇతఁడు తిరిగి తనస్వగ్రామమునకువచ్చి తనతండ్రిచేయుపని తానవలంబించి చులుకగా బనిచేసెనుగాని యాపనియందాతనికంతగా నిష్టము లేకపోయెను. అతఁడు శారీరశాస్త్రమునందు విశేషప్రజ్ఞానము సంపాదింపఁదలంచెను. కుమారుని యుద్దేశము కొనసాగింపఁ దలంచి కేంబ్రిడ్జి నగరమునకు నాతనిఁ బంపించెను. అతఁ డక్కడ వైద్యశాస్త్రమునందు గొప్పపరీక్షలం దేఱుటకై బహు కష్టపడి కృషిచేసెను. అట్లు చేసినందున దేహారోగ్యము చెడిపోయెను. హెన్రి దేహారోగ్యమును బడయుటకుఁగాను ఆక్సుఫోర్డు ప్రభువుతోడఁ బ్రయాణముల వైద్యుఁడుగా నుండి కూడఁ దిరుగుటకై యంగీకరించెను. ఈతఁడు విదేశయాత్ర చేయునపుడు ఇటాలియా భాషయం దభిమానము గలిగి యాభాష నభ్యసించెను. పూర్వమునందువలె వైద్యమునం బ్రేమ లేకుండుటయె గాక దాని విడనాడుటకై నిశ్చయించెను. అతఁడు కేంబ్రిడ్జికిఁ దిరిగివచ్చిన తరువాత శాస్త్రపట్టము నొందెను. సైన్యమునందుఁ బ్రవేశింపఁ దలంచి యాశాఖంగమును బొంది తుదకు న్యాయశాస్త్ర మభ్యసించెను. వైద్యశాస్త్రమునఁ బండితుఁడగుట కెట్లు శ్రమపడెనో న్యాయశాస్త్రవిషయమునఁగూడ నట్టిపాటు

పడెను. ఇరువదియెనిమిది సంవత్సరములు ప్రాయము వచ్చు నప్పటికి న్యాయ పరీక్షలం గృతార్థుఁ డయ్యెను. అప్పటికి నాతఁడు మిక్కిలి దైన్యస్థితియం దుండెను. మిత్రులసాహాయ్యమువలనఁ బోషించుకొనుచుండెను. పనిలేక మూఁడు సంవత్సరము లమితకష్టముల నొందెను. ప్రాణము విసుగుఁ జెందెను. అనంతరము క్రమక్రమముగాఁ బనులు రాఁదటస్థించెను. స్వల్పవిషయములం జేసిన కృషి ఫలింపఁగాఁ బ్రఖ్యాతి యంతట వ్యాపింప నారంభించెను. కొలఁది కాలములోనే తాను జేసిన ఋణము లన్నిటిని దీర్పఁగలిగెను. మబ్బు విడిపోయిన ట్లాతనిఁ జుట్టుకొనియున్న దారిద్ర్యము విడిచిపోయిన తోడనే సుప్రసిద్ధమయిన కీర్తినిఁ గాంచెను. న్యాయాధిపతియై ప్రభు సభలోఁ గూరుచుండఁ గలిగెను. లాంగుడేలునకు బేరను (జమీందారుఁడు) గాఁ గలిగెను. ఇతఁడు తనకుంగల యోరిమివలనను, పట్టుదలవలనను, నిరంతర పరిశ్రమమువలనను, ఇట్టి యున్నతపదవికి వచ్చియుండెను.

ఈప్రకారముగా బీద లనేకులు బాల్యమునందు దారిద్ర్యముచేత బహుకష్టము లనుభవించి (కూటికి గుడ్డకు సహితము మొగమువాచి) తమ ప్రజ్ఞావిశేషమువలనను నిరంతరకృషివలనను నున్నతపదవులకు వచ్చి జమీందారులై పార్లమెంటులోని ప్రభు సభలో సభ్యులై దేశమునకు మహోపకారులై బ్రిటీషు రాజ్యమున కంగరక్షకులై యశమును గాంచియుండిరి.

---



# తొమ్మిదవ ప్రకరణము.

---

## పరిశ్రమాధికులు—నూతనకల్పన కారులు.

ఆంగ్లేయమహాజనులయొక్క పూర్వచరిత్రమును బరిశీలింతుమేని వారలకుఁగల గుణములలో మనము గుర్తింపఁగలుగునట్టి ప్రధానగుణముపాటునందుండినయుత్సాహమేయని స్పష్టముగా విశదమగుచున్నది. ఈగుణము పూర్వకాలమున మాత్రమేగాక యిక్కాలమునందును గానిపించుచున్నయది. ఆంగ్లేయప్రజలవలనఁ గనుపఱుపఁబడిన యిట్టియుత్సాహమే రాష్ట్రముయొక్క పునాదిని దిట్టపఱచి పరిశ్రమకర్మముల నభివృద్ధిఁబొందింపఁగలిగినది. దేశముయొక్క వీర్యవంతమైన యిట్టియభివృద్ధియే సామాన్యజనులు ప్రత్యేకముగాఁ జూపిన స్వేచ్ఛాశక్తియొక్క ఫలముగా నున్నయది. ఇంతటియభివృద్ధి యొక కాలమునఁ గలిగినదిగాదు. ఒకనివలనగలిగినదికాదు. నేలనుదున్ని ఫలింపఁజేయు కర్షకులు, గృహోపయోగ వస్తుకల్పనకారులు, యంత్రనిర్మాతలు,గ్రంథకర్తలు, నానావిధ శిల్పవిద్యానిపుణులు,మొదలగువారా యాకాలములందుఁ జూపిన పరిశ్రమోత్సాహమే యింగ్లాండుదేశము నింతటి యున్నతస్థితికిఁ దీసికొనివచ్చినది. చురుకయిన యీపాటునందలి యీయుత్సాహము దేశమునకు జీవశక్తినిచ్చుటకు మూలకారణముగా నుండుటమాత్రమెగాక వారిసంఘములోగాని, సంఘమువారివలన నేర్పాటుకాఁబడిన చట్టములలోఁగాని యుండిన దోషముల నాయాకాలములందుఁ గ్రమక్రమముగా మార్చుకొని సంరక్షించుకొనుటకు సిద్ధౌషధముగానున్నది.

దేశీయులుచూపిన యీకృషిచర్యయె దేశమునకుఁ జక్కనివిద్యగాఁ బరిణమించినది. నిశ్చలమైన పరిశ్రమప్రయోగమే ప్రతిమనుష్యునకును సుఖకరమైన విద్యాభ్యాసముగా నుండును. క్రమమైన పాటు ధర్మమేప్రక్కను నడుచునో యాప్రక్కను బోవుచుండును. భగవంతుఁ డారెంటితో సౌఖ్యమును బంధించియున్నాఁడు. దేవతలు పాటుపడువారిని స్వర్గభూములకుఁ గొనిపోవుదురని కవులు వర్ణించియున్నారు. దేహపరిశ్రమమువలననైననేమి మనోపరిశ్రమమువలననైననేమి స్వయంకృషివలనసంపాదించిన యాహారమంతరుచ్యముగా నితరవిధముగా లభించినయాహారము రుచ్యముగానుండ దనుటసత్యము. అనఁగా నీవిధమయినయానందమున కావిధమైనయానందము సాటువగాదు. పాటువలనభూమి జయింపఁబడినది. పాటువలనమనుష్యుఁడు నాగరికతనుండి విమోచనముపొందినవాఁడు. పాటులేనిదే నాగరికత యొక్కయంగుళము ముందుకునడువలేదు. పాటుపడుటావశ్యకమును ధర్మమునుమాత్రమేగాక వరమని కూడఁజెప్పవలయును. సోమరికిపాటు శాపముగాఁగానిపించును. పాటును గూర్చిన ధర్మము దేహముయొక్క నరములయందును మాంసపుకండలయందును చేతియంత్రమునందును మెదడుయొక్క నరములయందును వృత్తములయందును వ్రాయఁబడియున్నది. వానియొక్కక్రమవృత్తమె తృప్తిని సంతోషమును గలిగించును.కృషిపాఠశాలయందే యనుభవనీయమైన జ్ఞానము బోధింపఁబడును.

పాటులోనుండు కష్టసుఖములను హ్యూమిల్లరనువానికంటె నధికముగాఁ దెలిసికొన్నవారులేరు. ఎంతకష్టముతోఁగూడుకొన్నదియైనను పాటు సంతోషముతోను స్వీయాభివృద్ధికిఁ గావలసిన యుపకరణములతోను నిండియుండునని స్వానుభవముయొక్క ఫలమును దెలిపియున్నాఁడు. బోధకులలో నెల్ల మాననీయమైనపాటు మంచిబోధకుఁడనియు పాఠశాలలలో నెల్లఁబరిశ్రమపాఠశాలయె ఘనమైన పాఠశాలయనియు నాతండభిప్రాయమును బొందియుండెను. ఈపాఠశాలయందు నుపయోగకరమయినది నేర్పఁబడును స్వాతం

త్న్యమునందలి యుత్సాహము గలుపఁబడును. ఇచ్చట నే యోరిమితోఁ బరిశ్రమ చేయునట్టి సద్గుణ మలవడును. పనివాఁడుపొందెడు శిక్షయె జీవయాత్రనడు పుటకు మార్గము నేర్పఱచుకొనుటకు యుక్తమయినవానిగాఁజేయునని యు ప్రతిదినానుభవమువలన నాత్మీయశక్తులు వికసించునని యు మనుష్యుఁడనిపించు కొనుటకే స్థితివలన సాధ్యముకానిది యీశిక్షవలన సాధ్యమగునని యు నాతం డభిప్రాయమునుగలిగి యుండెను. ప్రకృతిశాస్త్రము, వాణిజ్యము, భాష, శిల్పము మొదలగువారియందుఁ బేరుపడినట్టియు సకాయకష్టకర్మలవలన జీ వించు తెగలలోనుండి యున్నత పదవులకువచ్చినట్టియు, ఇదివఱకందందు నుదాహరణములుగా నిచ్చిన గొప్పవారియొక్క నామములవ్యూహమును బరి శీలించితిమేని దారిద్ర్యమువలనను పాటువలనను గలిగెడుకష్టము లన్నియుఁ గ్రమముగా నివారింపఁబడఁగలవని తేట తెల్లముగాఁగలదు. ఏఘనసాధన ములు, నూత్నకల్పనములు దేశమునకు నైశ్వర్యమును శక్తినికలిగించినవో యయ్యవి విశేషముగా బీదలగువారి ప్రయత్నములవలననే సంభవించెనని నిశ్శం కముగాఁ జెప్పవచ్చును. ఈకృషి వ్యాపారములనుండి వారలుచేసినపనిని మనముతగ్గించితిమేని తదితరులు నిర్వహించినది మిక్కిలి స్వల్పముగ మిగిలి యుండును.

నూత్నవస్తు కల్పనకారులు ప్రపంచములోని సకాయకష్టకర్మల నున్న తస్థితికి గొనివచ్చియున్నారు. వారలు సంఘమున కత్యావశ్యకములయిన వానిని, సౌఖ్యదాయకములయినవానిని, భోగకరములయినవానిని గల్పించి యున్నారు. వారిబుద్ధివలనను పాటువలనను దినచర్యసులభమైనదిగాను సం తోషదాయకమైనదిగాను జేయఁబడినది. మనభుజించునాహారము, మనము ధరించువస్త్రములు, మనగృహోపకరణములు, మన నివాసములకు చలినిబాపి వెలుతురునిచ్చునట్టి యద్దములు, మనవీధులఁ బ్రకాశింపఁ జేయునట్టివాయువు, (Gas) భూమిమీఁదను సముద్రముమీఁదను ప్రయాణమున కుపయోగకర

ములయిన వాహనములు, ఆవశ్యకములును భోగకరములు నగువస్తుసముదాయ మును మొదలగునవి యనేకబుద్ధిశాలురయొక్క నిరంతరకృషిమూలమున మన కులభించినవి. అట్టివారి నూత్నవస్తుకల్పనమువలన మానవకోటి నేఁడత్యంత సౌఖ్యమును సంతోషమును బొందుచున్నయది.

ధూమయంత్రము నూతనముగా మనకాలమునందే కనిపెట్టఁబడినను దాని నింగూర్చిన భావ మనేకశతాబ్దములక్రిందటనె యుదయించినది. ఇతరవస్తు కల్పనమువలెనె యదియు నొకప్పుడుగాక యొక్కరివలనగాక వేర్వేఱు కాల ములయందు వేర్వేఱుమనుష్యులచేతఁ బ్రయత్నింపఁపడి సాధింపఁబడి నేఁడు ప్రయోగింపఁబడుచున్నది. ఇట్టియభిప్రాయము అలెగ్జాండ్రియాపట్టణములోని హీరోయనువానికిఁబొడగట్టినది. కాని పిడికిటనున్న వడ్లగింజవలె నింత దనుక మాటుపడియుండెనుగాని ప్రకృతిశాస్త్రముయొక్క తేజస్సు వ్యా పించినతరువాత బయలఁబడినది. ధూమయంత్ర మట్లుండవలెనని చెప్పఁ గొనుకాలముపోయి 'ధూమయంత్రమిదిగో' యని కండ్లఁజూచుకాలము వచ్చు నంతకు నిరూఢముగానుండెను. ఎట్టియాలోచనముతోడ నెంతకాలమెంతెంత కష్టపడి యోరిమితోఁబనిచేసిన నట్టియంత్రముసృజింపఁబడినదో ధూమయంత్ర మునుజూచినవారికి బోధపడకమానదు. అది నిశ్చయముగా మనుజుని స్వయం కృషియొక్క శక్తిని దెలుపుచు జ్ఞాపకార్థముగా కట్టినకట్టడమువలెనున్నది. ఆయంత్రమునకు సంబంధించినవారలను ప్రసిద్ధయంత్రకారులగు సావేరి, న్యూ కోమన్, కాలే, పోట్టరు స్మీటన్, మొదలగు వారినిజెప్పవలసియున్నను, ఓరి మిగలట్టియును, నిరంతరకృషిచేయుచు నలయకుండునట్టియు, ప్రసిద్ధగణిత శాస్త్రోపకరణకారుఁడయినట్టియు, జేమ్సు వాట్టనువానిని ముఖ్యముగాఁ జెప్పవలసియున్నది.

మిక్కిలిపాటుపడిన మనుష్యులలో వాట్టనువాఁడొకఁడు. కృషియం దు గొప్పఫలితమును గాంచువారు స్వభావసిద్ధమయిన మహాబల సామర్థ్య

ములుగలవారుగాక, పాటువలన గలుగునట్టి చాతుర్యముతోఁ గూడుకొనిన శక్తులను జాగ్రత్తగా నుపయోగించువారుమాత్రమే గాంచఁగలరని యావాట్టు యొక్క చరిత్రము వేనోళ్లఁజాటుచున్న యది. ఆకాలములో వాట్టుకన్న నెక్కు వచదువుకొన్నవారుజ్ఞానులు పెక్కండ్రుకలరుగాని వాట్టువలెఁ దాము నేర్చిన విద్య స్వాచరణమునఁజూపినవారుమాత్ర మల్పసంఖ్య కలవారుగానున్నారు. అతఁడు దనకుఁగల మానసికశక్తులనన్నిటిని వినియోగించి మిక్కిలిజాగరూకతతోఁ బరిశ్రమముచేసెను.

వాట్టు పిల్లవాఁడుగ నుండినపుడు సహితము నాటబొమ్మలయందు ప్రకృతిశాస్త్రమును గనుగొనెను. తనతండ్రియొక్క వడ్రపంగడిలోఁబడియున్న వర్తులములో నాలుగవభాగము గలిగినపలకలు (Quadrants) వాట్టును దృక్శాస్త్రమును ఖగోళశాస్త్రము నభ్యసించునటులఁజేసెను. ఆతనియనారోగ్య స్థితియే శారీరశాస్త్రములోని మర్మముల గ్రహించునటులఁజేసెను. దేశములో నొంటరిగఁజేసిన ప్రయాణములె వృక్షశాస్త్రమును దేశచరిత్రము నభ్యసించునటులఁచేసెను. గణితశాస్త్రసంబంధమయిన యుపకరణమును జేయునపుడె యొకపనిముట్టును జేయుట కుత్తరవునొందెను. సంగీతమునందుఁ బ్రవేశము లేకపోయినను సంగీతశాస్త్ర మభ్యసించి సంగీతయంత్రమును గనిపెట్టెను. అదేవిధముగా గ్లాస్గోకలాశాలకు సంబంధించిన చిన్నమాదిరిన్యూకోమన్ ధూమయంత్రమును బాగుచేయుటకై యీతనియధీనము చేయఁబడినపుడు ఉష్ణమును గూర్చియు, ఆవిరిగాయై యెగసిపోవుటనుగూర్చియు నాతఁడు నేర్చుకొనెను. ఆసమయమునందె యంత్రగతిశాస్త్రమును నిర్మాణశాస్త్రమును నభ్యసించుటకై బహుకష్టమును బొంది కృషిచేసి తత్ప్రయత్నఫలితముల ఘనీభవింపఁజేయునట్టితనధూమయంత్రమునందు మూర్తీభవించునటులఁజేసెను.

ధైర్యపఱచువారును, ప్రోత్సహించువారునులేక నూత్నకల్పనలయందుఁ బదిసంవత్సరములకాలముగడపెను. ఈకాలమునఁ గుటుంబసంరక్షణా

ర్థము పిడిలులు, సారంగులు, పిల్లనగ్రోవులు మొదలగు సంగీతపుపనిముట్లను జేయుచునమ్మిచు, తాపిపనులను ఊతిపనులను గొలుచుచు, బాటలనుసర్వే చేయుచు, కాలువలుద్రవ్వించుచు, జీవయాత్రనుగడ పెను. తుదకువాట్టు దూర దృష్టిగలవాఁడును, శక్తిగలవాఁడును, నేర్పరియు, బర్మింగుహాము నగరవాసి యునగు మాథ్యూబోల్టనను వానితోడ భాగస్వామియై ఆవిరిని సంక్షోభవింపఁ జేయు యంత్రమునుగని పెట్టినవిషయము చరిత్రమునందు సుప్రసిద్ధమై యొప్పుచున్నయది.

నేర్పరులయిన కల్పనకారు లనేకు లప్పటప్పట ధూమయంత్రమునకు నూత్నశక్తిని గలుగఁజేయుచు వచ్చిరి. ఓడలు నడుపుటకును, ధాన్యము దంపుటకును, పుస్తకములు ముద్రింపించుటకును, నాణెములముద్రింపించుటకును, నీయంత్రము సహాయకారి యయ్యెను. ఏవిధమైనపనియైనను నీయావిరియంత్రసహాయమున నెఱవేర్పఁబడునటులఁజేసిరి. ఈయంత్రమునఁ గొన్ని మార్పులనుజేసి మొదట ట్రెవితిక్కుపోగబండి నడపుటకుఁ బ్రయత్నించెను. తరువాత జార్జిస్టీవెన్సను వానికుమారుఁడు దానినున్నతస్థితికిఁ గొనివచ్చి యినుపపట్టెలమీద బండ్లునడిపించిరి. అందువలన దేశమునం దనేకము లయినమార్పులు గలిగి నాగరికము హెచ్చినది. వాట్టుకనిపెట్టిన యాయావిరియంత్రమువలన మొదట ప్రత్తి వ్యాపార మభివృద్ధిఁ గాంచినది. ఆవిరియంత్రసహాయమున నీప్రత్తివ్యాపారములోఁగూడిన పనులుచేయుటయందు కృషిచేసి విజయముగాంచిన వాఁడు సర్ రిచార్డు ఆర్కురైటనువాఁడుగా నుండెను. ఆవిరియంత్రమును వాట్టును, రైలుయంత్రమును స్టీవెన్సను కనుగొనిన రీతిని ప్రత్తిపడకుయంత్రమును ఆర్కురైటు కనుఁగొనెను. ఈతఁడు యంత్రసహాయమువలన చిందరవందరగానుండు దారములను పోగుచేసి తా నేర్పరచుకొన్న పద్ధతి ప్రకారము వస్త్రముల నేసెను. ఆర్కురైటునకుఁ బూర్వము ముప్పదిసంవత్సరముల క్రిందట బర్మింగుహాము నగర వాసియగు లూయీపాలను నాతఁ డీవిధముగాఁ బ్రయత్నించి పని

చేసినను వీనివలె విజయమును బొందియుండలేదు. ఇంక మఱికొందఱు చేసిన ప్రయత్నములు సహితము విఫలములై వ్యర్థములయ్యెను. నూత్నకల్పనములు చేయవలెనని బహువిషయములయందు బుద్ధిశాలు లనేకు లనేకవిధములుగాఁ బ్రయత్నించి తమబుద్ధివిశేషములను జూపిన ననుభవజ్ఞులుపొడసూపి వానిని సాధించి ప్రసిద్ధికెక్కిరి. అట్టి వారిలో వాట్టు, స్టీవెన్సను, ఆర్కురైటు మొదలగు వారు ముఖ్యులు.

తదితర ప్రసిద్ధయంత్రశాస్త్రజ్ఞులవలెనె రిచార్డు తక్కువ తరగతిలో నుండి యున్నతస్థితికి వచ్చెను. 1732-వ సంవత్సరమున ప్రెస్టనుగ్రామమున జనించెను. వాని తల్లిదండ్రులు మిక్కిలి బీదవారు. పదుమూవురు బిడ్డలలో నితఁడే కడపటివాఁడుగా నుండెను. ఇతఁ డెప్పుడును బాఠశాలకుఁ బోయి యుండలేదు. బహుకష్టముతో చేవ్రాలు చేయఁదగినంత విద్యనుమాత్రమే పొందెను. పిల్లవాఁడుగా నుండినపుడొక మంగలివానివద్ద క్షౌరముచేయు పని నభ్యసించెను. ఆపని నేర్చుకొని బోల్టనుగ్రామమునకుఁ బోయి భూమిక్రింద గదిలో నివసించి దాని ముఖద్వారమున "భూమిక్రింది మంగలివాని కడకు రండు; వాఁడొక పెన్నీకి క్షౌరముచేయు"నని తెలుపువాక్యములు వ్రాయఁబడిన యొకబల్ల కట్టెను. ఎల్లవారును దమ్మునువదలి ఆర్కురైటువద్దకుఁ బోయి తలలు గొఱిగించు కొనుచుండుటను జూచి మంగలివాండ్రు కూలి తగ్గించిరి. దీనిఁ గనిపెట్టి తనవ్యాపారమును వృద్ధిఁబొందింపనెంచి అరపెన్నీకె క్షౌరముచేయుటకు మొదలుపెట్టెను. కొన్నిసంవత్సరము లయిన తరువాత నావ్యాపారమును విడిచి దేశసంచారియై వెండ్రుకల వర్తకము మొదలు పెట్టెను. ఆకాలమునందు వెండ్రుకలతో నలంకరింపఁబడిన కుళ్లాయలు ధరింపఁబడు చుండెను. అట్టి కుళ్లాయలు చేయునట్టి పని మంగలివాండ్రకు ప్రధానమైనదిగా నుండెను. కుళ్ళాయలకొఱకు వెండ్రుకలను కొనుచుండెను. పొడవు లయిన కొప్పులను సేకరించుటకొఱకు చిన్నపడుచులచే నాశ్రయింపఁబడి

యున్న లంకాషియరుమండలములోని అద్దెసంతలకుఁబోవుట కాతఁడలవాటు పడియుండెను. అద్దెల నేర్పాటుచేసి కుళ్లాయ లిప్పించు పనియందు మిక్కిలి విజయమును బొందుచువచ్చెను. ఇతఁడు చమత్కారముగా వెండ్రుకలకు పూయునట్టి రంగును సిద్ధముచేసి యావ్యాపారము నభివృద్ధి పొందించెను. అయినప్పటికిని తనజీవనమునకుఁ జాలిన దానికంటె నెక్కువగా సంపాదింపఁ గలిగినట్టి పనియేమియు నప్పటికిఁ జేసియున్నట్టు గానిపించదు.

కుళ్లాయలను ధరించువిధము మాఱిపోయినందున నా వ్యాపారముఁ జేయువాండ్రకు నష్టము సంభవించెను. ఆర్కురైటు యంత్రశాస్త్రజ్ఞానము గలవాఁడు గావున నూత్న యంత్రము నొకదానిఁ గల్పనము చేయవలెనని తలంచెను. ఆకాలమునందు నూలువడికెడు యంత్రమును గల్పింపవలెనని బహు ప్రయత్నములు చేయఁబడినవి. మిగిలిన వారితోఁబాటు మన మంగలియుఁ గొంత ప్రయత్నించెను. తనవంటి బుద్ధిశాలురయిన యితరస్వీయబోధకుల వలెనే తానును దనదీఱిక వేళలను నిరంతరముఁ గదలెడియంత్రము నొకదానిఁ గనుఁగొనుటకై వినియోగించుచు వచ్చెను. దానిని నూలువడికెడు యంత్రముగా మార్చుట మిక్కిలి సులభముగా నుండెను. ఈ యంత్రము విషయమై మిక్కిలి శ్రద్ధతోడ శోధనలు చేయుటయందే తన కాలమునంతను వినియోగించి జీవనార్థము చేయుపనిని మఱచినవాఁడగుటవలన నదివఱకుఁ దాను గూడఁబెట్టిన స్వల్పధనమును బోఁగొట్టుకొని దైన్యస్థితికివచ్చెను. అప్పటికిఁ బెండ్లిచేసికొన్నవాఁడగుటవలన నాతనిభార్య తనభర్త యీవిధముగా శోధనలకొఱకు ధనమును కాలమును వ్యర్థపుచ్చుచుండుటకు సహింపఁజాలక కోపావేశపరవశయై సంసారమును దుస్థితినుండి కాపుటకుఁ గాబోలు వాని యుపకరణముల సంగ్రహించి యాతఁడు చేసికొన్న మాదిరియంత్రపుపనిముట్ల నన్నిటిని నాశముఁజేసెను. అభినివేశమును మొండిపట్టుదలయును గలవాఁడగుట వలన ఆర్కురైటు తనభార్యచేసిన యాగడమును సహింపఁజాలకరోషించి యా

మెనువెంటనే విడనాడెను. అతఁడు దేశసంచారము చేయునపుడు వార్రింగ్టను పట్టణవాసియైన కే యను నొకగడియారపు పనివానితోడ నాతనికి మైత్రి గలుగుట సంభవించెను. అతఁడు వానియంత్రమునకుఁగావలసిన యుపకరణములను జేయుటయందుఁ దోడ్పడెను. పొత్తరములతోడ (Rollers) నూలు వడికెడుపద్ధతి కే వలన బోధింపఁబడిన ట్లూహింపఁబడుచున్నది. మఱియు నాకస్మికముగా నెఱ్ఱగాఁ గాల్చిన యొక యినుపముక్కను ఇనుపపొత్తరముల సందపోనిచ్చి సాగదీయుటను జూచుటవలన నీతని కీయూహపొడమినదని యూహింపఁబడుచున్నది. ఎట్లయినప్పటికి నీ పద్ధతిప్రకారము తన యుద్దేశమును నెఱవేర్చుకొనుటకు మొదలుపెట్టెను.

ఇప్పు డార్క్రైటు వెండ్రుకలు పోగుచేయు పనినివిడిచిపెట్టి తాను తనయంత్రమును మంచిస్థితికిఁ దెచ్చుటకుఁ బూనుకొనియెను. తాను చెప్పిన పద్ధతులప్రకారము కే యొకమాదిరియంత్రమును నిర్మించెను. దానిని ప్రెస్టను గ్రామమునయున్న దేశభాషాపాఠశాలా భవనములోని కచ్చేరిగదిలో స్థాపించెను. తా నానగరవాసిగానుండుటచేతఁ బట్టణ పారిశుద్ధ్యవిచారణసభయందు సభ్యుఁడుకాఁగోరి యెన్నికఁగాంచుటకై జనరల్ బర్గాయినీకిఁ బ్రతిపక్షియై నిలిచెను గాని తుదకు బర్గాయనియె యెన్నికఁగాంచెను. మంచి దుస్తులనయిన ధరించుటకు శక్తిలేనియంత దారిద్ర్యము ననుభవించుచున్నవాఁడగుట వలన పోల్ రూములో నిలువంబడుట కర్హుఁడనిపించుకొనుటకై నెక్కండ్రు ధనసహాయమునుజేసి దుస్తులనుగొనిపెట్టిరి. స్వాయకష్టముచేత జీవించు పనివాండ్ర నేకులను గలిగియుండిన పట్టణమున యంత్రమును బ్రదర్శించుట యపకారమైనదిగాఁ బరిణమించెను. అప్పటప్పటి పాఠశాలాభవనముచుట్టును నశుభసూచకములైన గుబ్బుగబ్బుమనుధ్వనులు వినఁబడుచుండెను. ఫ్లైషటిలనుయంత్రము గల్పించిన కేయనువానిని ప్రజలుముట్టడించి బాధించియు లంకాషియరుమండలమునుండి తఱుముటయు, బ్లాక్బరనులోని ప్రజలు హార్గ్రీవుసనుబీదవాని నూలువడికెడు

పెద్దరాట్నమును ముక్కలుచేయుటయు జ్ఞప్తికి దెచ్చుకొని ఆర్కురైటు తెలివిగలవాఁడై తనమాదిరియంత్రముతోఁగూడ నిరపాయకరమైన స్థలమునకుఁ జేరుటకునిశ్చయించుకొనెను. ఆప్రకారముగా నట్టింగుహాము నగరమునకుఁ బోయి యక్కడి సాహుకారులను ద్రవ్యసహాయముఁ జేయవలసినదని ప్రార్థించెను. యంత్రకల్పనమునందు లభించెడు లాభమును బంచుకొను పద్ధతి మీఁద రైటుపర్తకసంఘమువారు పెట్టుబడిపెట్టుటకు నంగీకరించిరి. వారు తలంచినంత శీఘ్రకాలములో నాయంత్రము చక్కపఱచఁబడినందున మేజోళ్లనల్లికను గనిపెట్టిన స్ట్రట్టు, నీడు, అను నిరువురు ధనికులకు దానిని నప్పగించిరి.

ఆర్కురైటు యొక్క యంత్రకల్పనావిశేషములను జూచి మెచ్చుకొని స్ట్రట్టువానితో భాగస్వామిగాఁ జేరుటకు నొడంబడియెను. ఆర్కురైటు ధనికుఁడగుట కిప్పుడు మార్గమేర్పడినది. నట్టింగుహాము నగరములోని గడియారపు పనివాఁడగు రిచార్డుఆర్కురైటు తనపేరట నూన్నయంత్రకల్పనాధికారపత్రికను 1769-వ సంవత్సరమునఁబొందిన విషయము ముఖ్యముగ జ్ఞప్తియం దుంచుకొన వలసియున్నది. ఆసంవత్సరముననే వాట్టుకూడ తన యావిరి యంత్రమున కట్టి యధికార పత్రికనుబొందెను. మొట్టమొదట నట్టింగుహాము నగరమున గుఱ్ఱములచేనడపఁబడునట్టి ప్రత్తిమర స్థాపింపఁబడెను. అటుపిమ్మట డెర్బి షియరులోని క్రోమ్‌ఫోర్డులో నంరికంటెఁ బెద్దది నీటిచక్రముచే నడిపింపఁ బడునట్టిదిగా నిర్మింపఁబడినది.

ఆర్కురైటుచేసిన కృషి యప్పుడే యారంభ మయినదిగా నూహింపవలసి యుండెను. యంత్రముయొక్క ప్రతిసాధనము చక్కపఱుప వలసి యుండెను. ఆచరణమున కనుకూల మయినదానిగాను లాభకర మైనదానిగాను జేయుటకుఁ దగిన దిద్దుపాటులు, అభివృద్ధికలుగఁ జేయునట్టి పని యాతనిచేతులలోనె యుండెను. కాని విజయము దీర్ఘకాలకృషివలన మాత్రమే

లభించినది. కొన్ని సంవత్సరముల వఱకు నేవిధమైన ప్రతిఫలము లేకయె విశేష మూలధనమును మ్రింగుచు లాభము లేనట్టిదిగాను నిరుత్సాహ కరమైనదిగాను నుండెను. విజయము కలుగుట నిశ్చయమని యెప్పుడు కనిపెట్టఁబడిననో యప్పుడు కార్ని షుగనులుత్రవ్వువాండ్రు వాట్టు, బోల్టనుల యావిరి యంత్రము వలనఁ గలిగిన లాభములను దోచుకొనుటకై వారలపైఁ బడినట్టుగానే లంకాషియరులోని పనివాండ్రు ముక్కలుచేయుటకై యార్క్‌రైటు యంత్రముమీదఁ బడిరి.

ఆర్క్‌రైటు పనివాండ్రకు శత్రువని బహిరంగముగా నధిక్షేపింపఁబడుచుండెను. చార్లే గ్రామమున నాతఁడు నిర్మించిన యంత్రము రక్షకభటులున్నను ప్రజలచే ! నాశముచేయఁబడినది. బజారులో విక్రయింపఁబడు సాధనములలో నెల్ల నీతనివే మంచివని యొప్పుకొనఁబడినను లంకాషియరులోని జనులు వానిఁగొనుటకు నొల్లకుండిరి. ఆర్క్‌రైటు స్వాతంత్ర్యమును సన్నింపక న్యాయస్థానములయం దాతని నడచుట కెల్లవారు నేకీభవించిరి. వానిప్రతిపక్షులు వానిఁజూచి నిష్ఠురవాక్యములు పలికి నిందించుచుండిరి. ఆదుర్భాషలను విని నెమ్మదిగఁ బ్రత్యుత్తరము లిచ్చుచుండెను. లంకాషయరు, డెర్బిషయరు, స్కాట్లాండులోని లానార్కు మొదలగు ప్రదేశములందు క్రొత్తమరలు స్థాపించెను. క్రమక్రమముగా స్ట్రిట్టుతోడ సంబంధము విడిపోయిన తరువాత క్రోమ్‌ఫోర్డులోని మరలుగూడ నీతని యధీనమయ్యెను. నూలువడికెడు వ్యాపారమంతయు నీయార్క్‌రైటు స్వాధీనమందే యుండెను.

ఆర్క్‌రైటు యోగ్యతగలవాఁడును, జంకని ధైర్యముగలవాఁడును, లోకవ్యవహారదక్షుండును, కుశాగ్రబుద్ధిగల పనివాఁడును నైయుండెను. ఆతఁడు పూనిన పని బహుకష్టసాధ్యమయిన దగుటవలన తెల్లవాఱక పూర్వము నాలుగు గంటలువేసినది మొదలుకొని రాత్రి తొమ్మిదిగంటలు వేయువఱకుఁ బాటు

పడుచుండెను. ఏఁబదిసంవత్సరములు వయస్సువచ్చిన తరువాత నింగ్లీషు వ్యాకరణ మభ్యసించుటకు మొదలుపెట్టి వ్రాత వ్రాయుటగూడ నేర్చుకొనెను. తుదకాతడన్ని యాటంకములను గడచి కష్టపడినందునకుఁ బ్రతిఫలమును బహుమానమునుగాంచెను. తరువాత నితఁడున్నతపదవికివచ్చి గొప్ప బిరుదములను వహించి 1792-వ సంవత్సరమున మృతినొందెను.





## పదవ ప్రకరణము.

---

పీలువంశమునకు మూలపురుషుఁడు పదునెనిమిదవ శతాబ్దమధ్యమున బ్లాకుబర్న్ పట్టణములోని 'హాల్ హౌసుఫారము' లో నివసించు కాపువాఁడుగా నుండెను. తరువాత నతఁడా పట్టణములోని "ఫిష్ లేన్" అను వీధిలో నున్న యొకయింటికి బస మార్చుకొనెను. రాబర్టుపీలు పెద్దవాఁడై యేండ్లు గడచునప్పటికిఁ గొడుకులును గూతుండ్రును గల పెద్ద కుటుంబము గలవాఁడై యుండెను. బ్లాకుబర్నుకుఁ జుట్టునున్న భూమి సారవంతమైనదిగాక విశేషభాగ మూషరక్షేత్రముగా నుండుటచేత వ్యవసాయము చేయుట లాభకరముగాఁ గానిపించలేదు. అయినప్పటికి నా గ్రామము నారబట్టలు నేయునట్టి వ్యాపారమునకుఁ బ్రసిద్ధి కెక్కి యుండెను. యంత్రనిర్మాణమునకుఁ బూర్వము కాపువాండ్రా ప్రదేశమునఁ దమదమ కుటుంబములతోడ వ్యవసాయమునకు వినియోగింపని కాలమున నిండ్లకడ నిట్టి నేతపని చేయుట యాచారమై యుండెను. రాబర్టుపీలు మంచియోగ్యత గలవాఁడు గావున సద్వృత్తి నవలంబించెను. పాటుపడుటయం దభినివేశము గలవాఁడుగాను, కష్టములకోర్చి పని చేయువాఁడుగాను నుండెను. మఱియు దళసరి కాగితములతోడ వర్తుల స్తంభాకారమును గల్పించినవారిలో నితఁడే మొదటివాఁడుగా నుండెను.

కాని రాబర్టుపీలు ముఖ్యముగా నాకాలమునందుఁ దెలియంబడని కాలికో ముద్రణమునందు నెక్కువ శ్రద్ధ వహించినవాఁడై యుండెను. యంత్రసహాయమువలన నాపని జరపుటకై కొంత కాలమువఱకు శోధనలఁ జెక్కింటిని గావించెను. ఆపనికొఱకు గుడ్డ వాని కుటుంబములోని యొక స్త్రీవలన ఇస్తిరి చేయఁబడుచుండుటచేత నాతఁడు శోధనల నన్నిటిని రహస్యముగా నింటికడనే చేయుచుండెను. ఆకాలమున పీలు మొదలగు వారి కుటుంబముల

యందు సత్తు లేక లోహపు కంచములయందు భుజించుట యాచారముగా నుండెను. అట్టి కంచములలో నొకదానిమీద విగ్రహమును వ్రాసి ముద్రించిన నాప్రకారమచ్చుపడవచ్చుననియు, అదేవిధముగా కాలికోమీద రంగుతో ముద్రింపఁబడవచ్చునన్న యూహ యాతనికిఁ బొడఁగట్టెను. వాని దొడ్డిలో నొక భాగమున నొక గుడిసెయందొక స్త్రీ నివసించి యుండెను. ఆమెకడ బట్టలు కాగితములు మొదలగువాని నునుపు చేయుటకుఁ బెట్టి నొక్కెడు యంత్రము నొకదానిఁ గలిగియుండెను. ఒకనాఁ డామెకంచముపైన వ్రాయఁబడిన విగ్రహముపై రంగుపూసి దానిపైన కాలికో గుడ్డ పఱచి యంత్రములోఁ బెట్టి యదిమెను. అప్పుడా విగ్రహము కాలికో గుడ్డమీఁదఁ జక్కఁగా నంటుకొనెను. కాలికో గుడ్డమీద ముద్రింపఁబడుట కదియే ప్రారంభముగా నుండెను. తరువాతఁ గొలఁది కాలములోనె రాబర్టుపీలా పద్ధతిని బాగుపఱచెను. ఈవ్యాపారమున విజయము నొందిన తరువాత రాబర్టుపీలు వ్యవసాయమును గట్టిపెట్టి అచటికి రెండుమైళ్ల దూరముననున్న బ్రూకుసైడు గ్రామమునకు వచ్చి యచ్చువేయు పనియందే తన బుద్ధి వినియోగించి పాటుపడెను. అచట తనవలెనే పాటుపడు శక్తిగలిగియుండిన తన కొడుకుల సహాయమువలన నావ్యాపారమునం దనేక సంవత్సరములు గడసెను. కొడుకులకు వయస్సు వచ్చి పెద్దవారలై యీవ్యాపారము ననేక విధములుగా వేర్వేఱ స్థాపించి పని చేయుటవలన నీ కుటుంబములోని వారలవలనఁ బెక్కండ్రు బీదవాండ్రకుఁ బనులు గలిగి బ్రతుకు మార్గమేర్పడెను. పీలు కుటుంబములకు మూలపురుషుఁడైన రాబర్టు చాతుర్యమును, వివేకమును, దీర్ఘాలోచనము, దూరదృష్టియును గల ప్రసిద్ధ పురుషుఁడని యాతని యోగ్య చరిత్రమువలన మనము తెలిసికోఁ దగియున్నది. ఈ మూలపురుషుని గూర్చి మనకు విశేషముగాఁ దెలియరాదు. వాని కుమారుఁడైన సర్ రాబర్టు తన తండ్రిని గూర్చి యీవిధముగాఁ జెప్పెను.

" మాతండ్రి మావంశమునకు మూలపురుషుఁడని నిజముగాఁ జెప్పఁబడ వచ్చును. దేశాభివృద్ధి విషయమై యోచించునపుడు వాణిజ్యమువలన లభించిన భాగ్యమె ముఖ్యమైనదనియు, వాణిజ్యమువలన దేశమునకుఁ గలిగెడు లాభములతోఁ బోల్చి చూచినపుడు ప్రత్యేకము మనుష్యులకుఁ గలిగెడు లాభములు మిక్కిలి తక్కువవై యుండునని పలుమాఱుఁ జెప్పుచుండుటను విని యుంటిని."

పీలు కుటుంబములో మొదటి జమీందారుఁడును రెండవ కృషికారుడును నగు సర్. రాబర్టు పీలు తండ్రివలె సాహసోద్యమము, పరిశ్రమచేయు శక్తియు, గలవాఁడై యుండెను. అతఁడు వ్యాపారము ప్రారంభించు నప్పటికి నాతని స్థితి సామాన్యుఁడయిన పనివానికంటె నధికముగా లేదు. వాని తండ్రి వానికి భవిష్యదభివృద్ధికి మార్గముఁ జూపినను పెట్టుబడికిఁ జాలినంత మూలధనము లేకుండుటచేత మొదట పెక్కు కష్టములు పొందవలసి వచ్చెను. ఇరువది సంవత్సరములు మాత్రమే వయస్సు వచ్చునప్పటికిఁ దన తండ్రివలన నేర్చుకొనిన కాటన్ ప్రింటింగు పని చేయుటకు నిశ్చయించుకొనెను. ఈ వ్యాపారమునందు వాని పినతండ్రి జేమ్సుహోవర్తనువాఁడును, విలియమ్సు యేట్సను మఱియొక గృహస్థుఁడును భాగస్వాములుగాఁ జేరి 500 పౌనులు మూలధనమును జేర్చిపెట్టిరి. అందధికభాగము విల్లియమువలనఁ జేర్పఁబడినది. విల్లియముతండ్రి బ్లాకుబరనులో నొక గృహమును గలిగియుండెను. అతఁడాగ్రామమునఁ బేరును బ్రఖ్యాతియును గాంచి యుండెను. తన వ్యాపారమువలనఁ గొంత ద్రవ్యము గూడఁ బెట్టినవాఁ డగుటచేత కొడుకు చేయునట్టి యీవ్యాపారమునకుఁ గొంత ద్రవ్యమును పెట్టుబడి పెట్టుట కిష్టముగలవాఁడై యుండెను. రాబర్టు పిన్నపడుచువాఁడుగ నుండినను ఆవ్యాపారమునందు ననుభవజ్ఞానమును బొందియున్నవాఁడు గావున వ్యాపారమును జక్కఁగా జరుప నారంభించెను. బరీ యను నొక చిన్నపట్టణమునకు సామీప్యమున

నున్నట్టియు, చెడిపోయి నట్టియు నొక ధాన్యపు మగను స్వల్పమూల్యమునకుఁ గొని యచట కట్టలతోఁ గొన్ని పాకలను వేసి పీరలు కాటన్ ప్రింటింగ (మాది అచ్చునొత్తుట) వ్యాపారమును 1770 వ సంవత్సరములోఁ బ్రారంభించిరి.

ప్రారంభపరివర్తనకాలమున నాభాగస్వాము లెట్లు మితవ్యయము చేయుచుఁ గాలము గడపిరో యీక్రింది విషయమును బట్టి సులభముగాఁ దెలిసికొనవచ్చును. విల్లియము వివాహము చేసికొని మితవ్యయము గలవాఁడై భార్యతో సంసారము సేయుచు రాబర్టు బ్రహ్మచారిగానున్నందున నతనిఁ దన యింట నద్దెకు నుంచుకొనెను. తన భోజనమునకును బసకును పీలు మొదట విల్లియమునకుఁ జెల్లించినది వారమునకు 8 షిల్లింగులు మాత్రమేయై యుండెను. కాని తరువాత విల్లియము తన కీమొత్తము చాలదని వారమున కొకషిల్లింగు పెంపు చేయవలసినదని కోరఁగా మొదట పీలు కొంచెము వెనుకఁ దీసెను. పిమ్మట నిందునుగూర్చి వారల కభిప్రాయ భేదముగూడ గలిగెనుగాని తుదకు వారమున కాఱుపెన్సు లదనముగా నిచ్చుటకు పీలు సమ్మతించెను. విల్లియమునకు జనించిన బిడ్డలలో మొదటిది 'ఎల్లెన్' అను బాలిక యగుటవలన నామె యింటనున్న పీలును మిక్కిలి ప్రేమించునదియై యుండెను. పీలు యంత్రశాలకుఁ బోయి పగలెల్లను బాటుపడుచు రాత్రు లింటికి వచ్చినప్పుడీ బాలిక సంతోషముతోఁ బఱుగిడుచువచ్చి తన్నుఁ గౌగిలించుకొనఁగా నీతఁ డాబాలికను దన తొడమీఁదఁ గూరుచుండఁ బెట్టుకొని 'నా ప్రియురాలవైన సెల్లీ! నీవు నాకు భార్యవగుదువా'' యని యడుగుచుండుటయు, అందున కాబాలిక 'ఆట్లే' యని ప్రత్యుత్తర మిచ్చుచుండుటయు, అట్లయిన నీకొఱకు వేచియుండెదను. నిన్నుదక్క యితరుల వివాహము చేసికొన'నని యాతఁడు చెప్పుచుండుటయుఁ దఱుచుగ జరుగుచువచ్చెను. ఆప్రకారము పీలు వేచియుండెను. బాలికకు వయస్సువచ్చి సౌందర్య మతిశయించినకొలది

పీలునకుఁ దప్పక యీమెను వివాహము చేసికొనవలయునన్న యూహ బలము గాఁచు వచ్చెను. ఇట్లు పది సంవత్సరముల కాలము గడచునప్పటికి వారల వ్యాపార మభివృద్ధినొంది విశేషలాభ మొడఁగూడుటయు, బాలికకుఁ బదు నేడేండ్ల ప్రాయము వచ్చుటయుఁ జక్కఁగా నాలోచించి యీమెను వివాహము చేసికొనెను. తన తండ్రితోడ నెవఁడు భాగస్వామియై వ్యాపారము జరపెనో, అద్దె నిచ్చి తనతల్లి పెట్టుపోతలకు లోనయ్యెనో, ఎవ్వనితోడప్రొఁద గూరుచుండి ముద్దులు గులుకు మాటలాడుచు సంతోషమును గలిగించెనో అట్టి పీలునకు భార్యయై, పిమ్మట దొరసానియై, ఇంగ్లాండు దేశముయొక్క మంత్రిత్వమును వహింపఁబోవువానికిఁ దల్లియై ప్రఖ్యాతి గాంచెను. ఆమె విశేషబుద్ధి చాతుర్యము గలదియై అవసరమయినప్పుడు భర్తకు సదుపదేశమును సదాలోచనమును దెలుపు నాత్మౌన్నత్యమును గలిగియుండెను. పీలు వ్యాపారమును గూర్చిన యుత్తర ప్రత్యుత్తరములను నడపు పద్ధతియందు నేర్పుగలవాఁడగుటచేత వివాహానంతర మనేక సంవత్సరములవఱకు వారిభార్య భర్తకు లేఖకురాలుగానుండి తోడ్పడుచు వచ్చెను. తన భర్తకు 'బేరన్' అను జమీందారీ బిరుద మీయఁబడిన తరువాత మూఁడుసంవత్సరములకు అనఁగా 1803 వ సంవత్సరమున మృతిఁ బొందినది. వస్తువులు ధరించువిషయమున నింటికడ నలవాటు పడినదానికి విరుద్ధముగా లండను నగరమునందలి యాచారము ననుసరించి నడచుటవలన నామె యారోగ్యమునకు భంగము గలిగినది. 'రాబర్టు మా నెల్లీని దొరసానిఁ జేయకుండినయెడల నామె యిప్పటికిని జీవించియుండఁబడవచ్చు'నని వృద్ధుఁడయిన యేట్సు చెప్పుచు వచ్చెనఁట!

ఈయేట్సుపీలువర్తకసంఘమువారి వ్యాపారము నిరంతరము నేయాటంకమును లేక పరంపరాభివృద్ధిఁ జెందినదిగా నున్నయది.

ఈవర్తకసంఘమునకు సర్ రాబర్టుపీలు ప్రాణమువంటివాఁడుగా నుండెను. ఇతఁడు తన వ్యాపారమునందుఁ జక్కని జ్ఞానానుభవము గలవాఁడును,

వాణిజ్యమును గూర్చిన మర్మముల నన్నిటిని దెలిసికొన్నవాఁడును నై యా
కాలమునందలి ప్రత్తివడుకు పని చేయువారలకంటెఁ గూర్మబుద్ధిగలవాఁడై
యుండెను. అతఁడు స్థిరచిత్తమును దృఢగాత్రమును గలవాఁడై బహుకష్టముల
నొంది పాటుపడెను. ప్రత్తివడకుటకై ఆర్కురైటు పడినట్లుగానె ప్రత్తి
యచ్చొత్తుటకై పీలు శ్రమపడి ఆర్కురైటువలెనె విజయమును గాంచెను.
ఈవర్తకసంఘమువారు చేయువస్తువులు ప్రశస్తములయిన వగుటచే బజారునం
దివియే యధికముగా నమ్ముడువోవుచుండెను. ఈవర్తక సంఘముయొక్క
యోగ్యత లంకాషియరు మండలమునందు సుస్థిరమై నిలిచియుండెను. వారీగ్రా
మమునందు మాత్రమేగాక యాచుట్టుపట్ల ప్రదేశములందుఁ గూడ యంత్రశా
లలు నిర్మించి తమ వ్యాపారమును విరివిగా జరుపుచు వచ్చిరి. ఇట్లు తమ
లాభముకొఱకు పాటుపడుటయందు మాత్రమేగాక తమ యంత్రశాలలయందుఁ
బనిచేయు పనివాండ్రయొక్క క్షేమారోగ్యముల విషయమైకూడ శ్రద్ధవహించి
తదనుకూలములయిన పనులను గావించిరి.

'జానుహీతుకోటు' 1783 వ సంవత్సరమున డక్ఫీల్డు గ్రామమున గొ
వనీయుఁ డయిన యొకబీద కాపువానికి జనించెను. అతఁడు పాఠశాలయందుఁ
జదువునపుడు తెలివితేటలు గలవాఁడై యుండెను. కాని బాల్యముననె బడి
నుండి తొలఁగింపఁబడి అల్లికపనియందు నేర్పరియైన యొకపనివానియొద్దఁ బని
నేర్చుకొన నియోగింపఁబడెను. ఈబాలుఁడు పనిముట్లనుపయోగించుటయందు
హస్తలాఘవము గలవాఁడై యుండుటయేగాక మేజోళ్ళ అల్లికపనియొ
క్కయు, తికమకగానుండు పడుగుమరయొక్కయు మర్మములను గ్రహిం
చినవాఁడై వీనినిగుఱించి మంచిజ్ఞానమును గలిగియుండెను. తనకుఁదీఱికయైన
పుడు నాయాపనుల నెట్లభివృద్ధి పఱుపఁబడవలయునో వానిని దెలిసికొనుచుం
డెను. పదునాఱుసంవత్సరముల ప్రాయమున నితఁడు చేతితోఁ జేయఁ బడిన
ఫ్రెంచిజరీతో సమానమైన జరీచేయునట్టి యంత్రమును జేయునట్టి విధమును

గన్పెట్టఁగలిగెనని పార్లమెంటు మెంబరగు (జనప్రతినిధిలోని సభ్యుఁడు) బజ్జె చెప్పియుండెను. ఇతఁడు మొట్టమొదట పడుగు నేయునట్టి మరయందు మంచిమార్పుచేసి విజయము నొందెను. యంత్రసహాయమున జల్తారు చేయుటకై బహుకాలము నానావిధములయిన కష్టము లనుభవించెను. నట్టింగుహాము నగరమునందలి యంత్రశాస్త్రజ్ఞులు బహువిధములఁ గృషిచేసియు విజయమును గాంచలేక దారిద్ర్యములో మునిఁగి యదృశ్యులై పోయిరి. అనేకులు పిచ్చివాండ్రయి దేశాంతరముపోయి తిరుగులాడుచుండిరి. అప్పటికి పురాతనమైన పడుగుమరయే నిలిచియుండెను.

ఇరువదియొక్క సంవత్సరములు గడచినతోడనె 'హీతుకోటు' నట్టింగుహామునగరమునకువచ్చి 'చాలినప్రతిఫలము' నిచ్చునట్టి యుద్యోగమును సంపాదించి ఇజారులు, మేజోళ్లు మొదలగు నల్లికపనులను జేయుచు, తనకుఁగల కల్పనాశక్తికిని, రుస్తుజ్ఞానమునకును, యోగ్యతను గాపాడుకొనునట్టి ధర్మబుద్ధికిని జనులవలనఁ గొనియాడఁబడుచు వచ్చెను. తానూహించిన యంత్రమును గల్పించుటకై తనకాలమును బుద్ధిని వినియోగించి బహువిధములుగాఁ గృషి చేయ నారంభించెను. మొట్టమొదట చేతితో ఫ్రెంచిజల్తారు చేయుట నేర్చుకొనెను. దానినే యంత్రసహాయమునఁ జేయుటకై కృషిచేయుచు వచ్చెను. అందునకు విశేషపరిశ్రమ చేయవలసియుండెను. తనప్రయత్నము కొనసాగునన్న విశ్వాసము గలిగియుండుటచేత నెన్నియాటంకములు గలిగినను, ఎన్నిసారులాతని సత్ప్రయత్నము లన్నియు విఫలము లయిపోయినను, ఎంతెంతకష్టముగలిగినను, అతఁడు తనపూనికను విడనాడలేదు. ఇట్లు మూడుసంవత్సరములు విరామములేకుండఁ బాటుపడి పెక్కుపరిశోధనలను గావించి తుదకాయంత్రమును గల్పించెను.

అకాలమునందాతని భార్య నూత్నయంత్రకల్పనమునకై తనభర్త పడుచున్న పాటులను దురవస్థలను గండ్లారఁ జూచుచున్నదిగావున నెట్లు తుదము

ట్టునో యని యాతురభావముతో వీక్షించుచుండెను. ఒకప్పు డాతఁడొక మాదిరిచరను జేసినపుడాతని భార్య 'అది పనిచేయునా' యని యడుగఁగా నాతఁడు 'చేయఁజాలదు, దీనిని నాశముఁజేసెద' నని చెప్పెను. అంతటామె దుఃఖమును బట్టఁజాలక బిట్టుగ నేడ్వ మొదలు పెట్టెను. అట్టిస్థితియందున్న భార్య తనభర్త యంత్రమును గల్పించి విజయమునుబొంది నపుడా మెకుంగలిగిన సంతోష మెంతని చెప్పవచ్చును. అంతటితో నాతని కష్టములు గట్టెక్కి-యుండలేదు. అనేకులు తరువాత నాయంత్రమునుజేసి ఆయంత్రమును దామే గన్పెట్టితిమని తగవులాడ మొదలు పెట్టిరి. ఈవివాదములు తుదకు న్యాయస్థానముల కెక్కుటయు, అచట 'హీతుకోటు' తనయొక్క హక్కులను స్థిరపఱచుకొనుటయుఁ దటస్థించెను. హీతుకోటుయంత్రమునుబట్టియె యొల్లవారును పనుతమ యంత్రములను నిర్మింపఁగలిగిరని విమర్శకాలమందుఁ జక్కఁగాఁ దేలినది. విమర్శ ముగిసి హీతుకోటు విజయముఁ గాంచునప్పటికి దేశమున వానియంత్రములవంటి యంత్రము లాఱువందలకంటె నెక్కువగా నుండెను. అప్పు డాతఁడాయంత్రాధికారులనుండి ధననష్టమును గట్టిపుచ్చుకొనెను. అందువలన లభించిన ధనముయొక్క మొత్తమధికముగా నుండెను. ఈజల్తారు పనివాంఛకు వచ్చినలాభ మధికమగుటచేత యంత్రములుగూడ దేశమంతట విస్తరించెను. చతురపుగజమునకు 5 పౌనులు విలువగలిగియుండిన వస్తువు తరువాత నిరువదియైదు సంవత్సరములకు 5 పెన్నిలకె దొరకుచుండెను. ఈ వ్యాపారమువలన సంవత్సరమునకు నలువదిలక్షల పౌనులు నికరపాదాయము వచ్చుచుండెను. లక్షయు నేఁబదివేల జనులు పనిగలిగి జీవించుచుండిరి. 1809 వ సంవత్సరమున లీసెస్టరుమండలమున లోబరోయను ప్రదేశమున 'హీతుకోటు' జల్తారువర్తకుఁడై కుదురుకొని యనేకయంత్రములను నిర్మించి విశేష లాభమును బొందుచుండెను. అంతట దేశమున మహాసంక్షోభము సంభవించెను. దేశము నంతట నీవిధముగా నూత్నయంత్రములు విస్తరిల్లుటచేత

నిర్వాహకాముకలకుఁ గలుగు లాభమంతయు యంత్రాధికారుల పాలగు
చుండుటచేతఁ జేతిపనివాండ్రకుఁ బనిలేకపోయినది. అందువలన వాండ్రు
కష్టులుపన్ని యేవిధముననైన నాయంత్రములను నాశముఁజేయ దలంచిరి.1811
వ సంవత్సరమున నట్టింగుహాము, డెర్బి, లీసెస్టరు మండలములలో జల్లారువ్యా
పారముఁ జేయుయంత్రాధికారులకును, జనులకును వివాదములు పుట్టినవి.పిమ్మట
కష్టకారు లొకసంఘముగాఁ గూడి నట్టానను ప్రదేశమునందలి యంత్రశాల
లనుబట్టి పాలు ముట్టడించి వాని నాశముఁ జేసిరి. ఈ కలహమునకుఁ బ్రేరేప
కులయిన వారిలోఁ గొందఱు పట్టుకొనఁబడి శిక్షింపఁబడిరి. మఱి కొందఱకు
బుద్ధి చెప్పఁబడెను. కాని కష్టకారులు పట్టుపడకుండునటులఁ బరమరహస్య
ముగాఁ దమ మనోవాంఛితమును నెఱవేర్చుకొనుచునే యుండిరిగాని మానలేదు.
ఈయంత్రములలో నాలుగింట మూడువంతులు పట్టణములకు దూరముగా
నుండుటచేత నాశముఁ జేయుటకు మఱింత సులభముగా నుండెను. ఈకష్ట
కారులు నట్టింగుహామునకు సమీపమున బలపఱచుకొని రాత్రులందు రహస్య
ముగా సభలుచేయుచు యంత్రనిర్మాతల నాశము మార్గములను వెదకుచుండిరి.
ఈగుంపులకు 'నెడ్ లడ్డు' అనువాఁడు నాయకుఁడై యంత్రవినాశమునకై
పూనుకొనెను. అందువలన వీరలకు లడ్డెయిట్లని పేరు గలిగెను. ఈపేరుతో
వీరలు 1811వ సంవత్సరమున శీతకాలమునఁ జెలరేగి యంత్రములఁ బెక్కిం
టిని ధ్వంసముచేసి పెక్కు పనివాండ్రకు జీవనము లేకుండఁజేసిరి. ఈ యుప
ద్రవమునుండి తప్పించుకొనుటకై యంత్రాధికారులు తమతమ యంత్రములను
పల్లెలనుండి పట్టణములకుఁ గొనిపోయి భద్రపఱచు కొనుచుండిరి.

లడ్డెయిట్లు దండనాధికారులు తమపట్ల కరుణఁజూపి స్వల్పశిక్ష
లను విధించుటవలన నధిక ప్రోత్సాహముచేఁ బ్రేరేపింపఁ బడినవారలయిరి.
ఈకలహము లన్నిమండలములందును వ్యాపించెను. కష్టులు మున్పటికన్న
రహస్యముగాఁ జేయనారంభించిరి. ఇందుఁజేరిన వారెల్లరును దమనాయకు

లకు విధేయులమై యుందుమనియు, అట్లుమీఱి వర్తించిన పక్షమున మరణ శిక్షకుఁ బాత్రులమగుదుమనియు నొట్లు పెట్టుకొనిరి. అంతట వస్త్రములు, కాలికోగుడ్డలు, జల్తారులు మొదలగునవి నేయుయంత్రములన్నియు నాశము చేయఁబడినవి. ఇట్టి యరాచక పరిపాలనము కొన్ని సంవత్సరములవఱకు మిక్కిలి భయంకరముగా నడచెను. ఈ లడ్డైయి ట్లాయుధపాణులై లంకా షియరు యార్కుషియరు మండలములలోని యంత్రములను దాకి కొన్నిటిని నాశముజేసి కొన్నిటిని దగ్ధముచేసిరి. కావున నీయంత్రములు యుద్ధభటుల చే సంరక్షింపఁబడవలసివచ్చెను. ఈ యంత్రముల యజమానులు కొందఱు చావఁగొట్టఁబడిరి. మఱికొందఱు! చంపఁబడిరి. దేశమున శాంతి స్మృతి బహు కఠినముగా నెఱపవలసి వచ్చెను. కలహకారు లనేకులు పట్టుకొనఁబడిరి. ఉరి శిక్షకుఁ గొందఱు పాత్రులయిరి. ఇట్టి సంక్షోభము గొంతకాలము జరిగిన తరువాత నీయల్లరులు క్రమక్రమముగా నణచివేయఁ బడినవి.

1816వ సంవత్సరమున నిట్టియల్లరులు విజృంభించియుండ నొక నాఁడు కలహ కారుల నేకులు కాగడాలుగైకొని పట్టపగలు లోబరో ప్రదేశ మునున్న హీతుకోటుయొక్క యంత్రశాలలను ముట్టడించి నిప్పంటించి ముప్పదియేడు యంత్రములను 10000 పౌనులు విలువగలిగిన సొత్తును దగ్ధము చేసిరి. ఆకలహకారులలోఁ బదిమంది శిక్షింపఁబడిరి. ఎనమండ్రు మనుష్యులు ఉరిశిక్షను బొందిరి. తరువాతఁ దనకుఁ గలిగిన నష్టమునకై 'హీతుకోటు' జిల్లా సభవారిపై వ్యాజ్యెము దెచ్చెను. క్వీన్సు బెంచి సభవారతనికిఁ గలిగిననష్టమిచ్చు కొనవలసినదే యని తీర్పుచేసిరి. డెవన్ షైరులోని టివర్టను గ్రామమున బొచ్చుబట్టలను జేయునట్టి పాతకట్టడ మొండుగలదు. అపటు బొచ్చు నేత పని మూలబడినందున నాకట్టడము శిథిలమై యుండెను. ప్రజలు కూడును గుడ్డయును లేని బీదలయి యుండిరి. హీతుకోటు పాతయంత్రమునుగొని బాగు

పఱచి మున్నటికన్న జల్తారువ్యాపారమును విరివిగా సాగింపఁజేసెను. మూఁడు వందల యంత్రములను స్థాపించి పెక్కుపనివాండ్రను రప్పించి మంచిజీతము లిచ్చి వ్యాపారమును జరుపుటకుఁ బ్రారంభించెను. జల్తారుపనిమాత్రమే గాక దానితో సంబంధించిన యితరములయిన పనులను జేయ మొదలు పెట్టెను. ఇంతియగాక టెవర్టను గ్రామమున ఇనుపయంత్రశాల నిర్మించి వ్యవసాయమున కుపయోగించు పనిముట్లను జేయుచుండెను. అందువలన నామండలమునకు గొప్పలాభము గలుగుచుండెను. ఆవిరియంత్ర సహాయమున భూమిదున్నునట్టి నాగలిని గని పెట్టెను. పౌలరు గనిపెట్టిన నాగలి రాకపూర్వ మీహీత్కోటు కనిపెట్టిన నాగలియే వాడుకొనఁబడుచుండెను.

హీత్కోటు స్వతస్సిద్ధమయిన జ్ఞానముగలవాఁడు. ఎట్టిదురవగాహమయిన విషయమునయినను నిమిషములో గ్రహింప శక్తిగలవాఁడు. ఎట్టి వ్యాపారమునైనఁ గ్రమపద్ధతిని సమర్థింప శక్తిగలవాఁడు. ఇంతియగాక న్యాయప్రవర్తనయు, మర్యాదయు, నీతియుగలవాఁడై నిజమయిన మనుష్యుఁడని గౌరవింపఁబడుచుండెను. స్వయంసహాయమువలన విద్యాభ్యాసమును జేసి యున్నతస్థితికివచ్చిన వాఁడుగావునఁ దనవద్దఁబనిచేయునట్టి పనివాండ్రలో బాగుపడుట కష్టములనిలోచిన వారలకుఁ దగిన సహాయమునుజూపి యున్నతస్థితికిఁ గొనివచ్చుటకై ప్రయత్నించెను. నిరంతరముఁ బాటుపడుచు తీఱిక యెంత మాత్రములేక యున్నను, ఎట్లో కష్టపడి ఫ్రెంచి, ఇటాలియాభాషలు నేర్చుకొని చక్కని సాహిత్యజ్ఞానమును సంపాదించెను. ఆతఁడు భాషాగ్రంథములలో నుత్తమములయిన వాని నెల్లఁజదివి వివిధవిషయపరిజ్ఞానమును గూడఁ గలిగి యుండెను. తనయొద్దఁబనిచేయునట్టి రెండువేల పనివాండ్రును దన్నుఁ దండ్రిగా భావించుకొని వినయవిధేయులై యుండునటుల వారలసుఖసంతోషములకొఱకు నిరంతరముఁ బాటుపడెను. ఐశ్వర్యమనేకులను జెఱపినదిగాని వానిని మాత్రము చెఱుపలేక పోయినది. బీదల కష్టములను జూడకుండ వాని

హృదయము నెన్నఁడును మూసిపెట్టియుండలేదు. బీదలెప్పుడు నాతనివలన గలుగునట్టి యుపకారమును బొందుచునే యుండిరి. తనకడఁబనిచేయు వారల పిల్లవాండ్రకు విద్యాదానము చేయుటకై యాఱువేల పౌనులు వెచ్చించిపాఠశాలలను పెట్టించెను. అతఁడెప్పుడును క్రోధస్వభావముగలవాఁడుగాక సౌమ్య హృదయమును, ఆనందము నొలికించు ముఖవర్చస్సునుగలవాఁడై తన్నెఱిఁగిన వారలచేత బహువిధములఁ గొనియాడఁ బడుచుఁ బ్రేమింపఁబడుచుండెను.

1831 వ సంవత్సరమున టివర్టను గ్రామవాసులు తన మహోపకారకార్యములచేత హీతుకోటు నిజమయిన దేశోపకారియని తమపక్షమున పార్లమెంటును మహాజన ప్రతినిధి సభలోఁ బ్రతినిధిగానుండుటకు వానిఁగోరుకొనిరి. వారలపక్షమున జనప్రతినిధి సభలో ముప్పది సంవత్సరములవఱకుఁ బ్రతినిధిత్వమును బడసియుండెను. ఆకాలములో విశేష భాగము పాల్మర్స్టను' ప్రభువీతనికి సహోద్యోగిగానుండి యీతఁడు మంచిమిత్రుఁడని యీతనిపట్ల సుహృదయుఁడై యుండెను. వయస్సుమీఱినందున 1859 వ సంవత్సరమున పార్లమెంటులోఁ బ్రతినిధిత్వమును మానుకొనెను. ఇతఁడా యుద్యోగమును విడిచివచ్చిన తరువాత నీతనివద్ద నుండు 1300 ల పనివాండ్రీతనియందుఁ గల ప్రేమచేతను గౌరవము చేతను నొకవెండిసిరాబుడ్డియు, బంగారుకలమును బహుమానముచేసి తమకృతజ్ఞతను జూపుకొనిరి. పనిమానుకొన్న తరువాత రెండు సంవత్సరములుమాత్రమే సుఖముగాఁ గాలము గడపెను. 1861 వ సంవత్సరమున అనఁగాఁ దన డెబ్బదియేఁడవయేట దేహవియోగమును గాంచెను. అతఁడు భౌతికమయిన దేహమునువిడిచి లోకాంతరగతుఁడై పోయినను, అతని యోగ్యతకుఁ బ్రకాశము దెచ్చిన సత్యప్రవర్తనము, నీతి, మానుషధర్మము, యంత్రశాస్త్రపరిజ్ఞానము, స్థిరములయి శాశ్వతముగా నిలిచియుండెను.

---

# పదునొకండవ ప్రకరణము.

---

జాక్వార్డు లైయాన్సుపట్టణము నందలి యొక పేదవానియింట జనించెను. వాని తల్లిదండ్రులుకష్టపడి జీవించువార లయియుండిరి. వానితండ్రి నేతపనివాఁడుగ నుండెను. వారలు వానికిఁ జదువు నేర్పించుటకు శక్తిలేనియంతటి హైన్యస్థితియం దుండుటవలన నతఁడు నేర్చుకొనఁ గలిగినవిద్య నత్యల్పముగనుండెను. వానికి వర్తకమునుగూర్చి తెలిసికొనఁదగిన వయస్సువచ్చిన వెనుక వానిని వానితండ్రి పుస్తకముల కట్టలుగట్టు పనివానియొద్దఁ బని నేర్చుకొనవలసినదని యప్పగించెను. తనయజమానివద్ద లెక్కలు వ్రాయుటకొఱకు నంతకుఁ బూర్వమె నియోగింపఁబడి యుండిన యొకవృద్ధలేఖకుండు వానికి గణితశాస్త్రమునఁ గొన్ని పాఠములిచ్చెను. తరువాత నతఁడు యంత్రగతిశాస్త్రమునందెక్కువ ప్రావీణ్యముఁ జూప నారంభించెను. వానికల్పన లాలేకరికి నచ్చెరువుగలిగించెను. అట్టల కుట్టువ్యాపారముకంటె మఱియొక వ్యాపారమునఁ బ్రవేశపెట్టిన వానిబుద్ధి మఱింత ప్రకాశితమగునని యతఁడు వాని తండ్రికి హితోపదేశముచేసెను. తరువాత జాక్వార్డుకత్తులు మొదలగునవి చేయుపనివానివద్దఁ బ్రవేశపెట్టఁ బడెను. ఆయజమాని వానిని తిన్నఁగాఁ జూడనందున వాఁడాపని మానుకొనెను. వాఁడటుపిమ్మట నక్షరములు పోత పోయు వానివద్దఁ బ్రవేశపెట్టఁబడెను.

వానితల్లిదండ్రులు మృతిఁజెందిన తరువాత వానితండ్రికడనున్న రెండు నేతమగ్గములను స్వాధీనముచేసికొని నేతగానిపని చేయవలసి వచ్చెను. కనుక వాడు వెంటనె యామగ్గముల బాగుపఱచుటకుఁ బ్రయత్నింప నారంభించెను. నూత్నకల్పనలఁ జేయవలయునన్న యభిలాషమునందే వానిమనస్సంతయు లీన

మైయుంటచేత వాఁడుచేయవలసినపని మఱచిపోయి యుపేక్షించుచు వచ్చెను. అందువలన జీవనముజరుగక మిక్కిలి బాధపడుచువచ్చెను. తానుజేసిన ఋణములనుదీర్చుటకు దనవద్దనున్న మగ్గముల రెంటిని నమ్మివేయుటయె గాక యాసమయమునందె పెండ్లిచేసికొని భార్యను బోషింపవలసిన భారముగూడ వహించెను. అంత కంతకు మిక్కిలి బీదవాఁడగుటవలనఁ దనకుటీరమును గూడ ఋణప్రదాతల కమ్మివేసెను. ఎక్కడనైన నుద్యోగమును సంపాదించుటకై ప్రయత్నముచేసెను గాని వాఁడెప్పుడును గల్పనలకై కలవరించుటయె గాని పాటుపడునట్టి స్వభావముగలవాఁడు గాఁడనియు, పట్టిసోమరియనియు, జనులు భావించుచుండుటచేత వాని ప్రయత్నము వ్యర్థమైపోయెను. తుదకు లైయాన్సునకు సమీపమునందున్న బ్రెస్సీ పట్టణమున నొకపనివానివద్దఁ బ్రవేశించి భార్యను స్వగ్రామమునందేయుంచి గడ్డికుళ్ళాయలనుజేసి లసమ్మలమునఁ గలుగు స్వల్పధనముతోనే తృప్తిఁజెంది యట్లట్లో పొట్టపోసికొనుచుండెను.

తరువాతఁ గొన్ని సంవత్సరములవఱకు జాక్వార్డుపేరు వెలియఁబడకుండ నుండెను. కాని యాకాలమున నాతఁడూరక యుండలేదు. అతఁడు బొమ్మలతో వస్త్రములనేయుటకు నభివృద్ధిమార్గములను గల్పించుటయందు దనబుద్ధిని వినియోగించుచుండినట్లుఁ గన్పట్టుచున్నయది. ఎందువలన ననఁగా 1790 సంవత్సరమున నాతఁడు పడుగుదారముల నేర్చుటకొఱకు నొక కల్పనము గావించెను. దానిని మగ్గమునకుఁ జేర్చినప్పుడు మగ్గములాగు కుఱ్ఱవానిపనితో నిమిత్తము లేకుండునటులఁజేసెను. ఈయంత్రకల్పనమును వాడుకలోనికిఁ దెచ్చుటకుఁ గాలయాపనమయినను నియ్యది స్థిరముగా నెలకొల్పఁబడెను. అది వాడుక లోనికిఁ దేబడిన పది సంవత్సరములకు లైయాన్సుపట్టణమున నట్టివి 4000 లు నెలకొల్పఁబడినవి. ఆకాలమున ఫ్రాంసుదేశమున సంభవించిన గత్తరవలన నాతని ప్రయత్నములన్నియు నడుగంటినవి. 1792 వ సంవత్సరమున సంభవించిన కలహములో నాతఁడు ప్రజాప్రతినిధి సంఘమునకు విరుద్ధముగా

దొరతనమువారి సైన్యముతోఁ జేరి పోరాడవలసి వచ్చెను. నగరము శత్రుసైన్యమునకు వశమగుటచేత జాక్వార్డుపాఱిపోయి రైనుబలములతోఁ జేరి సార్జంతు పదవికివచ్చెను. అతఁడాప్రకారము యుద్ధభటుఁడుగా నిలిచియుండునుగాని వానికొడుకు గుండుదెబ్బతిని తనప్రక్కనే పడి మృతినొందుటను జూచి సైన్యమునువదలి తనభార్యను దెచ్చుకొనుటకై లైయాన్సునగరమునకు మరలివచ్చెను. తనభార్య గడ్డికుళ్లాయలనుజేసి వాని విక్రయమువలన జీవనము జరపుకొనుచు నొకమిద్దెయింటియందు నివసించి యుండఁగా నామెను గలిసికొనెను. ఇట్లుల నొరుల కెఱుంగఁబడకుండ రహస్యముగా నామెతోఁగలిసి కాపురముండి పూర్వముదానెట్టి కల్పనములు చేయవలయునని నిశ్చయించి యుండెనో మరల నాప్రయత్నములను జేయుటకొఱకె తనబుద్ధిని వినియోగింప నారంభించెను. వానిఁ గొనసాగించుటకుఁదగిన యుపపత్తిలేని వాఁడయి యుండెను. ఈగూఢ ప్రదేశమునుండి తప్పించుకొనిపోయి యెక్కడనైన నుద్యోగము సంపాదించుకొనుట యాతని కావశ్యకముగాఁ గనబడెను. దైవానుగ్రహమువలన వానికొక నేతపనివానివద్దఁ బని లభించెను. మగ్గములలో నధికములయిన మార్పులను జేసి యధికప్రయోజనకరములుగాఁ జేయవచ్చుననియుఁ నట్టిపనికిఁ దనవద్ద గావలసిన ధనము లేకపోవుటకు మిక్కిలి విచారించుచుంటిననియు నొకనాఁడు తన యజమానునితోఁ జెప్పుకొని విచారింపనారంభించెను. ఆయజమాని వాని యాలోచనమును మన్నించి దయఁగలవాఁడై వానికిఁ దీఱికయగునప్పుడు,వాని యుద్దేశమును నెఱవేర్చుకొన వలసినదని చాలినంత ద్రవ్యమును వానికిచ్చెను.

మూఁడుమాసములలోఁ బనివాండ్రు కష్టమును దొలఁగించునట్టి యొక మగ్గమునుగల్పించెను. అతఁడా మగ్గమును 1801 వ సంవత్సరమున పారీసునగరమునందు మిగుల వైభవముగాఁ బ్రదర్శింపఁబడిన దేశీయవస్తు ప్రదర్శనసభకుఁ గొనివచ్చి యాసభవారివలన లోహపు బిరుదుబిళ్ళను బహుమానముగాఁ

బొందెను. ఇంతియగాక యాదేశపుమంత్రి యైనకార్నాటు గారు లైయాన్సునగరమునకు స్వయముగావచ్చి జాక్వార్డునకు దర్శనమిచ్చి యీనూత్న యంత్రమును గల్పించినందుకు నతనిం గొనియాడి గౌరవించిరి. ఆవఱుపటి సంవత్సరము లండనునగరములోని శిల్పవిద్యాసభవారు చేపలనుబట్టువలలు నేయునట్టి యంత్రమును గల్పించువారికి బహుమానము నిచ్చెద మని ప్రకటించిరి. జాక్వార్డున కీసంగతి తెలియవచ్చిన పిమ్మట నొకనాఁడు తనవాడుక ననుసరించి పొలములోఁ దిరుగుచుండఁగా నీసంగతి జ్ఞప్తికిరాఁగా నందుకొఱకు యంత్రమును గల్పించుపద్ధతి గన్పెట్టఁ గలిగెను. ఎప్పట్టియట్ల వాని యజమాని వానికిఁ ధనసహాయముఁ జేసెను. జాక్వార్డు మూఁడువారములలోఁ దానిఁ గల్పించెను.

ఇట్టి యంత్రమును జాక్వార్డు కనిపెట్టినవిషయము ప్రీఫెక్టనురాజకీయోద్యోగియునకుఁ దెలియవచ్చినందున నాయధికారికడకు జాక్వార్డు రప్పింపఁబడెను. ఆయంత్రమును నడుపుపద్ధతినిగూర్చి వాఙ్మూలముపుచ్చుకొని యాయధికారి చక్రవర్తికిఁబంపికొనెను. తరువాత నీయంత్రకల్పనకారుఁడు తనయంత్రముతో జక్రవర్తికడకు రప్పింపఁబడెను. చక్రవర్తియు వాని బుద్ధికుశలత్వమునకు మెచ్చుకొని బొమ్మలతోడ బట్టలు నేయుటకు మగ్గములలోఁ జేయవలసిన మార్పులనుగూర్చి వానితోడఁ బ్రసంగించుటకు రెండుగంటలకాలము వినియోగించెను. తరువాత నితనికి దొరతనమువారి శిల్పవిద్యాశాలయందు నుద్యోగమియ్యఁబడి జీవనార్థము తగిన జీతమేర్పఱచఁ బడెను.

శిల్పవిద్యాశాలయందు బ్రవేశపెట్టఁబడిన తరువాతఁ దాను బాగుపఱచిన మగ్గమునకుఁ జేయవలసిన మార్పులన్నిటిని పూర్తిచేయుటకుఁ బూనుకొనెను. ఆకాలములో నాతఁడు కనిపెట్టఁగలిగిన ప్రధానయంత్రము తనంతటఁ దాను జేసి ప్రసిద్ధిఁగాంచిన వాకాన్సనుచేఁ జేయఁబడిన పూలపట్టు నేయునట్టిమగ్గముగా నుండెను.

వాకాన్సను యంత్రనిర్మాణబుద్ధి కౌశలముగలవాఁడై యుండెను. ఆతని యందు కల్పనాశక్తియనివార్యమై దట్టముగా నలుముకొని యున్నది. కవికిఁ గవితాశక్తిసహజమైనటుల నీతనికిఁ గల్పనాశక్తి సహజమయినదిగా నుండెను. ఇతఁడు చిన్నవాఁడుగనుండి భానువారమునాఁడు తల్లితోఁ గూడి మతబోధ వినుకాలమున బీటలువాఱినయడ్డుగోడ సందులలోనుండి సమీపమునందలి గదిలోనున్న గడియారములో దిరుగుచుండు భాగమును వీక్షించుచుండెను. ఆవిషయము వాని మనస్సునఁబట్టి వాఁడాదినము మొదలుకొని పెక్కునెలలు దానిం దెలిసికొనుటకై ప్రయత్నించి తుదకు దేనివలన నయ్యది తిరుగుచున్నదో యాప్రధానమార్గమును దెలిసికొనఁ గలిగెను.

ఆకాలమునుండి యంత్రకల్పనావిషయమే వాని నాకర్షించి స్వాధీనములోనుంచుకొనెను. తాను చేసిన మోటపనిముట్లతోడ సరిగా గంటలు కొట్టునట్టి కఱ్ఱగడియారము నొకదానిని నిర్మించెను. ఒకచిన్న గుడికొఱకుఁ దమంతటఁ యవి విసరుకొనునట్టి ఱెక్కలుగల దేవతలను బోలిన విగ్రహములను జేసెను. తనంతట నడచునట్టి యంత్రమును కనుగొనుటకై శారీరశాస్త్రము సంగీతశాస్త్రము, యంత్రగతిశాస్త్రము మొదలగునని నేర్చుకొనుటకై పెక్కేండ్లు కృషిచేసెను. పిల్లనగ్రోవిని విన్న తరువాతను జూచిన తరువాతను సంగీతమును బాడు నొక యంత్రమును గనిపెట్టవలెనని కృషిచేసి తుదకు విజయము గాంచెను. ఈప్రకారముగా నాతఁడనేక యంత్రములను గనిపెట్టఁ గలిగెను.

ఇతఁడు కల్పించిన పట్టుయంత్రమును జూచి జాక్వార్డు దానిపైన మార్పులుచేసి తన నేతమగ్గను బూర్తిపఱచెను. తనయంత్రముతో విలువ యైనపట్టు పెక్కుగజముల పొడవుగల దారమును జేసి చక్రవర్తికి సమర్పించు కొనెను. నెపోలియన్ చక్రవర్తి వాని కల్పనాశక్తికి మిక్కిలి సంతోషించి జాక్వార్డు కల్పించిన మగ్గము మాదిరి పెక్కు మగ్గములు నిర్మించి యాతని

కీయవలసిన దని యుత్తరువు చేసెను. తరువాత జాక్వార్డు లైయాన్సునకు మరలిపోయెను.

అచట యంత్రకారులు పొందిన దురవస్థనే యాతఁడును బొందవలసి వచ్చెను. తన పట్టణవాసులవలనఁ దా నొకశత్రువుగాఁ జూడఁబడెను. లంకాషియరులో ఆర్క్రైటును జూచినటులఁ జూచిరి.

ఈక్రొత్తమగ్గము తన వర్తకమునకు మృత్యువని పనివాండ్రు తలంచి తమనోటియందలి రొట్టెను మ్రింగివేయు నని భయపడసాగిరి. అంతట నొక ప్రదేశమున గలకలముతోఁ గూడిన యొకసభ చేయఁబడి యందు యంత్రముల నన్నిఁటిని నాశముఁ జేయుటకు నిశ్చయింపఁబడెను. జాక్వార్డు నానావిధముల దూషింపఁబడుచుండెను. జాక్వార్డు చిత్రపటమునం దురితీయఁబడెను. ఈ యల్లకల్లోల మణచివేయుటకుఁ బ్రయత్నించిన వారలు కూడ మూర్ఖజనాభిప్రాయమునకు లోనయి జాక్వార్డు మగ్గములలో నొకదాని నెత్తికొనిపోయి ముక్కలుచేసి వైచిరి. అనేక స్థలములయందు ద్వంద్వయుద్ధములు నడచెను. అందులో నొక దొమ్మియందు జాక్వార్డు క్రోధమూర్తులయిన యామూర్ఖజన సమూహముచే ఘట్టము పొడవున నీడ్వఁబడి నీటఁ ద్రోయఁబడుటకు సిద్ధముగ నుండు కాలమునఁ దప్పింపఁబడెను. జాక్వార్డు మగ్గముయొక్క గొప్పవిలువ నెవ్వరును దృణీకరించి యుండలేదు గాని దాని విజయమును జూచుటకు కాలము రావలసియుండెను. ఇంగ్లీషు పట్టునేతకాండ్రు కొందఱు జాక్వార్డును ఇంగ్లాండుదేశమునకుఁబోయి యచటనే కాపుర ముండుమని హితవు గఱపిరి. తన పట్టణవాసులచే నిట్టి క్రూరదండనమును బొందినను వాని దేశాభిమానము వానిని వారి యభిప్రాయము నంగీకరించునట్లు చేయలేదు. అయినను ఇంగ్లీషుపనివాండ్రు వాని మగ్గమునే మాదిరిగాఁ గొని పనిచేయ నారంభించిరి. అప్పుడు మాత్రమే లైయాన్సు పురవాసులు తమవ్యాపారమును మించిన వ్యాపారమును ఇంగ్లీషుపనివాండ్రు చేయుచుండుటను దలపోసి

తాము జాక్వార్డుమగ్గము నుపయోగించినఁ గాని వారలతోఁ దులతూఁగఁ జాల మనుసంగతి దెలిసికొనిరి. అప్పుడు వారలు కొలఁదికాలముననే జాక్వార్డు మగ్గము నన్ని నేతపనులయందును బ్రవేశపెట్టిరి. అంతట పనివాండ్రు తామింక భయపడవలసినపని లేదని దెలిసికొనిరి. పనితగ్గించుటకు బదులుగా జాక్వార్డు మగ్గము పదిరెట్లుపని గల్పించెను. లైయాన్సు నగరమున 1833 సంవత్సరమున 60, 000 జనులకుఁ బనిగలిగియుండెను. ఆసంఖ్య క్రమక్రమముగాఁ బెలుగు చున్నది.

తరువాత జాక్వార్డు జీవితము సుఖప్రద మైనదిగా నుండెను. ఏజను లాతనినీటఁ బడఁద్రోచి ముంచివేయఁదలంచిరో తరువాత నాజనులే యాతని విజయమును దెలుపుటకై యాతని జన్మదినమహోత్సవము నేటేటజరుపసాగిరి. కాని జాక్వార్డునకుఁ గల వినయము వాని నామహోత్సవములకు దూరముగ నుంచుచువచ్చెను. నగరపారిశుద్ధ్య విచారణసభవారు వానియంత్రము నగరము లోని నేతపనుల యభివృద్ధికై వినియోగించి పాటుపడవలసినదిగాఁ గోరినం దున నతఁడందుల కంగీకరించెను. అందునకుఁ బ్రతిఫలముగా వారివలన నుప కార వేతనముఁ బొందుచువచ్చెను. అఱువదవయేట పనిచాలించుకొని తన తండ్రి జన్మస్థాన మగుక్విల్లిన్సు పట్టణమునకుఁ బోయి తన యవసానదశ నచట గడపెను. అచట నున్నకాలముననే దొరతనము వారివలనఁ బెక్కు బిరుదములను గౌరవ సమ్మానములనుఁ బడసెను. అతఁడు 1834వ సంవత్సర మున మృతినొందెను. వానియెడ గృతజ్ఞతను జూపుచుఁ బ్రజలు వాని ప్రతి మను నిర్మించిరి.

ఈప్రకారముగా స్వలాభమునుగోరక స్వదేశవ్యాపారాభి వృద్ధికై యంత్రకల్పనమునందు బుద్ధినివినియోగించి అహోరాత్రములు తదేకనిష్ఠాగరిష్ఠు లై బహుకష్టము లనుభవించుచుండియు, పట్టినపట్టు విడువక కృషిచేసి విజయ మునుగాంచియు, మూర్ఖులయిన పనివాండ్రవలనఁ దొలుత దేశద్రోహులుగాఁ

బరిగణింపఁబడి ద్వేషింపఁబడి బాధింపఁబడియు, తుదకు శాశ్వతకీర్తి నిబ్బాంకి దేశమునకు మహోపకారులయి తమ జీవచారిత్రమును ముగించినవారలు నూర్లకొలఁది యుండియున్నారు. ప్రస్తుతము వారలనెల్లవిడిచి యొక్కని వృత్తాంతము మాత్రము సంగ్రహముగాఁ దెలుపుచున్నాఁడను. చిక్కుదీయు యంత్రమును గనిపెట్టుటకై పెక్కు కడగండ్లకులోనయిన జోషువా హెయిల్‌మాను యొక్క చరిత్రమును వినుఁడు.

ప్రత్తిపనులకు ముఖ్యస్థాన మగు మూల్‌హౌసు గ్రామమున 1796వ సంవత్సరమున హెయిల్‌మాను జనించెను. హెయిల్‌మాను పదునైదవయేఁట నాపనియందుఁ బ్రవేశపెట్టఁబడెను. తీరుబడికాలము యంత్రముల వ్రాయుపని యందు గడపుచు రెండుసంవత్సరముల కాల మాయుద్యోగమున నుండెను. తరువాత రెండుసంవత్సరములు పారిసునగరమునందలి తన పెదతండ్రిదైన వడ్డివ్యాపారగృహమునఁ గడపెను. సాయంకాలముల గణితశాస్త్రము నభ్యసించుచువచ్చెను. వాని బంధువులు కొందఱు మూల్‌హౌసు గ్రామమునఁ బ్రత్తివడకునట్టి యొక చిన్న యంత్రశాలను నిర్మించి యీ చిన్నవానిని పారిసునగరమందలి "టిస్సాటు, రే" యను సంఘమువారికడఁ బని నేర్చుకొన నియమించిరి.

అతఁ డాకాలమునందె యానగరమునందలి చిత్రశిల్పవిద్యాశాలయందు విద్యార్థిగాఁ బ్రవేశించి శిల్పవిద్యాబోధకము లయిన యుపన్యాసములను వినుచు చిత్రవస్తుప్రదర్శనశాలలోనుండు యంత్రములను శోధించుచుండెను. మఱియు నాతఁ డాట బొమ్మలను జేయు పనివానివద్ద నాపనులను జేయు విధానమునుగూడ నేర్చుకొనెను. కొంతకాల మయినతరువాత తన స్వస్థలమునకు మరలివచ్చి వీక్సుథా నను ప్రదేశమునఁ దనబంధువులచే నేర్పఱుపఁబడిన యంత్రము పనిసాగించుటకై కార్యనిర్వాహకత్వమును వహించి యంత్రముల నమర్చించి పనిచేయుటకుఁ బ్రారంభించెను. అంతట వర్తక సంబంధ

మయినచిక్కు తటస్థించి యాయంత్రశాల పరాధీనము చేయవలసివచ్చి హె-
యిల్‌మాను మూల్‌హౌసు గ్రామమునకుఁ బోయెను.

ఈమధ్యకాలము వ్యర్థముగాఁ గడపక నూత్న యంత్రకల్పనమునందు తనబుద్ధిని వినియోగించి బుటేదారిపనులు చేయు యంత్రమును గనిపెట్టవలెనని ఆఱునెలలు కృషిచేసి విజయమును బొందెను. ఆయంత్రమును గల్పించినందులకు 1834 వ సంవత్సరమున బంగారుపతకమును బహుమానము గాంచెను. మఱియు నింక బిరుదముల ననేకములను బొందెను. ప్రత్తి, పట్టు మొదలగువానితో సంబంధించిన చిన్న యంత్రములను బెక్కింటిని నిర్మించెను. ఆయంత్రములలో సొగసైనదియు, వానిబుద్ధివిశేషమును దెలుపునదియు నగు చిక్కుదీయు యంత్రము ప్రధానమయినది. ఈయంత్రమును గనిపెట్టుటకై కొన్ని సంవత్సరములు హెయిల్‌మాను మిక్కిలి శ్రద్ధవహించి పనిచేయవలసియుండెను. అట్టి యంత్రము లేనిహేతువుచేత విస్తారము సరకు పనికి నక్కు అకురాక చెడిపోవుచుండుటచేత ఆల్సేసుపట్టణమునందలి ప్రత్తివ్యాపారము నడపు పనివాండ్రాయంత్రమును గనిపెట్టినవారికి 5000 ఫ్రాంకులు బహుమానము చేసెదమని ప్రకటించిరి. ఆబహుమానమును బడయుటకై వాఁడు ప్రయత్నించెను. వాఁడట్లు ప్రయత్నించినది ధనాశచేత గాదు. వానిభార్యవలన వానికి విశేషభాగ్యము లభించియుండెను. ఆయంత్రమును దానుగల్పించి మేలొనర్పవలెనన్న వాంఛచేతనే వాఁడాపనికిఁ బూనుకొనియెను. అందులకై వానికిఁ గొన్ని సంవత్సరములు పట్టెను. భార్యవలన లభించిన భాగ్యమంతయు నంతరించెను. దారిద్ర్యస్థితి ననుభవింపవలసి వచ్చెనుగాని యంత్రనిర్మాణమునందుఁ గృతార్థుఁడుగా లేకపోయెను. అప్పటినుండియు మిత్రులవలన సహాయమును బొందవలసి వచ్చెను.

ఇటువంటి కష్టములతోను దారిద్ర్యముతోను వేగుచున్న కాలమునందే తనభర్త చెడిపోయెనన్న దుఃఖముచేత బెంగపెట్టుకొని భార్య మృతినొందెను.

అంతట నతఁడింగ్లాండు దేశమునకు వెడలిపోయి మాంచెస్టరు నగరమున వాస మేర్పఱచుకొని ఆయంత్రమునకై పాటుపడుచుండెను. ఒకనాఁడు సాయంకాలమున యంత్రకల్పన కారులయొక్క దురవస్థనుగూర్చి తలపోయుచుండగ కొమార్తెలు తల దువ్వుకొనుచు చిక్కుడీసుకొను విధానమును గన్నులారఁ జూచి తనయంత్రము చేయునట్టివిధము నాలోచించెను. వానికిఁ జక్కనిమార్గము గానిపించెను. తుద కాయంత్రమును బాగుపఱచి తానూహించిన పనికనుకూల మయినదానిగాఁ జేసి కృతార్థుఁ డయ్యెను. ఆయంత్రము నూలువడకువాండ్రకు మహోపకారి యయ్యెను. దానివలన నొకపౌను భారము గలిగిన దూదితో 334 మైళ్ళ పొడవుగల దారము చేయుట కనువయ్యెను. ఆయంత్రకల్పనముయొక్క ప్రయోజనమును ఇంగ్లీషుపనివాండ్రు బహువిధములుగా మెచ్చుకొనిరి. లంకాషియరులోని ఆఱుగురు దూదివర్తక సంఘములవారు గలిసి దానిని 30, 000 పౌనులకు కొని యితరు లెవ్వరు వినియోగింపకుండఁ జేసిరి. ఉన్నివస్త్రములు నేయు సంఘములవారలదే మొత్తము నిచ్చి దానిం గొని దూదివర్తకులవలెనే శాసించిరి. నారవడకు వర్తకసంఘములవారు 20, 000 వేలిచ్చిరి. ఈప్రకారముగా వాని పంట ఫలించినది. కాని యాయైశ్వర్యము పూర్ణముగాననుభవించుటకు వాని కాయువు లేకపోయెను. వాఁడు మృతినొందిన పిమ్మట వానితోఁ గష్టము లనుభవించినవానికొమరుఁ డాభోగముల ననుభవించి తండ్రికిఁ గీర్తి దెచ్చెను.

అనేకు లిట్లు పాటుపడి తమ ప్రాణము లర్పించిన కతమున నింగ్లాండు దేశముయొక్క నాగరికత మించినది



## పండ్రెండవ ప్రకరణము.

---

## సామర్థ్యము——ధైర్యము.

పశ్చిమఖండములయం దొకకాలమున నెల్లెడల వ్యాపించియుండిన దాస్యవ్యాపారమును మాన్పి నీగ్రోజాతివారిని దాస్యమునుండి విముక్తినొందించుటకుఁ బ్రయత్నించిన వారిలో గ్రాన్విల్లీషార్పు మొదటివాఁడు. ఇతనికిఁగల పట్టుదలయును, సామర్థ్యమును, ధైర్యమును నిరుపమానములు. ఇఁతడు చూపిన మార్గము ననుసరించి ధైర్యసాహసములుఁగల పరోపకారసారిణు లయిన క్లార్కుసన్, విల్బరుఫోర్సు, భక్టాను, బ్రోహాము మొదలగు మహానుభావులు వర్తించి నీగ్రోజాతి కంతకును మహోపకారమును గావించిరి. ఏజాతివారైనను, ఏదేశవాసు లయినను, ఏమతావలంబకు లయినను, తమవలె భూతలమున మానవజన్మ మెత్తియు, నాగరికాగ్రగణ్యు లయినవారిచే ననాగరికులు బాధింపఁ బడుచుండినప్పుడు దైవభక్తియు, పాపభీతియుఁగల నీతిగుణసంపన్నులగువారు కన్నులారఁ జూచుచు నూరకుండఁజాల రనుటకు మనము గ్రాన్విల్లిషార్పును దృష్టాంతముగఁ గైకొనవచ్చును. ఇతఁడు మొట్టమొదట నొకనారబట్టల వర్తకునియొద్ద నౌకరుగఁ బ్రవేశించి జీవయాత్ర గడపుటకుఁ బ్రారంభించెను. తరువాత శతఘ్ని కార్యస్థానమున లేకరిగా నుండెను. అటువంటి చిన్న యుద్యోగముననున్న కాలముననే సావకాశము చిక్కినపుడెల్లను నీగ్రోలస్వాతంత్ర్యమునకై కృషిచేయుచు వచ్చెను.

ఇట్టిపనియందున్న కాలమున మఱియొకనితో మతసంబంధము లయిన చర్చలుచేసి మతసత్యమును దెలిసికొనుటకై గ్రీకు, హీబ్రూభాషల నభ్యసించెను. కాని పరోపకార విషయమునఁ జేసిన కృషి యధికమయి సత్ఫలముల జనింపఁజేసెను. తన సోదరుఁడగు విల్లియము వ్రణవైద్యుఁ డగుటచేత నాతఁ

డెప్పుడును బీదలకుఁ జికిత్సచేయువాఁడుగానుండి వారలకు చికిత్సోపాయ
ములఁ దెల్పుచుండెను. అతని చికిత్సాశాలకువచ్చిన బీదవారిలో జోనాదను
స్టారింగు అను నీగ్రోజాతివాఁ డొకఁడు. ఈనిర్భాగ్యుడు తనయజమాని
యైన యొకన్యాయవాదిచే నతిక్రూరముగాఁ జూడఁబడి కుంటివాఁడును కొం
చెము గ్రుడ్డివాఁడునై పనిచేయ శక్తిలేక యుండెను. వీనివలన నుపయోగము
లేక యుండుటను జూచి యజమాని విడిచిపుచ్చెను. పరదేశమున దిక్కులేని
పక్షియై తినఁగూడును, కట్టబట్టయును, పండ మంచమును లేక వీథులలోఁ
దిరుగులాడుచుఁ దిరిపె మెత్తుకొనిజీవించుచు రోగగ్రస్తుఁడై యనేకకష్టములఁ
బడుచు నొకనాఁడు గ్రాన్విల్లీ షార్పును జూడవచ్చెను. అతఁడు వాని యవ
స్థను విచారించి మందు నిచ్చి యాదరించి యొకవైద్యశాలఁ బ్రవేశపెట్టించెను.
అచ్చట వానిరోగము నివారింపఁబడెను. సోదరులిరువురు వానిని స్వేచ్ఛగాఁ
దిరుగనిచ్చుచు వాని కొకపని గల్పించిరి. ఆపనియందుండి వాఁడు రెండుమూఁడు
వత్సరములు గడపెను. వాఁడొకనాఁడు తన యజమానురాలి బండివెనుకఁ
జనుచుండ వెనుకటి యజమాని తన చేవిడువఁబడిన బానిసవాఁడు పుష్టగాత్రు
డై యుండుటఁజూచి వానిపైఁ దనకుఁగలహక్కును స్థాపించి మేయరుప్రభు
వుగారి యుద్యోగీయులకుఁ దెలిపి వానిం బట్టుకొని పడమటి ఇండియాదీవు
లకుఁ గొనిపోవుటకై యొకయింటఁ బెట్టియుంచెను. తన యుపకారియైనషార్పు
తన్ను విపత్తునుండి తప్పించునన్న విశ్వాసముతో నాబానిసవాఁడు షార్పునకు
జాబు వ్రాసి తనదురవస్థ దెలుపుకొనెను. అప్పటికి వానిపేరు మఱచియున్న
వాఁడయ్యును, వానివృత్తాంతమును కనుగొని రమ్మనిషార్పు మాతను బంపెను.
గాని వాఁడు మరలవచ్చి "అయ్యా ఆగృహాధికారులు వాని జాడ దమ కేమి
యుఁ దెలియరాదు" అని చెప్పిరని చెప్పెను. ఆమాటలువిని యాతఁడనుమా
నించి స్వయముగా నాచెఱసాలకుఁ బోయి యానిర్భాగ్యుని గుఱించి తాను
వచ్చువఱకు వాని విడువరా దని కారాగృహాధికారికిఁ జెప్పి వెంటనే మేయ

రుపద్దకుఁ బోయి వారంటు లేనిదే వానింబట్టి చెఱసాలఁ ద్రోపించినవారిపై నభియోగము దెచ్చెను. అంతట నిరుకక్షులవారు దండశాధికారి సమక్షము నకు రప్పింపఁబడిరి. బానిసవానిని పూర్వపుయజమాని మఱియొకనికి విక్రయిం చునట్టు విక్రయపత్రమును దండవిధాయకునకు సమర్పించెను. ఆక్రొత్త యజ మాని బానిసవాఁడు తనవాఁడని తనహక్కు స్థాపించుటకై వాదించెను. బానిసవాఁడు నేరము చేయనందున దండవిధాయి వానిని విడిచిపుచ్చి వాని స్వాతంత్ర్యమునుగూర్చి పరిష్కరించుటకుఁ దన కధికారములేదని తీర్పుచె ప్పెను. అంతట నాబానిసవాఁడు పార్పును వెంబడించి పోయెను. తరువాత వానియజమాని వెంటనే పార్పునకుఁ దనమనుష్యుని దనకిమ్మనియు, లేనిపక్ష మున వ్యాజ్యము దెత్తుననియుఁ దెలియచేసెను.

ఆకాలమునం దనఁగా 1767-వ సంవత్సరమున ఇంగ్లీషువాని స్వాతం త్ర్యము చక్కఁగాఁ గాపాడఁబడునది గాక ప్రతిదినము నుల్లంఘింపఁబడు చుండెను. సముద్రముల మీఁద నౌకరి చేయుటకై మనుష్యులకు నొత్తుడు కలుగఁజేయుచుండిరి. తూర్పు ఇండియా వర్తకసంఘమువారి కొఱకు మనుష్యు లను దొంగిలించుటకు గాను పట్టణములయందును పల్లెలయందును మనుష్యుల నెత్తుకొని పోవువారు వెదకుచుండిరి. అట్టివారు లండను నగరము కావస్యము నందు నెక్కువగా నుండిరి. ఇండియాదేశమున లేనియెడల వారలను అమెరికా ఖండములోని దేశములకుఁ బంపుచుండిరి. లండను లివర్పూలు వార్తాపత్రిక లలో నీగ్రోబానిసవాండ్ర విక్రయమును గూర్చిన ప్రకటనలు ప్రచురింపఁబడు చుండెను. బానిసవాండ్రను గూర్చిన ధర్మశాస్త్రములు సందేహాస్పదము లయి నవిగా నుండెను. ప్రసిద్ధి కెక్కిన న్యాయవాదు లనేకులు భిన్నాభిప్రాయము లిచ్చుచుండిరి. ఈబానిసీఁ డింగ్లాండుదేశమునకు వచ్చుటచేత దాస్యమునుండి విముక్తిఁ గాంచినాఁ డనియు, నిర్బంధించి మరలఁ గొనిపోరాదనియు, కొందఱు న్యాయవాదులు పార్పునకుఁ దెలియఁ జెప్పిరి. ప్రధాన న్యాయాధి

పతియైన మాన్సుఫీల్డు ప్రభువును, ప్రసిద్ధికెక్కిన న్యాయవాదులును దాసిన వాఁ డింగ్లాండునకు వచ్చినంతమాత్రమున స్వాతంత్ర్యమును బడయ నేరఁడనియు, చట్టముల ప్రకారము తిరిగి స్వస్థానములోని తోఁటలకుఁ బోవునటుల నిర్బంధింపవచ్చుననియు నభిప్రాయులై యుండిరి.

అట్టి యభిప్రాయము గ్రాన్విల్లీ షార్పుకంటెను ధైర్యవిహీనులయిన వారికి నిరుత్సాహమును గలిగించి యుండునుగాని గ్రాన్విల్లీ దానిని చిన్ననాట నుండి తా నందునిమిత్తము పోరాడి నీగ్రోలను దాస్యమునుండి విముక్తులఁ జేయ దృఢసంకల్పము గలిగియుండెను. న్యాయవాదులనుండి తగిన సహాయము తనకుఁ గలుగనందున నాత్మరక్షణార్థము సార్థకము లేని ప్రయత్నము చేయ వలసిన వాఁడయ్యెను. ఆతఁడు న్యాయవాది కాఁడు. ధర్మశాస్త్రమును గూర్చిన జ్ఞానము లేశమాత్రమును లేదు. అప్పటికి బైబిలును మతగ్రంథమును దక్క శాస్త్రసంబంధమైన గ్రంథము నొకదానినైనను దెఱచి యున్నవాఁడు కాఁడు. పగలంతయుఁ దాను చేయవలసిన పనితోనే సరిపోవుచుండెను. అందువలన నర్ధరాత్రములయందును, సూర్యోదయమునకు ముందును ధర్మ శాస్త్రములను ముఖ్యముగాఁ దనకుఁ గావలసిన విషయమును గూర్చిన శాస్త్ర మును బఠింపఁ నారంభించెను. అతఁడు నిజముగాఁ దానొక బానిసవాఁడ నగు చుంటినని యొప్పుకొనెను. తన మిత్రుని కొకనికి జవాబు వ్రాయనందుకు క్షమాపణముఁ జెప్పుకొనుచు నీక్రింది విధమున జాబొకటి వ్రాసియుండెను.

"ఉత్తరప్రత్యుత్తరములు జరుపుటకు నే నిప్పుడశక్తుఁడనై యున్నాను. రాత్రి నిద్రపోవకుండ మిగుల్చుకొన్న కాలమును, ప్రాతఃకాలమును అత్యావశ్యకములైనట్టియు, ఉపేక్షింపఁగూడనట్టియు, జాగ్రత్తగాఁ బరిశోధింపఁదగినట్టియు, ధర్మశాస్త్రసంబంధము లయిన కొన్ని విషయములను బరిశోధించుటకై వినియోగింపఁ బడుచుండెను.

షార్పు తనకు తీఱికగానున్న ప్రతినిమిషమును వ్యర్థము చేయక మనుష్యుని స్వేచ్ఛనుగూర్చి ఇంగ్లాండుదేశపు చట్టము లెట్లున్నవో దెలిసికొనుటకొఱకు వినియోగించుచుండెను. ఈవిధముగా రెండు సంవత్సరములు పార్లమెంటు మహాసభయొక్క ముఖ్యశాసనముల నన్నిటిలో నుండియు, న్యాయాధిపతుల తీర్పులనుండియు, ప్రసిద్ధ న్యాయవాదుల యభిప్రాయముల నుండియు వివిధవిషయముల నెత్తి వ్రాయుటయందుఁ గడపెను. బహుప్రయాససాధ్యమయిన యీవ్యాపారమునందు సలహా చెప్పువాఁడు కాని, సాయపడువాఁడు కాని, బోధకుఁడుగాని వానికి లేక యుండెను. తాను పూనిన కార్యమున కనుకూలముగా నభిప్రాయము నిచ్చునట్టి న్యాయవాది యొక్కఁడయినను నాతనికిఁ గానరాలేదు. అతఁడు పరిశోధించిన విషయము లాతనికిఁ దృప్తికరములుగా నున్నను న్యాయవాదులకు నాశ్చర్యకరములై యుండెను. "దేవునకు వందనము సమర్పింపవలెను ; ఇతరులను దాస్యమునకు లోఁబఱచి నిర్బంధించుటను సమర్థించునట్టిది నే నెఱిఁగినంతవఱకు నింగ్లీషు ధర్మశాస్త్రమునం దేమియు గానరాదు" అని వ్రాసెను. అతఁడు దృఢమైన విశ్వాసమును గలిగి యుండెను ; ఆవిషయమున నాతని కేమాత్రమును సంశయము లేక యుండెను. తనయొక్క శాస్త్రపరిశోధనసారమును సంగ్రహముగా వ్రాసిపెట్టియుంచెను. 'ఇంగ్లాండునందు దాస్యమునెడ సహనము వహించియుండుట అన్యాయము" అని పేరుపెట్టి యాగ్రంథప్రతు లనేకములు దేశమునందు ప్రసిద్ధులయిన న్యాయవాదులకుఁ బంపించెను. వాదిగా నుండిన న్యాయవాది యిట్టి పట్టుదల గలిగిన మనుష్యునిలో వాదించి జయము నొందుట కష్టసాధ్యమని యెంచి వాయిదాలను గోరుచు తుదకు సంధికొఱకుఁ బ్రయత్నించెను గాని గ్రాన్విల్లీ యందున కొప్పుకొనక పోయెను. దీనిని చదువుకొని వాదిపక్షమున నున్న న్యాయవాదులు వెనుదీసిరి. అందుల ఫలిత మేమనఁగా వాది తన వ్యాజ్యెమును నడిపింపక పోవుటయేగాక మూడింతలు వ్యయభారము వహింపవలసి వచ్చెను. ఆగ్రంథము 1769-వ సంవత్సరమున ముద్రింపఁబడెను.

ఈ మధ్యకాలమున లండను నగరమున నీగ్రోజాతివారి నెత్తుకొనిపోయి విక్రయార్థము పడమటి ఇండియాదీవులకుఁ బంపుటకై యోడలకుఁ జేర్చుటయు మొదలగునవి సంభవించి వివాదములు తటస్థించినవి. అట్టి వివాదము షార్పునకుఁ దెలియవచ్చినప్పుడు వెంటనె యానీగ్రో వానిని సంరక్షించుటకుఁ బ్రయత్నించుచు వచ్చెను. ఈప్రకారముగా హైలాసను నాఫ్రికాఖండ వాసుని భార్య పట్టుకొనఁబడి బార్బడోసు ద్వీపమునకుఁ బంపఁబడెను. అటుపైని షార్పు హైలాసు పేరిట నేరము చేసిన వానిమీఁద నభియోగమును దెచ్చెను. నష్టమునకుఁ దీర్పుఁ బొందెను. హైలాసు భార్య స్వేచ్ఛగా మరల నింగ్లాండునకుఁ గొనితేఁబడెను.

మొదటి భాగము.

# విజ్ఞానచంద్రికాపరిషత్తు

1912 వ సంవత్సరపు

పఠనీయగ్రంథములు

I సాహిత్యము:

| | |
|---|---|
| (1) శ్రీరామచరిత్రము (పోతనభాగవతము లోనిది.) | 0—6—0 |
| (2) వసుమతీవసంతము (నవల) | 1—8—0 |

II చరిత్రము:

| | |
|---|---|
| (1) మహమ్మదీయమహాయుగము. | 1—12—0 |
| (2) స్వయంసహాయము. | 0—8—0 |

III ప్రకృతిశాస్త్రము.

| | |
|---|---|
| (1) భౌతికశాస్త్రము. | 1—8—0 |
| (2) ఆరోగ్యశాస్త్రము. | 1—4—0 |

ఏయేగ్రంథమునందెంతెంత చదువవలసినదియు పరిషత్తును గూర్చియు వివరముగ తెలిసికొనగోరువారు మాకు వ్రాయవలెను పరిషత్పరీక్షయందు గడతేరినవారికి రు 316-0-0లును అనేక బంగారు పతకములును బహుమాన మొసంగఁబడును.

విజ్ఞానచంద్రికా బుక్కుడిపో

చింతాద్రిపేట - మద్రాసు.

# విజ్ఞానచంద్రికా గ్రంథమాల

## నియమములు

1. దేశాభివృద్ధికి ఆవశ్యకములైన గ్రంథములు ప్రచురించి భాషాభివృద్ధి చేయుటయే యీ గ్రంథమాలయొక్క యుద్దేశము. ఇందు సంవత్సరమునకు రమారమి 1600పుటలు గల స్వతంత్రములైన గ్రంథములు నాలుగు ప్రచురింపఁబడును.

2. కొందరు తలఁచినట్లు ఇది మాసపత్రిక కాదు. ఇందు 1. దేశదేశముల చరిత్రములును, 2. పదార్థవిజ్ఞాన శాస్త్రము (Physics), రసాయనశాస్త్రము (Chemistry), జీవశాస్త్రము (Biology), వృక్షశాస్త్రము (Botany), మొదలయిన ప్రకృతిశాస్త్రములును, 3. దేశోపకారులగు కొందరు మహనీయుల చరిత్రములును, 4. ఇంగ్లీషునందలి ఉద్గ్రంథముల భాషాంతరీకరణములును మాత్రము ప్రచురింపఁబడును. కావ్యనాటకాదులిందుండవు. చరిత్రానుసారములగు కల్పితకథలు (Historical Novels.) గూడ ప్రచురింపఁబడును.

3. ఈగ్రంథమాలలో నిదివరకు అచ్చువేయబడిన గ్రంథముల నన్నిటిని కొనుచు, నికముందు సం॥ రమునకు నాలుగు చొ॥ ప్రచురింపబడు గ్రంథముల నన్నిటిని గొనుటకు నొప్పుకొనువారు శాశ్వతపు చందాదారులు.

4. శాశ్వతపు చందాదారులకు ఈగ్రంథమాలలోని గ్రంథములన్నియు నంచెకూలి మేమే భరించి, నూరుపుటలకు రు0-4-0 చొప్పుననిచ్చెదము. ఇతరులకు ఈపుస్తకములుఅంచెకూలిగాక నూరుపుటలకు రు0-6-0చొ॥నీయబడును. సం॥ రము ఒక్కింటికి 1600 పుటలకంటె నెక్కువపుటలుగల గ్రంథములు మేము ప్రచురించముగాన, చందాదారులకు సం॥ రమునకు రూ. 4-0-0కంటె నెక్కుడుకర్చు కానేరదు.

5. శాశ్వతపుచందాదారులుసంవత్సరపుచందా మొదటనీయనక్కఱలేదు. ఒక్కొకపుస్తక మచ్చుపడఁగానే అది వ్యాల్యూ పేయబిల్ ద్వారాపంపబడును.

6. వెనుకటి పుస్తకములనన్నిటినిగొను చందాదారులు 0-4-0 లుప్రవేశరుసుముక్రింద చెల్లించవలెను. ఈ సొమ్ము దరఖాస్తుతో పంప వచ్చును. లేదా మేము మొదటపంపు వి. పి. లో చేర్చి రాబట్టుకొందుము. వెనుకటి పుస్తకములనన్నిటిని ఒక్కసారికొనలేని వారు రు 5-0-0 ల వెలగల పుస్తకములు మొట్టమొదట కొనిన జాలును. మిగతా పుస్తకములు క్రమేణ తెప్పించుకొనవలెను.

7. వెనుకటి పుస్తకములు అక్కరలేనివారును, లేక కొన్ని మాత్రమే కావలెనను వారును ప్రవేశరుసుముక్రింద రు 1-0-0 చెల్లించవలెను.